ద్వితీయ కుసుమము ఓమ్ తత్సత్ ప్రథమ భాగము

# ఏది సత్యము ?

## (ఆధ్యాత్మిక సందేశములు)



రచయిత

'కీర్తన కంఠీరవ' 'కవివతంస' 'కవి తిలక'

'కథాభారతి' బిరుదాంకితులు

కోట సుబ్బారాయగుప్త భాగవతుడు

ప్రకాశకులు

శ్రీ రేపూరు పద్మనాభశెట్టి చారిటీస్‌వారు మద్రాస్

# విషయ సూచిక



## ఏది సత్యము ?

శ్రీ శ్రీ శ్రీ లక్ష్మీనృసింహ కళావతారము



శ్రీ శ్రీ శ్రీ సద్గురు యోగానంద నరసింహ మహర్షి

# అంకితము

సకల చరాచరజీవకోటి హృదయాంతరములయందేకమై నిత్యసత్య నిర్వికారస్వరూపమై వేదములకు మూలమై, భూనభోంతరాళములం దెల్లెడల నిండినదై, ప్రణవస్వరూపమై, ప్రకృతికతీతమై ఆదికాదియై యనాదికిపునాదియై సత్యమునకు మూలమై. చలన శక్తికిశక్తియై వెలుగునకు వెలుగై, యాద్యంతములులేని నిరాకార నిర్గుణ నిత్యానందస్వరూపమై, సకలలోక సదాశ్రయమై, సర్వమత ప్రవక్తల ధ్యేయాకారమై సమస్తమున కాధారమై, సృష్టి స్థితి లయకర్తలకు కర్తయై. స్వయంవ్యక్తమై, యఖండ మండలాకారమై, శిష్టజనోద్ధరణమునకై పరమ శాంతిస్థానమైన, అహోబిల మహాక్షేత్రమున దానవసార్వభౌముని దర్బారునందున్న యుక్కుస్తంభమునందావిర్భవించిన శ్రీశ్రీశ్రీ నృసింహస్వామివారి, దివ్యభవ్య నవ్యకళావతార సంపన్నులు, యోగసమాధి నిష్ఠాగరిష్ఠాత్ములు, కరుణాస్వరూపులు, ధర్మరక్షకులు గోపరిపాలకులు, జీవుల జన్మాంతర భవితవ్య స్థితిగతులను యథాతథముగ వ్యక్తముచేసి. సంశయరహితుల నొనర్చెడి మహామహిమాన్వితులు, దివ్యయోగ సమాధియందుండి స్వయంశక్తి ప్రభావముతో, తన భక్తులను కవచమురీతి సదాసంరక్షించుచు, శ్రీమదఖిలాండకోటి బ్రహ్మాండ ఖాండాంతర మహీమండల భరత ఖండాంతర్గత శ్రీ కపిలగిరి

# శ్రీ నృహరి లీలావిలాసము

ఆదికాలమునుండి నేటి నవీన దశవరకు నార్యఋష్య సంజాత మగు వైశ్యజాతియందెందరెందరో నిరుపమాన దానధర్మ దైవపుణ్య కార్యకర్మము లొనర్చుచునేయుండిరి.

ఎన్నో మతములు విజృంభించి ప్రజాహృయ రంగస్థలముల వివిధ రీతుల నృత్యములొనర్చినను వైశ్యులుమాత్రము వానియందెట్టి ప్రమే యము లేక వాటి నిజస్వరూప వైఖరులను గమనించుచు లోకోపకారము లగు సాత్త్వీక తాత్త్వీక విషయములం దలదూర్చి శక్తివంచనలేని దాతృతా గరిమచే నిస్స్వార్థసేవాపరాయణులై నిర్విరామకృషిసల్పి, మానవకోటి నల రించి దైవీసంపద్విభూతితో విరాజిల్లుచుండిరి.

ఇట్లు మహోన్నతవిభవాదులతో వెలుగొందుటకు కారణము లేక పోలేదు. గతమునందు జీవులొనర్చిన సత్కర్మలప్రభావమే ప్రధానమై ప్రత్యక్షముగా భాసిల్లుచున్నది. కర్మసిద్ధాంతమును కాదనుటకెట్టి ప్రమా ణములు లేవు.

స్థిరచరాది వస్తువాహనాదికము లుండినను లేకుండినను వైశ్య సమాజమెట్టి యాటంకములులేక సుఖజీవన మొనర్చుటకు కారణమేమై యుండునో గుర్తించితిరా ?

అది వారొనర్చిన పుణ్యకర్మాదులపర్యవసాన ఫలాఫల స్వరూప సాక్షాత్కారమేయని సర్వులకు వ్యక్తమగుచున్నది.

కుల మత వర్గ జాత్యాది సమస్యలను త్రోసివేసి సత్యపరిశీలన మొనర్చిన ప్రతి భారతీయునకు సత్యమేదో ? యసత్యమేదో యవగత మగును.

తానెన్ని తార్కికసమస్యలకు పరిష్కారమార్గ మెఱింగినను, లోకమువంతటిని తన వైఖరీ వాక్ప్రభావముతో వశమొనర్చుకొని దివ్య స్వైరవిహార మొనర్చినను తన కర్మకు తానే కర్త. కర్మఫల మనుభవించక తప్పించుకొని చరించుటకెట్టివరుదనకు సాధ్యముకాదు.

ఇట్టి కర్మసూత్ర రహస్యము నెఱింగిన ప్రతి మనుజుడు లోకోద్ధరణ కార్యక్రమములను యథాశక్తి నిర్వర్తించుచు సాత్త్వికజీవనుడై సదా దైవభక్తి తత్పరుడై మెలగుచు నిత్యశాంతితో హాయిగా నాత్మానందమును బొందుచుండును.

ఆత్మశాంతికి కారణములైనవి దోహదములైనవి సతీ సుతాది భోగ పరంపరలుగావని భారతీయ ఋషు లేనాడో శ్రుతి స్మృతుల రూపముతో సమాజమున కందించిరి.

ఇట్టి నగ్నసత్యాంశములను రూపొందించి సమాజమునకందించి దివ్య చైతన్యమును గలగించపలెనన దైవకృపాప్రసారమునకు పాత్రుడైన కవి పుంగవునకే సాధ్యము.

ఆదర్శజీవితయానముగల కవివరుడెంతో కృషితో నుపాస్య దైవ శక్తితో సర్వమతరహస్యార్థ ప్రతిబోధకమగు మహారచనను సంపూర్తి చేసినను, సమాజమున కుపయోగముకాదు. కారణ మేమన ? ఆదర్శభావ సముదాయముతో నగ్నసత్యాంశముల కివి రూపొందించినను నా రచన పొత్తముగా రూపొంది లోకమున ప్రచారమగుటకు లక్ష్మీప్రసాద లబ్ధమానసులైన త్యాగధనుల యార్థికసహాపంపత్తి ముఖ్యావసరమైయున్నది.

లోకోద్ధరణమున కుపయోగమయ్యెడి దివ్యరచనలను ముద్రణ చేయించి కవిహృదయమను రంజింపచేసి ముముక్షుజన సహస్రముల కాపొత్తముల నందించి సమాజమున గొప్ప పరిణామము కల్గించెడి మహా

ద్భాగ్యము త్యాగహృదయము పుణ్యసంస్కారముగల యైశ్వర్య సంపన్ను లకు మాత్రమే సిద్ధించగలదు.

అట్టి భవ్యాదర్శమైన త్యాగహృదయుల కూర్ధ్వలోకమునందు గొప్పస్థానమున్నదనుటలో నెట్టి సందేహములేదు.

'శ్రుతులులేనివానికి సద్గతులు లే'వనెడి నుడిని మరచి 'సుతులు లేని వానికి సద్గతులు లే'వనుటే లోకమునకు పరిపాటియైనది. ఇది సమంజస మైన నుడికాదు.

ఏనాడో మహాకవి ధూర్జటి "మ॥ కొడుకుల్ పుట్టరటంచు నేడ్తు రవివేకుల్ జీవన భ్రాంతులై కొడుకుల్ పుట్టరె కౌరవేంద్రున కనేకుల్ వారిచే నేగతుల్ । వడసెం బుత్రులులేని యా శుకునకున్ బాటిల్లెనే దుర్గతుల్ చెడునే మోక్షపదం బపుత్రికునకున్ శ్రీకాళహస్తీశ్వరా ।" యనెడు మహావాణియే నిత్యసత్యమై ప్రతిధ్వనించుచున్నది.

ఏనాటికైనను నరునకు హృదయపరిణామము గలిగి 'ఏది సత్యము?' అనెడి ప్రశ్నతో తనలో తాను హృదయ మథనము చేసికొని సత్యము తెలిసి, "ఆహా సర్వులు ఆదేవదేవుని సంతానమే; మంచిని పెంచుకొని, మంచి హృదయముతో నాతోడి సమాజశ్రేయస్సునకై భగవాను డొసంగిన యర్థమును పారమార్థికదృష్టితో సద్వినియోగము చేసెద" నను స్థిరచిత్త ముతో నరుడు సంచరించిననా డుత్తమలోకప్రాప్తి యాతనికి తప్పక సిద్ధించును.

మానవసమాజమునం దాస్తికత, సర్వమానవ సౌభ్రాతృత్వము నిత్య శాంత్యానందములు పరమత సత్యశౌచశీలాది సంపద్విభూతి చేకూ రుటకు సత్యారచనలే దివ్యసోపానములు ఇందెట్టి సందేహములేదు.

ఆధ్యాత్మిక చైతన్యశక్తిని పెంపొందచేయు తాత్త్విక విషయ విమర్శనాపరమగు దివ్యరచనలను, ముద్రణచేయించెడు నరుల కాలోకేశ్వరుడు, నిత్య సత్య బుద్ధ నిర్వికారస్థితిని చేకూర్చి సంరక్షించును.

కవితామాధురి నొదవించు మహిమతో కవికి, ఆ కవితను లోకమున కందించిన త్యాగధనులకు గొప్ప యశస్సు చేకూరి యాదర్శమూర్తులై స్థిరకీర్తితో విలసిల్లుచుందురు.

కోటలు పేటలు మాళ్లు మూటలు, సర్వసౌఖ్యములను పొందుట కుపాధియదు దేహమును సైతము క్షణములో త్యజించి యీ భువిపీడి జీవు డెక్కడికో తరలిపోవుచున్నాడు.

"దేహి" దేహమునుండి పలాయనమంత్రము పఠించకముందే జాగ్రతవహించి కర్తవ్యమును గుర్తించి సమాజవికాసమునకు మహావకాశమును చేకూర్చెడు భవ్యరచనలను ముద్రణచేయించెడు మహనీయ మూర్తులైన నరులే ముమ్మాటికి ధన్యులు—

ప్రతివిషయము నేదో కార్యకారణ సంబంధ బాంధవ్యముతో, వ్యక్తుల సమాగమ సహకారసంపత్తితో నీ భువి విరాజిల్లుచుండును.

ఇట్టి సంబంధబాంధవ్యపు పూర్వాపరస్థితిగతుల చరిత్రకు మూలమేమని విచారించిననా డెవ్వరికి సులువుగా బోధపడునదికాదు.

సృష్టి స్థితి లయకర్తయు పద్మనాభుడైన యీ గోవిందునకే యెఱుకని మన చరిత్రకారులెల్లరు నొక్కుమ్మడిగా వారి గంటముల వ్రాతలతో నొక్కి చెప్పిరి.

ఆ జగన్నాథుని విచిత్రలీలా విలాస వినోద కర్మములం దందరు పాత్రధారులే. ఏ నరున కేనరునకు విడదీయలేని సంబంధబాంధవ్య మేర్పడునో యాయా పాత్రధారులకే తెలియదు. పాత్రధారుల పాత్రపోషణ

మంతయు పాత్రధారుని స్వాధీనములోనుండును. జీవులొనర్చిన సత్కర్మ దుష్కర్మ మిశ్రమకర్మలననుసరించి సుఖ దుఃఖాది ద్వంద్వముల నా లోకేశ్వరుడు జీవకోటికి చేకూర్చుచు విచిత్రమగు నీ జగన్నాటకమును వీక్షించుచుండును.

సర్వలోకనియంతయగు నా జగన్నాథుడు సాక్షిమాత్రుడు. ఆతని దివ్యలీలలు ప్రకృతి బద్ధులైన నరులెన్నటికి తెలిసికొనలేరు.

ప్రస్తుత గ్రంథముద్రణ కార్యక్రమ నిర్వహణ దీక్షాకంకణధారు లెంతటి యుత్తమ సంస్కారులో యంతకుమించిన త్యాగమూర్తులు.

మద్రాసు పట్టణమునందుండెడి శ్రీ రేవూరు పద్మనాభశెట్టిగారికి, గుంటూరుజిల్లా వినుకొండతాలూకా ఆరేపల్లి ముప్పాళ గ్రామమున, శ్రీ క్రొత్త రామచంద్రయ్యశ్రేష్ఠిగారికి శ్రీమతి సుబ్బమ్మగారికి, నవతరణ మొందిన శ్రీ వేంకటగోవిందరావుగుప్తాగారికిగల సంబంధబాంధవ్యస్వరూప స్వభావసమ్మేళనమే యా శ్రీమన్నారాయణుని యనంత దివ్యలీలావిభూతు లలో నొకానొక దివ్యమధురానుభూతి. ఇట్టి సమాగమసంపత్తినే శ్రీనృహరి లీలావిలాసమనందగును.

శ్రీ క్రొత్త వేంకట గోవిందరావుగుప్తాగారి మేధాసంపత్తి బహు ముఖభావోపేతమై దినదినాభివృద్ధి చెందసాగినది. ఉన్నతములగు చదువు లలో నుత్తీర్ణులై న్యాయవాది పరీక్షాపట్టభద్రులైరి. నిండు హృదయముతో ననేక కళారంగములందు కృషిచేసి దైవకృపాప్రసారముతో మద్రాస్ నందే స్వస్తిక్ యేజన్సీ ప్రధాన నాయకులైన శ్రీ రేవూరి పద్మనాభశ్రేష్ఠి గారి పవిత్రప్రేమకు పాత్రులై వారి వ్యాపారమునందు భాగస్వాములై విశేషప్రజ్ఞాప్రాభవముతో శెట్టిగారి కార్యక్రమముల నిర్వహణ మొనర్చుచు తచనల నెన్నింటినో యొనర్చి సమాజమునందు గొప్పకీర్తి గౌరవాదులను బొందుచుండిరి.

సద్విమర్శకాగ్రేసరులై సాహితీ సౌందర్యపదజాలమును చవిచూచి వట్టి యీ వేంకట గోవిందరావుగుప్తగారి కవితలోని లోతులను వేదాంత భావపరంపరల కెంతో ముగ్ధులై ముద్రణ భారనిర్వహణమునకై శ్రేష్ఠిగారిని ప్రోత్సహించిరి. శ్రేష్ఠిగారు, ఈ గ్రంథరచయితతో సరససంభాషణముసల్పి హృదయపరవశత్వమునొంది, లోకోపకారమగు దివ్యరచన ముద్రణ చేయించినచో ముముక్షువుల కెంతో యానందము ముక్తిని కల్గించిన వాడ నయ్యెదనని ముద్రణకై విరాళము నొసంగిరి.

రచయిత

# ప్రకాశకులు



త్యాగమూర్తులు

శ్రీ రేవూరు పద్మనాభశెట్టిగారు

మద్రాస్

# ప్రకాశకులు

మద్రాసు పట్టణమునందు దయాగుణ స్వరూపులు, ఇక్ష్వాకులగోత్రోద్భవులైన శ్రీ రేవూరు కుమారస్వామి శ్రేష్ఠిగారు వీరి ధర్మపత్ని శ్రీమతి తాయారమ్మ పుణ్యదంపతులకు నవతరణమొందిన తాత్త్విక సాత్త్విక స్వరూపులు శ్రీ రేవూరు పద్మనాభ శ్రేష్ఠిగారు, వీరి ధర్మపత్ని శ్రీమతి కమలమ్మగారు శ్రీహరి కరుణచే ఐశ్వర్య సంపన్నులై శ్రీహరిని కీర్తింప సాగిరి. పతియాజ్ఞ మీరని సాధ్వీమణి శ్రీ కమలమ్మగారు.

అనేక ధర్మసంస్థల కధినాయకులై పవిత్రక్షేత్ర రాజములయందు జీర్ణదేవాలయోద్ధరణముల నొనర్చిన పుణ్యహృదయులు. బీదసాదల యెడ గల కరుణతో వారికెంతో సహకార మొనర్చి వారివారి హృదయములకు తృప్తిచేకూర్చిన త్యాగమూర్తులు.

మద్రాస్ పట్టణమునందే శ్రీవరదాముత్తియప్పన్ వీధిలో శ్రీ వరద రాజస్వామివారి దేవాలయమునందు విశాలదృష్టితో విశేషప్రజ్ఞతో మండపస్తంభము ముందొక సుందర మందిర నిర్మాణముచేయించి యా మందిరమున పురాతనకాలమునాటి శ్రీ యోగ నృసింహమూర్తిని ప్రతిష్ఠింపచేసి గొప్ప కైంకర్య మొనర్చిరి. రాయవేలూర్ సమీపమున శ్రీ చోళింగర్ మహాక్షేత్రమున శ్రీయోగ నరసింహస్వామి కొండమెట్లకిరువైపుల చెట్లను నాటించి పోషించి పెంపొందింపచేసిరి శ్రీయోగ నృసింహస్వామివారి భక్త పుంగవులై సత్సంస్కారముతో సత్కార్యనిర్వహణ దీక్షతో కాలమును సద్వినియోగ మొనర్చెడు సరసవిలాస సాహితీచతురులు శ్రీ రేవూరు పద్మనాభ శెట్టిగారు.

శ్రీ రేవూరు పద్మనాభశెట్టి చారిటీస్ నిధినుంచి శ్రీ శెట్టిగారు ముముక్షు జనసహస్రముల కాత్మోన్నతి చేకూర్చెడు నీ గ్రంథముద్రణకై

భక్తితో సమర్పించిన విరాళము రు. 1500-00 పది ఐదువందల రూపాయలు.

ఏ సనాతన నిత్యసత్య నృసింహ దివ్యమహాశక్తి యీ రచనను సంపూర్తి చేసినదో యానృసింహ దివ్యమహాశక్తియే, కృతికర్తకు కృతికి క్రియాకృతి చేకూర్చిన శ్రీ శెట్టిగారికి సమాగమ మేర్పరచి సద్గోష్ఠి జరిపించినది.

ఇట్టి మహత్తర కార్యక్రమమునకు ప్రప్రథమముగా రచయితకు చేయూతనిచ్చి సంతస మొందించిన శ్రీ శెట్టిగారికి వీరి కుటుంబమునకు వీరి సేవకవర్గమునకు శ్రీ సద్గురు యోగానంద నరసింహస్వామివారు శాంతి యానందములను భవబంధ విముక్తిని చేకూర్చి రక్షించెదరుగాత !

(1) విజయవాడ వా॥లు శ్రీ తాతా వేంకట సుబ్బయ్య శ్రేష్ఠిగారి కు॥ శ్రీ రంగయ్య శ్రేష్ఠిగారి ప్రేరణతో వీరిమేనల్లుడుగారు శ్రీ మారము రామకోటి శ్రేష్ఠిగారు రు. 116-00

(2) గుంటూరుజిల్లా వినుకొండ తాలూకా పెదకొండాయపాలెము గ్రామ వా॥లు శ్రీ పొట్టి నాగరత్నము శ్రేష్ఠిగారు వీరిధర్మపత్ని శ్రీ వెంకమ్మగార్ల దత్తు కుమారుడు శ్రీ వేంకట సుబ్బారావు గుప్తాగారు రు. 116-00

డిటో గ్రామ వాస్తవ్యులు

(3) శ్రీ కడియాల వేంకటప్పయ్య చౌదరిగారి కు॥ శ్రీ సాంబశివరావు చౌదరిగారు — రు. 116-00

డిటో గ్రామవాస్తవ్యులు

(4) శ్రీ కేతినేని వెంకటప్పయ్య చౌదరిగారి కు॥ శ్రీ కోటయ్యచౌదరి గారు — రు. 116-00

(శ్రీ భగవాన్ సత్యసాయిబాబా వారి భక్తులు)

(5) గుంటూరుజిల్లా రేపల్లె తాలూక సూరేపల్లి గ్రామ వా॥లు శ్రీ గోవర్ధ
నగిరి సీతారామయ్య దొరగారి కు॥ శ్రీ వేంకట సుబ్బారావు దొర
గారు — రు. 116-00

ఈ గ్రంథ ముద్రణకై త్యాగముతో విరాళము లొసంగిన వీరికి వీరి
కుటుంబములకు శ్రీ సద్గురు స్వామివారు ఆయురారోగ్య ఐశ్వ
ర్యములొసంగి సదా రక్షించుగాత.

ఇట్లు
రచయిత
కోట సుబ్బారాయగుప్త భాగవతుడు

# ఆశీస్సులు

ప్రొఫెసర్. యస్. వి. జోగారావుగారు ఎం. ఏ., పిహెచ్‌డి.
హెడ్-ఆఫ్-ది డిపార్ట్‌మెంట్ ఆఫ్ తెలుగు
ఆంధ్రాయూనివర్శిటి, పి. జి. సెంటర్, గుంటూరు.

బ్రతికిచెడిన దేశము, చెడిబ్రతుకుచున్న దేశము మన భారతదేశము. దాని దారుణ హృదయ విదారక వర్తమాన వాస్తవిక స్థితినిచూచి బావురు మని యాస్థితిని సమాజమునకు గుర్తింపచేసిన ఒక భావుక శిఖామణి ఒక దేశభక్తి సందీపిత స్వాంతుడు ఒక భగవంతుని "ఏజంటు" పొందిన హృదయ వేదన, ఈ గ్రంథము.

దేశము దేశమంతా నాస్తికతా ధూమధూసరితమై ధర్మగ్లాని ఢాకినీ విలయతాండవ వికటాటహాస విఘూర్ణితమై అఘోరించుచుండినకాలములో అవతరించిన ఆదిభట్ల నారాయణదాసు ఆ అధర్మ మహామారి హననభంగ మునకై హరికథను, హరికథోపన్యాసమునకై జీవితమును అంకితము చేసెను. ఆ హరికథా పితామహుని వారసు డీ శ్రీ కోట సుబ్బారాయగుప్త భాగవతులుగూడ ఆ మహానుభావుని ఆదర్శ దృక్పథ మహాధ్వమున సుదూ రగాములై యథోచిత పరిశ్రమతో పురోగమించుచున్నారు. ఆ పురోగమన మహామార్గమున నొకమైలురాయి వీరి "శ్రీ యోగానంద నరసింహమహర్షి జీవిత చరిత్ర" బృహద్గ్రంథ రచన మరియొకటి ప్రకృతి కృతిరాజము. ఇందులో ఒక ఆధ్యాత్మ విద్యాప్రవీణుని సముదాత్త చిత్తమునుండి సాత్త్వికావేశవశంవదమై జాలువారిన భావధారను మునుకలు వేయుదుము. చక్కని సరళ గ్రాంథిక భాషలో చిక్కని శైలీలాలిత్యముతో స్నిగ్ధభావ సంపదతో సాగిపోయిన సర్వతస్సుందరమైన రచనయిది. ప్రస్తుత పరిస్థితు లనుబట్టి పదిమందికి పనికివచ్చు రచనయిది. ఇట్టి రచనకు సమకట్టిన శ్రీ సుబ్బరాయ భాగవతులను మనసార అభినందించుచున్నాను. ఇతి శివమ్.

'మహోపాధ్యాయ' 'దర్శనాచార్య', 'లాక్షణిక శిరోమణి, సాహిత్య సామ్రాట్' 'నవవిద్యానాథ' 'సాహిత్యాచార్య'
శ్రీ జమ్మలమడక మాధవరామశర్మగారు

భారత దేశములో ఒక సంప్రదాయము కలదు. అది ఈ గ్రంథములో నున్నది. అది ఇట్లని ఈ రచయితకు తెలియదు. అది అట్లని నాకు తెలియునను కొందును. సిద్ధవ్యక్తులు కొందరు జ్యోతిర్మయ దేహ సంచారులై కొందరిని భావావేశమున అనుగ్రహింతురు, ఆ అనుగ్రహఫలము తదావిష్టులలో నొక యాదేశరూపముగా భాసించును. ఈ గ్రంథము అట్టి అవభాసము. ఈగ్రంథసవిత సత్యమావిష్టుడై పలుకును. అట్లే వ్రాయును. ఈగ్రంథము ఈ భాగముతో చుక్కపెట్టు కొనదుగదా ! ఎదురు చుక్క లేదని యనుకొని ఈతడు పలుకులు పలుకును. ఈ గ్రంథము పలికివ్రాసెను వ్రాసి పలికెను. పలుకు పలుకులో ఆవేశమున్నది, ఆవేశమంతటి భావ సంపదను గుప్తరచనలో చూడవలదు. దీనిలోని ఆవేశము ఒక ఆదేశము కదా ! ఇది గద్యకృతి అనిపించును. కాని స్వరశ్రుతి మేళనముతో నున్నది. కథాకథకులు గద్యమును పద్యము చేయుదురు. కొందరు పద్యమునే త్రుంచి త్రుంచి గద్యము చేయుదురు. ఈత డట్లు చేయలేదు, ఇందలి మౌలికము లన్నియు భిన్న కాలికములు. అయినను అభిన్న భావ సూత్రముతో నున్నవి. తన కింత గొంతుకలదని కథకులు ఉచ్చైఃస్వరముతో నందురు. అట్లనుటలో పల్కులన్నియు నాని నాని మెత్తపడును. అవి అనుప్రాస రూపములై శబ్ద కర్ణులకు రమ్యముగా నుండును. ఇందలి వన్నియు ప్రశ్నాత్మక రీతిలోనున్నవి. అవి అట్లున్న వేమి? ఇది గుప్తరచన, కావున అట్లున్నది. అయిననేమి ? స్వసంకల్పిత సత్యసమాధి యున్నది. ఈ రచ

నలు విడి విడిగానున్నవి. అయినను పొడిపొడిగా లేవు. ఎట్లో ముడి పడి యున్నవి. అన్వేషింపదగిన అనుగతితో నివి యున్నవనుట చాలును, ఈ గ్రంథము చెప్పునదేమి ? గుప్త సంగృహీతము లిందున్నవి. నేతి నేతివాదము, ఇద మిత్థమను వాదము రెండు ముడిపడి యున్నవి. శిష్ట భాగములు కూడ ఇట్టి దృష్టి సృష్టితోనుండును. ఈ గుప్త భాగవతుడు విన్పింపగల కంఠయోగముకల ముక్త కంఠుడు. ఈ గ్రంధము చదివింప గల ధారకలగిరి ఝరి. జనులు శ్రోతలై విందురు. పాఠకులై చదువుదురు. అంతట గుప్తరీతియున్నది. అది ఆత్మగుప్తము. యోగి యోగధ్యేయము. సిద్ధులకై సాధన మొనరించువారి వికీర్ణములు విక్షిప్తములు నగు విశిష్ట విశేషము లిందున్నవి. అందుననే ఇది ప్రశ్నసంకేతముతో నున్నది, ఆ ప్రశ్నభావమును అనుయాయులు ఆరాధింతురు, ఇట్టి ఆరాధనమును గుప్తరచయిత సూచింపదలచనేమొ ? ఉత్తరభాగములలో నిరుత్తరముగా భాసింపగలదు అనినేను భావింతును. ఇట్లే పాఠకులు భావింతురు.

# 3

## శ్రీ వావిలాల సోమయాజులుగారు

'సాహిత్యాచార్య' 'కుమార ధూర్జటి' 'కవిభూషణ' ఇత్యాది బిరుదాంకితులు

శ్రీ కోట సుబ్బారాయగుప్త చిత్త సంస్కారముగల ఉత్తమ కుటుంబములో జన్మించిన వ్యక్తి, చిన్ననాటినుండి జిజ్ఞాసాత్మకమైన మనస్సుతో ఆవేదనతో భారతీయ సంస్కృతి విశేషాలను సర్వ కోణముల నుండి ఆకళించు కొనుటకు యత్నించినవాడు నిరంతర సజ్జన సాంగత్యముతో, ఉత్తమ గురుసేవా తత్పరతతో, దీక్షాబద్ధుడై మహోదార విషయ సంగ్రహణ మొనర్చినవాడు. సహజ ప్రతిభకు వ్యుత్పన్నత తోడుకాగ సాహిత్య సంగీతములందు పరిగణింపదగిన ప్రజ్ఞాపాటవమును ఆర్జించు కొన్నవాడు. బాల్యమాదిగ భక్తిరస హృదయుడైన ఇతడు తన సంగీత సాహిత్య శక్తులను పరమేశ్వర కైంకర్యమునకు సమర్పించు కొన్నవాడు. పవిత్రాశయములతో జీవయాత్ర సాగించు కొనుచున్న సంసార సాంయాత్రికుడు. బహుముఖీన కళాకౌశలముతో రసిక జన హృదయముల నుర్రూతలూగించి తన్మయుల గావింపగల హరికథా కదనదక్షుడు. ఈ సర్వస్వ ప్రాప్తికి శ్రీ సద్గురు యోగానంద నరసింహ యోగీంద్రుల కృపావీక్షణమే మూలహేతువు, ఇతనికి సర్వకాల రక్షావచము.

మహిమోపేతమైన శ్రీ యోగానంద నృసింహ యోగీంద్రుల దివ్య జీవితమును అత్యంత సాన్నిహిత్యముతో దర్శించుటచేతను, వారు సిద్ధి పొందిన పిమ్మట అనేక సమయములందు దీక్షతో భావించుటచేతను, పరవశత్వము పొందిన శ్రీ సుబ్బరాయగుప్త భాగవతుడు శ్రీవారి జీవిత చరిత్రకు అక్షరత్వము కల్పించుటతో సాహిత్య రంగమున ప్రవేశ మొనర్చి నాడు. ప్రథమ యత్నమునందే తన రచనా కౌశలముచే సాహితీ హృదయుల ఆశీస్సుమసౌరభము లందుకొనినాడు.

శ్రీసుబ్బరాయ గుప్త ప్రస్తుతరచన "ఏదిసత్యము ?" జిజ్ఞాసాత్మక గ్రంథము, దేశమందలి సాంఘిక ఆధ్యాత్మిక సౌభాగ్య దారిద్ర్యమునకు రచయిత ఉదార పవిత్ర హృదయము ఎంతగా కిళవళ పాటు నొందినదో ఇందు సర్వత్ర వ్యక్తమగుచున్నది.

ఏరంగమందైనను దంభజీవనులతో నితడు సహజీవన మొనర్ప లేడు, సరికదా సరసమునకైన సాంగత్య మొనర్పలేడు. తన ఉన్నతాద ర్శములకు తగ్గిన వాక్కునుగాని చేష్టనుగాని ఉగ్గడింపలేడు. విమర్శింపక ఊరు కొనలేడు. అంతమాత్రమున గర్వియనిగాని వినయసౌజన్య వివేకరహితుడని గాని భావించుట పొరపాటు. ఇట్టి గుణసంపత్తికి సుబ్బరాయగుప్త చిత్త శుద్ధియే ప్రముఖ కారణము. ఈ ఆత్మీయతాముద్ర "ఏదిసత్యము ?"నందు ప్రబలతరమై కన్పించు ప్రముఖ లక్షణము. ఈ రచయిత యెత్తుకొనిన సమస్యలకు చూపించు పరిష్కారములెల్ల సార్వకాలికములు, సర్వతోముఖ సమన్వయ ప్రతిపాదకములు, నిత్యసత్యములు, ఆర్షేయములు, భారతీయ ములు. ఇట్టి ఉత్తమకోటికి చెందిన రచయితకు ఉత్తమాదర్శ జీవనమార్గ ముల ప్రదర్శించు విజ్ఞానజ్యోతుల నెన్నింటినో వెల్గించు శక్తిసామర్థ్యము లను వాగ్దేవి ప్రసాదించుగాక ! శ్రీ వాసవీ కన్యకాపరమేశ్వరి ఇతని ఉన్న తాదర్శములను లోకవిస్తృతముగ వ్యాప్తినొందించుటకు వలయు ఐశ్వర్య మును ప్రసాదించుగాక ! పరమేశ్వరుడు సర్వసాంఘిక సేవానిరతికి ఆదిమకారణమైన ఆయురారోగ్యములను శతవసంతము లిచ్చుగాక !

ఉ॥ ఛందమెఱింగినట్టి కవిచంద్రుల కంఠములందు దేవతా
వందవనీరసాల పికనాయక గాయక గాత్రముగ్ధ మా
రంద మనోజ్ఞ మాధురులు రజ్యదుదారత నిల్చునంతకున్
జెందుత సుబ్బరాయ గుణశేఖరు నిత్యయశో విశాలతల్.

# శ్రీ యోగానంద మహో వాణి

"ఏది సత్యము?" అను నీ గ్రంథరాజము కోట సుబ్బారాయగుప్త భాగవతునిచే రచింపబడినది. రచయిత మాకు సన్నిహితుడు, గురుకృపా సిద్ధుడు, నిరాడంబరుడు, సహృదయుడు.

ఇందలి వ్యాసములన్నియు నిత్యసత్యమునే ధ్వనించుచున్నవి. వేదాంతమును స్ఫురింపజేయుచున్నవి. సామాన్యముగా వేదాంతవిషయము లనుగూర్చి తర్కించుచున్నను, వినుచున్నను కన్నులముందున్న వాస్తవ జగత్తును వదలి యేయజ్ఞాతలోక ప్రస్తావనమో చేయుచున్నట్లుండును.

"జగన్మిథ్యా బ్రహ్మసత్యమ్"అని బోధించెడి, యగమ్యగోచర వేదాంతవిషయములనే ప్రాతిపదికగా దీసికొని, వాని యథార్థరూపమే వాస్తవ జగత్తున కాధారభూతమనియు, వర్తమాన జీవితమున నవి యెరవడిగా దిద్దుకొన్నచో పొందగలిగెడి యద్వైత బ్రహ్మానంద సిద్ధియే, భవిష్య దదృశ్యలోక గమ్యమగు మోక్షసిద్ధియని సిద్ధాంతీకరించినాడు. ఇదే యీ యుపన్యాసముల ప్రత్యేకత. అదియే యీ గ్రంథమునకు గురుపదము లభింపచేసి చదువరుల నాకట్టుకొని చదివించుచున్నది. వేదాంతవిషయములకు ప్రస్తుతముతోగల యవినాభావసంబంధమునే యీ "కీర్తనకంఠీరవుడు, గంభీరపదగుంభిత భావ బంధుర పదవేగ మహా వాక్యప్రవంతిలో మేళవించి, పామరహృదయగిరి గుహాంతరములు ప్రతిధ్వనించునట్లు పలికినాడు. కావుననే నేలవిడిచిచేయు సామువలెకాక హృదయరంజకముగా నున్న వీ యుపన్యాసములు.

ఈ వినయశీలుడు, ఇది నా శేముషీదురంధరతగాదు, నా గురు దేవుడగు శ్రీశ్రీశ్రీ యోగానంద నృసింహమహర్షి యాదేశించి, కించి

జ్ఞుడనగు నాచే వ్రాయించెననుకొందును. భవతు— అట్టిచో నసంగతముల కింక తావెట్లుండగలదు ? హంసతూలికాతల్పముపై పింఛుకపాటి శిరోజము సోకినను మేనువాల్చజాలని [illegible]కోమలివలె నిత్యసత్య ధర్మ తల్పమున ప్రతిష్ఠితులయిన వేదాంతకన్య వాచావేదాంతుల వైఖరీ వా[illegible]ఖ్యా[illegible]చే నెంత బాధపడుచున్నదియు గ[illegible]నించి [illegible]రాస[illegible]ముమును పాత[illegible] వ్యా[illegible]ఫలకములకు హత్తించు నైపుణి యీ కవి[illegible]లమున జాలువారినది. శ్రీ సద్గురు యోగానంద నరసింహస్వామివారి దివ్య కరుణయే వీరికీ కవితాశక్తిని కలుగజేసినది.

దేవుని ఆజ్ఞ, అందములో ఆనందమున్నదా? సన్యాసము శ్రేష్ఠమా సంసారము శ్రేష్ఠమా ? దేవతాధ్యానము రక్షణమా ? భక్షణమా ? నేటి మనస్థితి పురోగమనమా ? తిరోగమనమా ? మానవుని ప్రధాన కర్తవ్య మేది ? నాదానుసంధానమే మనసు కుదురుటకు మూలమా ? నేనే సర్వ శక్తివంతుడనని గర్వించితివా ? నీ కృషి వృథా ! మొదలగు మానవ ధర్మములను కూలంకషముగా చర్చించి మీకా సందేశములందించుచున్నాడీ కవి. ఏయోషధిలో నే మహాత్మ్యమున్నదోయన్న సదాలోచనపరులెల్లరు నీ సద్గ్రంథపారాయణమొనరించి, యిందు సూచింపబడిన నిత్యసత్యము నన్వేషించి గ్రహించి నిత్యాచరణమున పాటించి తరింతురుగాక !

శా॥ ఆప్తుండట్టుల నెల్లవారలకు నీవ్యాసంబు లాత్మోన్నతుల్
ప్రాప్తంబౌనటుచేయు భక్తియొకటే ప్రహ్లాద సద్భక్తియున్
గుప్తంబైన నృసింహవాణి కొరక నిగ్గుంగూర్చి మా గుప్త సం
తృప్తుండై యిపుడేది సత్యమని వర్ణించె న్మనోజ్ఞంబుగా॥

శా॥ ఆనందంబుగ సంగ్రహించి యిటు వేదాంతమ్ము, వేంకమ్మ ల
క్ష్మీనారాయణ గుప్తనందనుడు నిక్షేపించు నీ సంపదల్

వేనోళ్ళం గొనియాడఁదగాబడుచు నుర్వీన్ సూర్యచంద్రాదులె
న్నే నాళ్ళుండెడి నన్నినాళ్ళలరు జమ్మీ సుబ్బరాయాభిదా॥

ఆ॥ వె॥ గుప్తపరిచినేమొ గుప్తమా వేదాంత
భావములను బయలుపరచినావు;
కోట యింటిపేరు కోటలెక్కించె నీ
కీర్తితేజమును సుకృతివి నీవు॥

ఇట్లు
మీ— తాటిపర్తి శామ్యూల్‌కవి
ఇనుమెళ్ళ

# ఆశీర్వాదః

అయంతు గుంటూరుజిల్లా వినుకొండ తాలూకాంతర్గత కొండాయ పల్లె గ్రామవాస్తవ్యః కోటరామయ్య శ్రేష్ఠినాం పౌత్రః కోట వేంక మాంబా లక్ష్మీనారాయణ గర్భక్షీరపాథోధి సుధాకర మూర్తిః కోటసుబ్బ రాయ నామా వైశ్యకుల మణిదీపకాయమానః యోగానంద నృసింహ స్వామినాం కృపయా అష్టాక్షరీమంత్ర జపానుష్ఠాన దుర్నిరీక్ష్యతేజాః తాదృశ జపప్రభావేన స్వవృత్తివ్యాపారాదీన్ నిరపేక్షయా విసృజ్యైకవి పండితానాం ఆధ్యాత్మిక విద్యానుభూతిమతాం శుభాశీర్బలాత్ శ్రీ నృసింహ స్వామి సన్నిధిం ప్రాప్తుమిచ్ఛన్. తీర్థయాత్రాది పుణ్యవర్తనాన్యపి దర్శిత్వా తత్ర తత్ర స్థితమహాత్మానామనుగ్రహేణజ్ఞానం, సంప్రాప్య సర్వత్రాపి స్వోపాస్యదైవత నృసింహరూప మప్యాలోకయన్ స్వగృహ కార్యభారమపి భగవత్ ప్రీత్యర్థ మవకుర్వన్ కర్మభిః నలిప్తః.

నృసింహభక్త పరమభాగవత ప్రహ్లాద హరికథా మప్యస్య సంగీత మపిసాహిత్యం సరస్వత్యాః కుచద్వయ మిత్యుక్త భంగ్యా సంగీతసాహిత్య విద్యాదిషు కుశలీభూత్వా తిరుమలక్షేత్ర నృసింహక్షేత్ర సద్గురు కపిలక్షేత్ర శ్రీశైలకాళహస్తి మట్టపల్ల్యాది క్షేత్రేషు స్వీయహరికథాగానేన సంతోష తరంగితాన్ జనాన్కృత్వా, శ్రీశైల జగద్గురు వాగీశపండితారాధ్య శివా చార్య మహాస్వామిభిః స్వకీయహరికథాగాన సంతుష్టాంతరంగైః ప్రదత్త 'కీర్తన కంఠీర, వేత్యాది బిరుదైః సమలం కృతః పూజ్యశ్రీ కేశవతీర్థ స్వామీజీవిరచిత హరికథాగానమాలీ, వేదాంతసారప్రబోధకం "ఏదిసత్యం?" ఇతి నామధేయం వచనగ్రంథం ఆంధ్రభాషాయాం భక్తిరసావేశ పూరితం నిర్మల స్వర్గంగా ప్రవాహ ఝురీరూపం, పటిష్ఠపదజాల నిర్మితం, అనే కాలంకార చమత్కృతం, అద్భుతశైల్యా రచయామాస.

ఏతాదృశాంధ్రభాషా వచనకావ్యం రచయిత్వా తత్ శ్రవణేన సర్వాన్ అపి వైరాగ్య పూర్ణమనస్కాన్ కృత్వా, కీర్తింసంపాదయా మాసేత్యలం, విస్తరేణ.

ఇతి స్వాభిప్రాయం ప్రకాశితవాన్ సంస్కృత సవ్యాఖ్య అభినవ సీతారావణ సంవాద ఝర్యాది సంస్కృతకావ్యకర్తా, అవుకుపురనివాస సుబ్బరాయగుప్త గీర్వాణకవిః

అభినవ సీతారావణ సంవాద ఝరీసంస్కృత సవ్యాఖ్య శబ్దచిత్ర కావ్యకర్త చిత్ర కవిరత్న బిరుదగ్రాహి గీర్వాణ భాషా 'చిత్రకవితాధురీణ'.

బచ్చు సుబ్బరాయగుప్త

# ఉన్నమాట

"మాతృదేవోభవ" "పితృదేవోభవ" "ఆచార్యదేవోభవ" యనెడి పవిత్ర వేదవాక్యము లీనాటివి కావు. ఆదికాలమునుండి యార్యఋషుల దివ్యజీవిత విధానములందు పదేపదే వినవచ్చుచునేయున్నవి. వారి యమూల్యాచరణాత్మకమగు నిత్యసత్య వాణికి లోకము మోకరిల్లినది.

నా మాతృమూర్తి శ్రీమతి వెంకమాంబగారు, పితృదేవులు శ్రీ కోట లక్ష్మీనారాయణ శ్రేష్ఠిగారు. కారణాచార్యులు సద్గురు శ్రీ మోహానందనరసింహస్వామివారు, వీరి మువ్వురి చలువతో వీరికరుణాదృష్టి ప్రభావముతో, యా భగవన్మూర్తియగు శ్రీ లక్ష్మీనృసింహస్వామివారి పరిపూర్ణ కృపాకటాక్ష వీక్షణము జన్మాంతర సుకృత ఫలవిశేషమున లభించినది.

స్వగ్రామమగు 'పెదకొండాయపాలెము' నందే పితృవాత్సల్యస్వరూపులు నధ్యాపక శ్రేష్ఠులు నిస్వార్థపరులు శిష్యుల మహోన్నతిని చూచి యాత్మానందమును పొందెడి పరమపవిత్రహృదయులు, పెద్దలైన 'బొగ్గరము' గ్రామ వాస్తవ్యులు నారువేలనియోగులైన శ్రీ బొగ్గరము వేంకట రంగయ్య పంతులుగారు శ్రీ వేంకట హనుమయ్య పంతులుగారు శ్రీ వేంకట నరసింహయ్య పంతులుగార్ల కరుణాశీస్సులకు పాత్రుడనై తెనుగు చదువు సంపూర్తిచేసితిని.

నేను చదువుచున్న రోజులలోనే పెద్దలు కవిపండితులు సాధువులు జ్ఞానులు గాయకులు మొదలగు విబుధజనుల పాదసన్నిధికి జని వారు చెప్పెడి సూక్తులను భయభక్తులతో వినుచు, నింటిపనులయెడ శ్రద్ధాసక్తులు లేక స్వేచ్ఛగా నిశ్చింతగా పవిత్రయాత్రాస్థలములకు, తిరుణాల తీర్థములకు సంగీత సాహిత్యాది కార్యక్రమములు జరుగు వివిధస్థలములకు

తిరుగుచు నాధ్యాత్మిక చింతనతో స్వగృహమునకు వచ్చెడితరి నేదోయొక సద్గ్రంథమును తీసికొని చేరుచు, వృద్ధులు యతి చతురులు పితామహులైన శ్రీ రామయ్యశ్రేష్ఠిగారి సన్నిధిని చదివి వినిపించి అందుగల సద్భావములను విపులముగా చెప్పి తాతగారి హృదయమున కానందము చేకూర్చెడి మధురసమయమున, యుక్తి శక్తిభక్తిగల నా రామయ్య శ్రేష్ఠి తన పెంపుడు కుమారుడైన లక్ష్మీనారాయణతో "ఒరే! మన సుబ్బారావునకు కులవృత్తియగు వ్యాపారముపై మనస్సులేదురా! సదా దైవదృష్టితో నింటిపై మమకారములేక తిరుణాలలని తీర్థములని నాటకములని తిరుగుచు ధనవ్యయమొనర్చుచు బ్రాహ్మణునివలె గ్రంథముల చంకనిడి చరించుచున్నాడు. ముందు ముందేమిచేస్తాడో ?" యని పలుకుచుండెడి వారు.

నే నావిధముగా కాలమును హాయిగా నానందముగా గడపుచు లౌకిక వ్యాపారాది కర్మల యందాసక్తి లేక, ఐనను "కులవృత్తి మానకురా" యనెడి సామెత ననుసరించి దైవదృష్టితో న్యాయసమ్మతముగా వివిధరూపాలతోగల వ్యాపారములు చేసియు ప్రయోజనమును బడయనేరక 'నా మార్గ మిదికాదు ! సద్గురు దేవులైన శ్రీ యోగానంద నరసింహ యోగీంద్రుల దివ్యాదేశమైన శ్రీ ప్రహ్లాద చరిత్రను గానముచేయుటయే ప్రధానము ప్రస్తుతకర్తవ్యమని శ్రీ సద్గురు యోగానంద మహావాణిని ధ్యానించుచున్నతరి, 'నిడుబ్రోలు'లో శ్రీ యోగానందాశ్రమమున శ్రీ సచ్చిదానంద వేంకటేశ్వర స్వామిగారి యాధ్వర్యమున వార్షికానుసారముగా జరుగుచున్న శ్రీ భగవద్గీతాజయంతి మహోత్సవ శుభసమయమున మాతృమూర్తి శ్రీ చేవూరి మహాలక్ష్మీదేవిగారి యాహ్వానముతో తెనాలి వాస్తవ్యులు 'విద్యాదానకర్ణ' శ్రీ తెల్లాకుల వెంకటేశ్వరగుప్త భాగవతులుగారు విచ్చేసి భక్తిరస హృదయముతో సరళమగు భాషతో సర్వులకర్థమయ్యెడి

రీతి "శ్రీ భక్త నందనార్ చరిత్ర" హరికధను చెప్పగా ప్రశాంతచిత్తము తోవిని హృదయము ముప్పొంగి సద్గురు దేవుల దివ్యశక్తి మహాప్రేరణతో నేను హరిదాసునై శ్రీ హరికథా గానములు చేయవలెనను సత్సంకల్ప ముతో "తెనాలి" వెళ్ళి మారీసుపేటలో నివాసముండెడు శ్రీ తెల్లాకుల వేంకటేశ్వరగుప్త భాగవతులుగారి భవనమునకు జని భక్తితో హృదయ ముప్పొంగ సాష్టాంగ ప్రణామములొనర్చి శ్రీ కొత్త వేంకటేశ్వరగుప్త సిద్ధాంతిగారు నిర్ణయముచేసిన లగ్నమునకే 1958 జనవరి పదునైదవ తేదీ ఉదయము పదిగంటల పన్నెండు నిముసములకు శ్రీ వారియొద్ద గణనాథుని ప్రార్థనారంభము చేసితిని. పదియైదురోజులు వారిసన్నిధిలో యుండి మరల వచ్చెదనని స్వగృహముచేరి ప్రకృతిశక్తికి గురియై పెద్దపెద్ద వ్యాపార ములుచేసి పురోగతిలేక విరమించుకొని శ్రీ సద్గురుదేవుల దివ్యాదేశ సందే శములతో జాగృతినొంది, భక్త. ప్రహ్లాద చరిత్ర కథాధ్యయనమునకై బయలుదేరితిని.

పల్నాడుతాలూక 'పిడుగురాళ్ళ' గ్రామమున శ్రీ రామతీర్థ సేవాశ్ర మమును స్థాపించి 'శ్రీరామదర్శనము' అను పత్రికద్వారా నాధ్యాత్మిక విషయములను విపుల ప్రచారముచేయుచు పవిత్రకృష్ణా నదీతీరమున కొండ గుహలో స్వయంవ్యక్తమైన శ్రీ మట్టపల్లి లక్ష్మీనారసింహస్వామివారి నుపాసనాదైవముగా నెన్నుకొని శ్రీ రామతీర్థస్వామివారి నాదర్శముగా గొని, దివ్యరచనలను వేదాంత గ్రంథములను రూపొందింపచేసిన మహా కవిపుంగవులు సాహితీవేత్తలు సాధుమూర్తులు దివ్యరూప సంపన్నులైన, పూజ్యశ్రీ - శ్రీ కేశవతీర్థస్వామివారి పవిత్ర భావబంధుర రమణీయ పద భక్తి ప్రపూర్ణ పద్యరచనా సమ్మేళనములగు 'మహాభక్త - ప్రహ్లాదాది జీవిత కధలను, 'భక్తి ప్రచార ప్రవీణ' శ్రీ రాజశేఖరుని లక్ష్మీపతిరావు భాగవతులుగారి పరిపూర్ణ ప్రేమాదేశముతో వారి ప్రియశిష్యులు వినయ

స్వరూపులైన 'గానగంధర్వ' శ్రీ ఆత్మకూరి గురుబ్రహ్మగుప్త భాగవతులు గారి సన్నిధిచేరి కొంతకాలము కృషిచేసి శ్రీ హరికథల నధ్యయనము చేసితిని.

నా సద్గురు స్వామిశ్రీయోగానంద నరసింహ మహర్షుల దివ్యాశీర్వాదమహాశక్తితో విజ్ఞులైన పెద్దల యాహ్వానములతో పరమపవిత్రములగు భగవదాలయములలో మహాత్ములుండెడి తాపసాశ్రమాదులలో కవిపండితవిద్వత్ సాధుసమావేశములలో శ్రీతిరుమల-తిరుపతి, "శ్రీవేంకటేశ్వర ఆర్షసంస్కృతీసదస్సు" నందును, శ్రీశైలము, శ్రీకాళహస్తి, శ్రీకపిలగిరి, శ్రీమట్టపల్లి, శ్రీపృథులగిరి, శ్రీమంగళాద్రి, శ్రీసింహాచలాది మహాక్షేత్ర రాజములయందును, శ్రీఅఖిలాంధ్ర సాధుపరిషత్సభలయందును, తదితరములగు మహాస్థలములయందు శ్రీ బాలభక్తప్రహ్లాదుని భవ్యదివ్యనవ్య జీవితకథాగానమును చేయుచు, శ్రీ నృసింహస్వామి వారి యనంతకృపతో భక్తశిఖామణులహృదయములను రంజింపచేయుచు, కళాభిజ్ఞులైన పెద్దల గౌరవబిరుద సత్కార సన్మానములకు పాత్రుడనైతిని.

వివిధస్థలములను దర్శించుచు విజ్ఞానధనుల మహోపన్యాసములను వినుచు లోకప్పు పోకడలను కనుచు కాలమును సద్వినియోగ మొనర్చుచున్నంత - దైవప్రేరణగా నా హృదయాంతరాళములయందు 'ఏదిసత్యము?' యిదంతామిధ్య, యనెడి సత్యవాణి యహరహము ప్రతిధ్వనించుచుండెడిది.

ఆ నా హృదయాంతరమున మార్మోగెడి నిత్య సత్యవాణి పూర్ణస్వరూపమే! ఈ " ఏది సత్యం? ఆ నిత్య సత్య సనాతన మహావాణి పూర్ణస్వరూప స్వభావ విభవాది గుణగణములే యీనాటికీ రూపమున భాసించినవి. ఇట్లు ప్రత్యక్షమగుటయు, నాశక్తికాదు నాభక్తికాదు. మరే

యుక్తికాదు. నిర్వికార నిగమాతీత తీర్థస్వరూపులగు మద్గురు సద్గురు శ్రీ యోగానంద నరసింహస్వామివారి పరిపూర్ణ కృపాదృష్టియే ఈ రచనా స్వరూపమున కాధారమై వెలుగొందినది.

వేదవేదాంగముల సారమంతయు బాలభక్త ప్రహ్లాదుని ధ్యేయము నందు వ్యక్తమగుచున్నది. అట్టి ప్రహ్లాదుని రక్షించిన సభాస్తంభసంభవుడగు నుగ్ర నరసింహుని దివ్య కళావతార సంపన్నులైన శ్రీసద్గురు యోగానంద నరసింహస్వామియే నా మస్తకమునచేరి మద్గురుభావ రహస్యముల నెన్నింటినో నేటిలోకమున కందించిరి.

అఖండయోగ విద్యావిభవులైన శ్రీ సద్గురు దేవుల దివ్యాత్మ నంత శక్తినుండి యావిర్భావముచెంది నాద్వారా లోకమునకు వ్యక్తములైనవి.

కలిదేవత వికృత స్వరూప వికటాట్టహాసవిలయ తాండవమునకు గురియై దారితెలియని గమనముతో నెక్కడికో పయనించెడి నేటిలోకమునకు జాగృతికల్గించుటకా? యనెడిరీతి నీ పొత్తమిటుల సాక్షాత్కరించినది.

సగుణోపాసకులకు నిర్గుణోపాసకులకు ధ్యేయమొక్కటియే। పొందదగినదియు నిర్వికార నృసింహ పరబ్రహ్మ మొక్కటియే। యను పరమసత్యము నీపొత్తమును భక్తితో పారాయణముచేసిన ప్రతినరుడు గ్రహించి సర్వసంశయ రహితుడై తత్త్వజ్ఞుడై యలరారును,

దేవునినుండి విడివడిన జీవుడు మరల దేవుడై వెలుగొందుటకేమి చేయవలయునో యనెడి యా యా విషయముల సర్వులకు వ్యక్తమై వారి వారి ప్రాకృత సంస్కారానుగుణమగు మార్గమున పురోగతినొంది యాత్మజ్ఞులై నిత్యానంద స్వరూపులై భాసించుటకే! సద్గురు శ్రీ యోగా

నందులీ గుప్తలోచేరి గుప్తమై సంక్షిప్తమైయున్న యపూర్వ విషయ రహస్య పరిశీలనములను యధాతధముగా స్వార్థరహితముగా నగ్నముగా లౌకికులకు విమర్శలకతీతముగా రూపొందింపజేసిరి.

మాధవునిశక్తి యపారము యనంతము యత్యాశ్చర్యము. అట్టి మాధవుని దివ్య మహోజ్జ్వల కళావతారమే సద్గురు సద్గురు శ్రీ యోగానంద నరసింహస్వామివారు. శ్రీ సద్గురుశక్తి ప్రభావమును లోకమునకు వ్యక్తముచేసి ముముక్షువులకు భవతరణోపాయమును చేకూర్చి జీవన్ముక్తిని సిద్ధింపచేయుటకే సామాన్యుడగు నామతిగతి స్థితులనుమార్చి భాగవతునిగా భగవదారాధకునిగా సద్గురు సేవకునిగా కవిగా. చివరకు సాధువుగామార్చి మహోజ్జ్వలమైన వీరనృసింహ మహామహిమాన్విత యోగశక్తిని విశ్వవ్యాప్త మొనరించిరి. సద్గురు శ్రీయోగానంద నరసింహ స్వామివారు.

రచనారంభమునకు ముందే విషయములు నామేధస్సునం దుద్భవించెడివికావు. అనిర్వచనీయమైన సద్గురుదేవుల యోగశక్తి ప్రసారమేమొ? సద్గురుదేవులను ముమ్మారు స్మరించి, శ్రీ లక్ష్మీనృసింహుని మధుర నామమును పఠించి శ్రీ అష్టాక్షరీ మంత్రమును జపించి భవబంధ విముక్తిని కాంక్షించి కలము చేబట్టినవెంటనే నాకు తెలియనిరీతిగా కలమునందే కదలికేర్పడి వేదవేదాంగ రహస్యములతో పరువులుతీయ సాగినది. శ్రీ సద్గురుదేవుని కరుణననుసరించి కఱవులేని దివ్యనవ్య పద జాలము గంగా ప్రవంతివలె జలజల ప్రవహించినది. ఇదియే సద్గురు శక్తికి శిష్యుని భక్తికి నిదర్శనము.

ఈ పొత్తమునందుగల విషయములను సాంగోపాంగముగా పరామర్శించి వారి యమూల్యాభిప్రాయముల నందచేసిన కరుణామూర్తులు

సర్వశాస్త్ర విశారదులు పెద్దలైన శ్రీయస్వీ జోగారావుగారికి శ్రీ జమ్మల మడక మాధవరామ శర్మగారికి, సాహితీ మార్గమునుచూపిన గురుపుంగవులైన శ్రీ వావిలాల సోమయాజులుగారికి, కవితా మిత్రులైన శ్రీ తాటిపర్తి శామ్యూల్ కవిగారికి, ' చిత్ర కవితాధురీణులు వయోవృద్ధులైన శ్రీ బచ్చు సుబ్బరాయ గుప్తాగారికి నీరచనాముద్రణకై ధనమునొసంగిన త్యాగమూర్తులకు. ముద్రణాది కార్యములను ముచ్చటగా సంపూర్తి చేయించిన శ్రీ వెల్‌కమ్ ప్రెస్ మేనేజరుగారు, శ్రీ పి. కృష్ణమూర్తి గారికి ముద్రణచేసిన సహృదయులకు హృదయపూర్వకమైన ప్రణామము లర్పించుచున్నాడను.

ప్రకాశము జిల్లా మార్కాపురమునకు పశ్చిమ భాగమున మైలున్నర దూరమున కుండికనదీ తీరమున శ్రీ కపిలగిరియందు దివ్య యోగసమాధి నొందిరి. వారిని త్రికరణశుద్ధిగా నమ్మి పూజించెడి భక్తజనుల ప్రార్థన లాలించి పాలించెడి మహామహిమాన్వితులు శ్రీ సద్గురు యోగానంద నరసింహ స్వామివారు. ప్రతి ముముక్షువు దివ్య తపో దీక్షాశక్తి సంజనిత మైన యా కపిలగిరి మహాతీర్థ సిద్ధయోగ క్షేత్రమునకు వెంటనే విచ్చేసి శ్రీ సద్గురు స్వామివారి నిత్య సత్యస్వరూప సౌందర్య ధవళకాంతి పుంజములను దర్శించి తరించెదరు గాత.

ఇట్లు,
రచయిత

కోట సుబ్బరాయగుప్త భాగవతుడు

ఓమ్ తత్సత్

ఓం సద్గురుభ్యోనమః

ఓం శ్రీ లక్ష్మీనృసింహపరబ్రహ్మణేనమః

'సత్యంవద' — 'ధర్మంచర'

# ఏదిసత్యము?

## ౧

## దేవుని ఆజ్ఞ

ఆది కాలమునుండియు నీ యనంత విశ్వాంతరాళమునందలి యూర్ధ్వాధో లోకములును వానియందలి చరాచర ప్రాణికోటి సముదాయమును నేటివరకెన్నో పరిణామములు చెందుచు వచ్చినవి. పవిత్ర ఋషిభూమియు ఆర్షసంస్కృతికి నిలయమైన మన భారతావనిలో ప్రజానీకమునకు, వివిధ రంగములందు కృషిచేసి యారితేరిన వేదాంతులు భాష్యకారులు వైజ్ఞానిక శాస్త్రవేత్తలు కవి పండిత గాయక శ్రేష్ఠులు వారి స్వానుభవ చైతన్యశక్తితో గద్య పద్యాత్మకముగా సృష్టి రహస్యములను చేతనా చేతనముల మూల తత్త్వమును మనోహరముగా మధురముగా నెన్నోరచనల గావించిరి. ఈ రచన లన్నిటికి మూలము శాస్త్ర పరిజ్ఞానమని, శాస్త్రములకు మూల ముపనిషద్వాణియనియును, ఉపనిషద్వాణికి మూలకందమై వెలుగొందునది వేదమని, యీ వేదము నాల్గు రూపములతో ఋగ్యజుస్సామాధర్వణములని యార్యోక్తి. చతుష్షష్టి కళలకు నిలయము విజ్ఞాన సర్వస్వభాండారమని లోక

విదితమైనది వేదము. సృష్ట్యారంభమునకు ముందే కాలాతీతమై గణనీయమై మననీయమై చిరస్మరణీయమై, అనాదికి పునాదియై శబ్ద బ్రహ్మమై స్వయంవ్యక్తమై దివ్యవాణియై దశదిశలనిండి యహరహము నాదానుసంధానమై ప్రసారమైనదే వేదము. మంత్ర తంత్ర యంత్రములు బహువిధ సాధన రహస్యము లెన్నో వేదములందే యావిర్భవించినవి. పరమపవిత్రమై ఊహల కభేద్యమై వర్ణనాతీతమై ప్రకృతి బద్ధులకు దురవగాహమై భగవద్దివ్య శక్తి సంజనితమై యఖండమై యనుపమానమై యప్రమేయమై, యాద్యమై, ఈ పాంచభౌతిక సృష్టికర్తయైన విశ్వేశ్వరుని గానము చేయుటే ఆ వేదకర్మ.

స్వయం వ్యక్తమై నిర్వికార పరబ్రహ్మానుభవ సిద్ధికి నాందీ ప్రస్తావన చేసినదియు ఆవేదవినాదమే! జగత్కారణుడు వేదమయుడైన యా సర్వేశ్వరుని వివిధ శబ్దములతో శ్రుతిమాత సదాగానముచేయుచున్నది. ప్రప్రథమమున నాకాశము, వాయువు, అగ్ని, జలము, భూమి ఒకదానినుండి మరొకటి దానినుండి వేఱొకటి ఇట్లే క్రమానుసరణ సృజనాత్మక శక్తితో నీ చరాచర సృష్టి యంతయు దివ్యావిర్భావమొందినది. కాలస్వరూపుడైన ఆ విరాణ్మూర్తి యిచ్ఛాశక్తి ప్రేరణచే సృష్టి యారంభింపబడినది. సృష్టి యారంభకాల పరిమితి పరిశీలన చేయుదము.

నేటికి కలియుగారంభము సం. 5075 లైనది. కలియుగ ప్రమాణము 4, 32, 000 సంవత్సరములు. ద్వాపరయుగపరిమితి:

8, 64, 000 సంవత్సరములు. త్రేతాయుగపరిమితి, 12, 96, 000 సంవత్సరములు. కృతయుగపరిమితి, 17, 28, 000 సంవత్సరములు. ఈ నాల్గుయుగములు గలసిన ఒకమహాయుగమనబడును. ఒక మహాయుగమనగా 43, 20, 000 సంవత్సరములు. ఇట్టి మహాయుగములు డెబ్బదిఒకటి చనిన ఒకమన్వంతర మనెదరు. ఒక మన్వంతర కాలమునకు 30కోట్ల 67లక్షల 20వేల మానవ సంవత్సరము లుండును. అట్టివి 14 మన్వంతరములుకాగ, అనగా 429, 40, 80, 000 మానవ సంవత్సరములు బ్రహ్మదేవునకొక దినమగుచున్నది. కాలమాన ప్రకారము నేటికి సృష్ట్యాది, 195, కోట్ల 58 లక్షల 85వేల సంవత్సరములు గడచెను. మానవశక్తి కందని ఈ కాలచక్ర పరిభ్రమణ మిట్లెంతకాలము జరుగునో తెలియదుకదా !

కాల మనంతము. ఆ యనంతమైన కాలగమనప్పై ఖరి, కాలాతీతుడైన, సృష్టి స్థితిలయాధినాథుడైన ఆ నిగమగోచరునకే యెరుక! కాలపు కొలత అగమ్యమైనను, కాలానికి కర్మములకు బద్ధులైన జీవుల స్థితిమతిగతులు సువ్యక్తములేకదా! ఎనుబది నాల్గులక్షలజీవరాసులతో సకలచరాచరజగత్తునిండియున్నది. జీవుడు లెక్కలేనన్ని గర్భనరకము లనుభవించి అనుభవించి తుట్టతుదకెట్టెట్టులో ఈ మానవ జన్మమెత్తును. మాతృ గర్భమందే పూర్వ స్మృతి జ్ఞానముతో గత జన్మల పాపపుణ్య కర్మఫలాదులను గుర్తుకు దెచ్చుకొని అతి నీచమైన గర్భ నరకమునకు వాపోవుచు, గతమునకై వగచుచు ముందుగతిగానక త్వరలో నీమురికి

కూపమునుండి ప్రయాణము చేయించి నన్ను కాపాడుము ప్రభో! యని పరిపరి విధముల ప్రార్థనములు సల్పుచు, ఓ జగత్పతీ! ఎన్నో వేషములు వేయించి యుదర పోషణకై చేయరాని మోస ములు చేయించి దోపిడీలకు దింపి యురికంబములకే నెక్కించి కఠిన శిక్షలకు గుఱిచేసి ఘోరాపదల పాల్పేసి దుఃఖసముద్రమున మునకలువేయించి వరాహ శునక మహిష గార్ధబాదులైన నీచ జంతువులకు జన్మింపచేసిన నాకు ఈ జనన మరణ ప్రవాహమున బడి తన్నుకొని దిక్కుదోచక నీ దివ్యకృపాపరత్వముతో ఈ నరజన్మము లభించినదే!

ఈ సారియైనను నిన్నుస్మరించి తరించే మహావకాశము లభింప జేతువో లేదో! ఓ! ఆదినారాయణా! ముకుందా! మురాం తకా! కంసచాణూరమర్దనా! దుష్టహిరణ్యాక్ష హిరణ్యకశ్యప భంజనా! ప్రహ్లాదరంజనా! అని లబలబ కొట్టుకొనగా దీనజీవుని ప్రార్థనయాలించి రమానాథుడైన యాకరుణాసాగరుడు, ఓయీ! జ్ఞానాజ్ఞానములను తెలిసికొను విజ్ఞానమును నే నీకు ప్రసాదించితినే! అట్టి పూర్వస్మృతిని మాతృ గర్భగోళము నుండి భూగోళముపై పడిన మరుక్షణమే ప్రాకృత ప్రభావముచే పూర్తిగా గోల్పోయి కుక్షిలో నాతోచేసిన నీ ప్రణామ ప్రమాణములనువీడి రోదనముతో గిలగిల దన్నుకొనుచు మాతృక్షీర ధారామృత పానముతో పొంగి పోతూ క్షీరధారలకెడబాటునకు క్రుంగిపోవుచు దినమొక యుగ ముగా కాలమును గడపుచు శుక్లపక్ష శశాంకునివలె దినదినాభి

వృద్ధిని పొందుచు నీజిలిబిలి చిన్నారి మురిపెంపు పలుకులతో కులుకుచు నిన్నుకన్న జననీజనకుల కెంతో హాయిని ఆనందమును చేకూర్చి రంగురంగుల దుస్తులలంకరించుకొని పంచవర్ష ప్రాయుడవై పాఠశాలలకు చేరి, అధ్యాపకుల యాదరణకు పాత్రుడవై, యనతికాలమునం దఖిలవిద్యలయం దారితేరి యధికారివై యందాల రాణినిపరిణయమై అంతులేని యానందముతో కామాంధుడవై కామ వాంఛలకు గుఱియై సంసార పాపపంకిలములోపడి గురు శాస్త్ర వాక్యములను నిరసించి దేవుని మరచి స్వార్థభోగలాలసత్వముతో కండ అండ వర్గ బలములతో మీసాలనుమెలివేయుచు నీ తోడి మానవులనన్యాయాక్రమ దౌర్జన్యాది హింసాకాండలకు గుఱిచేసి యదురు బెదురు మాటలతో వారి యర్థమును సంగ్రహించి, కసాయివృత్తికన్న నీచమైన ప్రవర్తనతో నీ భార్యాబిడ్డల పోషణకై యర్థాపేక్షతో వ్యర్థ జీవితగమనముతో బ్రతికి జీవితాంతమున నీ పాపకర్మ పరిపాక సమయములో సుఖాలకు బదులు దుఃఖాలకు గుఱియై కుటుంబ జంఝాటముతో శాంతికి దూరమై యశాంతికాల వాలమై యనర్థములకు నిలయమైన దుస్థితికి దిగజారి యంతులేని యావేదనతో, నీ పంచలపడిగాపులున్న నీ సేవకజన దుర్భాషలకు కుమిలికుమిలి కృశించి నశించెదవు. ఇట్టి నీచావస్థకు దిగజారి ఇంటబయట హేయముగా జూడబడి, నీలో నీవే ఛీ - ఛా, యనుకొనుచు గతమున హద్దు పద్దులేని నాదుందుడుకు తనమున కిది ఫలితముకదా! యని నీ దుశ్చేష్టలకు నీ దురంతములకు లోలోపల సిగ్గుపడెదవు. నీ జీవిత దుంథగములను కనులారచూచియు

నీ దుష్టచిత్తమునకు దుష్ప్రవర్తనమునకు, భయపడి మారాడక మిన్నకున్న నీ పిన్నపెద్దలెందరో నీ యెదుట ప్రత్యక్షమై, ఓరీ ! మూర్ఖుడా ! నవ్వుతూ చేసిన పాపకర్మల నీ నాడేడ్పుతో ననుభవించాలిరా !' యని యెత్తిపోటు మాటలతో కత్తిపోటుమాటలతో కత్తిపోట్లవలె నీ హృదయాన్ని గాయపరచెదరురా ! ఈ దురవస్థ నీకేకాదు ! ఈ గర్భనరకమనుభవించిన ప్రతిజీవికి తప్పదురా ! బాబూ ! యని, యాదరణతో, సత్యముధర్మము నీతి నిజాయతీ, సర్వ మానవ సమానత్వపుదృష్టి, శాంతి యహింస కరుణ భూతదయ ఓర్పు నేర్పు పరమతసహనము, స్వపరభేదనివృత్తి, యానందము, నిష్కళంకభక్తి, నిర్వికార సగుణధ్యానము, పరోపకారము, శక్తివంచనలేనిదానము, ధర్మాచరణము, నాచరణవేదాంతము, చేసిచెప్పుట, కాంతాకనకములపై నిరాశ, మాతాపితృవాత్సల్యము, సద్గురుపూజ, సదాదివ్యజీవనగమనము, నిత్యప్రార్థన, అతిధులకన్నదానము, నిరుపేదలసమాదరణము. మొదలైన ఈ సద్గుణ సంపత్తితో భువిపై చరించిన తరించి నన్నుచేరెదవు నిస్సంశయ" మని యా దేవదేవు డాజ్ఞాపనము చేసి "ఓరీ ! భయభక్తులతో నా నీతి సూత్రములను మఱువక మననముచేయుచు నాచరణలోనుంచి యమరుడవై వెలుంగు" మని గర్భనరకద్వారమునుండి దేవుడు జీవుని బహిర్గతమొనర్చెను.

భగవదాదేశముతో భువికరుదెంచిన బోసినోటిపాపాయి పాపాల కతీతుడై పరమాత్మస్వరూపధ్యానముతో పరమానంద

ముతో కన్నులు తెఱువకయే మౌనముద్రతోనుండి, ప్రాకృత దుష్టమాయా మానవ సమాలింగనములచే విజ్ఞానవిహీనతను పొంది మాతృగర్భమహావాణిని మరచి బాల్యయౌవనకౌమార వార్ధక్యావస్థలలో శిశ్నోదరపరాయణమునకై యుద్యోగవ్యాపారాది వివిధసాధనములలో చిక్కి కాలమృత్యుకరాళతీక్ష్ణ నిశిత దంష్ట్రలకు గుఱియై కాలునిపాశబంధనములతో నూర్ధ్వలోకాల కీడ్వబడి, మలమూత్రక్రిమికీటకాది సంకులమైన భీకరనరక యాతనలలో నిశితశూల సంఘాతములచే పొడువబడి భూలోక పాపపుణ్యకర్మల ఫలిత మందర్ధమనుభవించి శేషించిన కర్మ ఫలితప్రభావముతో భువర్లోకమునకు బంపబడి, యనేక జన్మ పరంపరలను గాసిచెందుచు తుద మొదలులేని సంసార సాగరములోబడి తీరము చేరెడి తెన్నుగానక మాయామోహితుడై యీషణత్రయమగ్నుడై మసలుచున్నాడుగదా! తన పితృ పితామహులైన పెద్దలు, సంసారమును సత్యమని విశ్వసించి దృశ్యమునశ్యమనెడి పరమసత్యమునకు దూరులై తృప్తిలేక సంసార సుఖాదులకే వశులై ధర్మన్యాయాదులను త్యజించి యర్థాసక్తితో నెట్టి పాపకర్మలనైన జంకులేక చేసిచేసి చివరకు నార్జించిన సమస్త సంపదలను త్యజించి తుదకు తన దేహమునునైనము వీడి యొంటరిగా తానుచేసిన కర్మత్రయ సంస్కారముతో నేభువి వీడి తరలిపోవును.

# భిక్షాధికారి - లక్షాధికారి

భిక్షాధికారి తనక్షుత్ పిపాసల నివారణకై వీథివీథి నడచి "తత్త్వమును తెలిసినముక్తి గలుగునోదరా !" యనెడి తంబుర గానముతో భిక్షను సేకరించి లభించిన దానితో సంతృప్తిచెంది స్వస్థలము చేరును. ఆశాపాశములకు కట్టువడక నల్పసంతోషియై ద్వంద్వములను సహించెడు నేర్పు వోర్పు గలిగి .... సమదృష్టితో ననుభవించుచు భూశయనముతో భూనాథుని మధురమధుర స్మరణముతో కాలమును సద్వినియోగమొనర్చుచు నెట్టి పాపములకు గుఱికాక తృప్తితో నా భగవానుని దివ్యనామ సుధారసాస్వాదనముతో జీవితనౌకను యావైకుంఠుని దివ్యపదసన్నిధికిచేర్చి తరించును. భిక్షాధికారి మనుగడ నెంత సమంజసమైన విధివిధానముతో సాగిపోయినదో ! మనమెల్లరము గుర్తించితిమికదా ! యా లక్షాధికారి నిజస్వరూపవైఖరిని పరిశీలనచేయుదము.

లక్షలకధికారియై - తృప్తి, త్యాగము, తత్త్వాన్వేషణములను మఱచి, యాశాదాహముతో స్వార్థావేశముతో పిశాచ ప్రవృత్తితో నార్యమతఖండనములతో మెట్టవేదాంత ప్రసంగములతో, పాపపుణ్యములకు రూపముకలదా ? యనే నాస్తికవాదముతో తనతోడి దరిద్రసోదరమానవ హృదయాంతరములలో వెలుగు మాధవుని గుర్తించక తన యైశ్వర్యమునకు తానేకర్తనని యిది నాస్వార్జితమవి, దీని నెవ్వరు కదలించలేరను పాతకాలపు ధోర

ణితో భగవత్సృష్టిలో సర్వులకు సమానమైన యధికారముగలదను పరమసత్యమును వేదాచారమును విస్మరించి, యార్జితలక్ష్మినే స్మరించుచు, నిది నాకు నిత్యమా ! సత్యమా ! యనెడి సమస్యా పరిష్కారమునకు సరియైన సమాధానము చిక్కక, భ్రాంతిజన్యమైన దృశ్యమాసమైన అనిత్యమైన యీ స్థూల ప్రకృతి సూక్ష్మాంశము బోధపడక జగత్పతియైన యా హరి ప్రార్థనమాని, చంచల లక్ష్మిని నమ్మి మోసపోతినే యని చివరదశలో 'ఛీ ! ఛీ ! నాలక్షాధికారితనము కక్షలకు క్రౌర్యముల కాలవాలము. జీవితానందశాంతి సాధనలకు చంచలలక్ష్మి యధికారిణికాదు. నామదేవ్, తుకారామ్, జ్ఞానదేవ్, తులసీదాస్, మొదలగు భక్తమూర్తులే మాకాదర్శము. తిరువయ్యార్ గ్రామవీథులలో భిక్షుకుడై శ్రీరామపరబ్రహ్మముపై, మనస్సు నిల్పి ఆ రాముని యనంత దివ్యజీవిత మహామహిమాన్విత ఘట్టములను రచనగావించి, యా రచనాస్వరూపమైన కీర్తనాదులనే స్మరించి భజించి తరించినట్టి యా త్యాగరాజస్వామి వారి దివ్యజీవన భిక్షాటనమే ! నిజమైన ధర్మజీవనము. వినిర్మల జీవన విధానము. ఆదిశంకరస్వామియే ఆదర్శమైన ఆదిభిక్షువు. శ్రీ వారణాసీ పురవీథులలో పుష్కరకాలము దివ్యభవ్యనవ్యభిక్షాటనము చేసి, భక్తులకెల్లరకు తననిరాడంబరాదర్శ ధర్మస్వరూపమును యథాతథముగా బోధించి భవబంధ విముక్తిని ప్రసాదించిరికదా!' యని సత్యమును గుర్తించి నిరాడంబరజీవిత గమన మొందసాగును.

గౌరవాగౌరవములు వృత్తిలోలేవు. వారివారినిత్య జీవిత

నాటకరంగస్థలాభినయ కళాకౌశలములలో ఘనీభవించినవి. గౌరవాగౌరవములకు, వ్యక్తి జీవితగమనములోగల ప్రవృత్తియే ప్రబలకారణము ప్రత్యక్ష ప్రమాణము. మీలోమీరే విషయనిర్ణయమునకురండి. పై విషయములను మనము యథాతథముగా కువిమర్శలకు దిగక దివ్యపరిశీలనముచేసినచో, జాతి మత కుల వర్గముల్నిటినికన్న గుణవిశిష్టతయే మిన్నయని ప్రధానమైనదియు విజ్ఞులెల్లరకు సుస్పష్టముగా సువిదితమగును. గుణగరిష్ఠులనే మనవేదకాలమందు బ్రాహ్మణులని చెప్పిరి. గుణహీనులనే శూద్రులని నుడివిరి. దీనింబట్టిచూడ సత్ప్రవృత్తియేవీటి యన్నిటికి మూలసూత్రముగా రాణించుచున్నదని చెప్పనగును.

# అందములో - ఆనందమున్నదా?

అందములో ఆనందమున్నదా? ఆనందములో అందము న్నదా? నీరెంటియందేది సత్యము? అందమునకు ఆనందమునకు నుపాధిఏది? ప్రకృతిరమణీయత చూచుటకెంతో హాయిని యాహ్లాదమును చేకూర్చుచున్నది. వసంతోదయముకాగానే యెండిపోయిన చెట్లన్నియు చిగిర్చి చిన్నచిన్న రెమ్మలతో కొమ్మలతో శాఖోపశాఖలతో విజృంభించి పక్షిసమూహమునకు నెలవై బాటసారులకు మార్గాయాసమును బాపుచు మిక్కిలి శోభాయమానముగా వెలుగొందును. సస్యములెల్ల పులకించి పొంగిపోవలయునన్నను, వృక్షరాజములన్ని దివ్యశోభతో నవ్వులు విరజిమ్మవలెనన్నను, ఎండిపోయిన సెలఏళ్ళు జలజలప్రవహించి గమ్యస్థానమునకు చేరవలెనన్నను, మయూరములు నాట్యము చేయవలెనన్నను, కోయిలలు సంగీతము లాలాపనము చేయువలెనన్నను, ప్రకృతియెల్ల పులకించి యానందమయ జగత్తుగా భాసించవలెనన్నను మేఘములన్నియు స్రవించి వర్షధారలతో భూమాతను జలకమాడించవలెనన్నను, నావరుణదేవుని కృపావిశేషము చేతనే జరుగవలెను. వరుణాద్యష్టదిక్పాలకులు భగవదాజ్ఞకు బద్ధులై వారివారి కర్తవ్యములను దీక్షాకంకణులై నిర్వర్తించెదరు.

రంభ ఊర్వశి మేనక తిలోత్తమాదిదేవకాంతలకు మించిన అందాలరాణియై నవయవ్వనపు జిగితో బంగారుమేని చాయతో

జడదారులనుసైతము పెడదారులనుపట్టించెడి నూత్నభంగిమలతో జగత్తునేమరపించు లీలావిలాసములచే రూపొందిన ప్రజ్ఞాప్రాభవ గరిమచే జగన్మోహినియగు నొకసుందరి హృదయకమల మందఱు స్వరూపముతో వెలింగెడి జీవాత్మతొలగినచో ఆమె సర్వాంగ సౌందర్యము బూదిలోపడినపన్నీటివలె వ్యర్థమౌనుగదా అందరికి నానందము చేకూర్చిన ఆమె నిండుయవ్వనపు గరిమ, మహిమ, ఏమయ్యేను? ఏది సత్యమో! చదువరులు గ్రహింపుడు, ఆరూపవిలాస విన్యాసమహిమాప్రదర్శనమున కంతటికి నామె దేహమున వెలుగొందు చైతన్యశక్తియే యని గుర్తింపుడు.

భీకరారణ్యమునందున్న గుహలోవసించెడి మృగరాజైన సింహమునైతము తనలోనున్న చైతన్యశక్తి తొలగిననాడు పనికి మాలినదై తోలుబొమ్మవలె నీభువిపై పడిపోవును. నీధరాతలమెల్ల పాలించెడి చక్రవర్తిని రాణులెల్లరు మంగళనీరాజనములతో చందన చర్చలతో ఘనముగా పూలపూజలు గావించెదరు. మంత్రి సామంతాధి సకలజనులు సాక్షాత్దైవమువలె భావించి యడుగులకుమడుగులొత్తెదరు నాట్యకత్తెలెందరో రకరకములైన నృత్యభంగిమలతో దర్బారునుపునీతముచేయుచుందురు. నాదర్బారునందెల్లవేళల కవిపండిత విద్వద్గాయకమణులు వివిధరూపములతో గద్య పద్యగానాదులతో చక్రవర్తిహృదయమును రంజిల్లచేయుచుందురు. సదారత్నాంబరాదులతో దేదీప్యమానముగా మెరయుచుండెడి నా చక్రవర్తియు, తనహృదయాంతరమున స్వయంవ్యక్తమై దీపించెడి జ్యోతి తొలగిన మరుక్షణము అంత

వరకు తనచుట్టు పడిగాపులుగాయుచున్న మంత్రి పురోహితభృత్య వర్గమంతయు, నివ్వెరపాటుతో చక్రవర్తి మరణించాడు. ఆలస్యముచేయరాదు నాశవమును క్రిందబెట్టుడని హంసతూలికా తల్పమందున్న నాచక్రవర్తిని క్రిందికిదింపి భూమిపై శయనింప చేతురు. నాచక్రవర్తిని నాతణినెవ్వగౌరవింపరు. చక్రవర్తి శరీరముపైనున్న మణిమయకంకణాదులన్నియుతీసివై చెదరు. క్షణమేని నాలస్యము చేయక ఆ చక్రవర్తి భౌతికదేహమును శ్మశానమునకు చేర్చి దహనము చేయుదురు.

వ్యక్తి -- గణనీయమైన పాండితీప్రకర్షలయందాఱితేరి తనకెవ్వరు సాటిలేరీభువి యను గొప్పకీర్తినార్జించినను, గజారోహణాదిసన్మానములను పొందినను, మణిమయకంకణమును గండపెండేరములను పొందియు విజయదుంధుభులను విశ్వమెల్ల మ్రోగించినను, బంగారుశాలువలతో, వందలాది శిష్యప్రశిష్యుల వందనసత్కార సన్మానములు పొందిపొంగిపోయినను, పూలరథములోరాజవీథులన్ని బహువిధవాద్యనాదములతో దివ్యోత్సవములు జరిపించుకున్నను, పన్నీటిజల్లులతో మేను పులకాంకురము చెందినను, దాసదాసీజన శిష్యపరివేష్టితుడై భూతలస్వర్గసుఖములన్నిటిని చూరగొన్నను, ధనరాసులలో తేలిపోయినను శతాధిక సన్మానములను నలువరాణికృపతో పొందినను, ఆనందమున్నదను కొనుట యనుమానమే ! కారణమేమన ? సర్వశరణ్యుడైన శ్రీహరి లీలావిలాసము మనకు నగమ్యము. మనము నిమిత్తమాత్రులము. ఈ సన్మానసన్నివేశ సమారంభములన్ని మనపూర్వ

పుణ్య విశేషమే! మన యుక్తిశక్తివలన లభించునవి కావు ఆనెడి నిత్య సత్యమును గ్రహించక, నావాక్శక్తి ప్రయోజనమువలన జరిగినవనెడు నహంకారముతో చరించిననాడు, సర్వ సుఖములకు దూరుడై యెందులకు నెవ్వరికిని పనికిరాక మిత్రు లనుకున్న తనసన్నిహితులకే శత్రువై హృదయమున శాంతిలేక యానందమునకు దూరమైన శాంతితో జీర్ణావస్థకులోనై తన పెత్తనములేకనే తనకు తెలియకముందే, తనువువీడి తత్త్వము దూరమై నతడీ, శివాకారమైన తాను శవాకారమై క్షణమైన నిలువక, చివర కాలుబిడ్డల బంధువర్గపు నోటిమేళాలతో డొమ్మెతప్పెట్లతో ప్రయాణమై కాష్టములయందు చేర్చబడి శ్మశానమున కగ్ని జ్వాలలకాహుతియై భూతిరాసిగా మారినాడు, ఏదిసత్యము!

# నవీనయుగము

పూర్వసంప్రదాయపు విధానములు ప్రతికళారంగమునం దంతరించినవి. నిత్యజీవిత విధివిధానములలోను నీరసించి నిర్జీవములైనవి. మాతాపితృగురుదైవముల నానాడెంతయో భక్తిశ్రద్ధలతో సమాజము పూజించితరించినది. తోలుబొమ్మలాటలనుండి యజ్ఞకర్మలవర కానాటి సంఘము దీక్షతో చరించినది. నాటి యాధ్యాత్మిక దివ్యసంపద్విభూతి కైంకర్యాదులకు వశులైన మానవులు స్వార్థమపేక్షింపక ధర్మబద్ధులై వియ్యము కయ్యములలో నొకేభావముతో గతిసాగించిరి. రాజులకు రంగప్పలకు నెట్టిబాధలు లేక నెవరెవరి కట్టుబాటులలో వారివారి నడకలనుసాగించిరి. అతిధుల నెంతేని యాదరణతో పూజించి గౌరవించిరి. కట్నకానుకల ప్రసక్తిలేకనే, వంశమర్యాద నీతినిజాయతీ గుణగణములనే పరిశీలనచేసి, పెద్దచిన్న తారతమ్యమును పాటించక వియ్యములందుకొని భారతీయుల భవ్యాదర్శములను గౌరవించిరి. ధనములేని పేదపౌరుడు నైతము హాయిగా నానందముగా తనకన్న బిడ్డల వివాహముల నిర్వహించి ధర్మమయమైన నిర్మలగృహస్థ జీవనవిధానమును గడపి కాలమును సద్వినియోగమొనర్చి గుణములకు వన్నెలుచేకూర్చిరి. నడివీధిలోవేసిన బంగార మెన్నిశతాబ్దములకైనను దొంగిలించువారు లేరైరి. ఆనాటి మానవసమాజములోగల యాస్తికత, నీతినిజాయతీ సత్యధర్మన్యాయాదులపై

గల ప్రగాఢ విశ్వాసము, మాతాపితృ గురుదైవములయెడగల భక్తివిశ్వాసములే ! వారి మనుగడకు ప్రధానములై విలసిల్లినవి. అట్టి ధర్మకర్మ వినిర్మల చరితులున్న యుగమునే, ధర్మయుగమని సత్యయుగమని కృతయుగమనియు నీనాటికి మనమెల్లరము పేర్కొనుచున్నారము. నాటి విధివిధానములు వ్యక్తములైనవి.

ఈనాటి నవీనయుగమున చతుష్షష్టికళలను సమ్మేళనము చేసి సర్వులకు నాకర్షణీయముగా రూపొందించి లోకమునకు ప్రబోధముచేయుచున్నారు. మీకెల్లరకు తెలిసినవారే ! సినిమా కళాకారులు. నేటి నవీనయుగమున నవసమాజమునకు మేలు చేకూర్పనెంచి, భగవద్విభూతికైంకర్యములను పురాణగాథలను కన్నులకుకట్టినట్లుగ నాదర్శరచనలను నాధ్యాత్మిక భావములను రేకెత్తించు మనోహర దృశ్యములద్వారా పూర్వసంస్కృతిని గోచరింపచేసి, సర్వమానవశ్రేయోదాయకమైన, ధర్మనీతి ప్రబోధములను దృశ్యరూపములో వివిధ వినోదధ్వని సమ్మేళనముతో హృదయాలకు హత్తుకొనునట్లెంతో కృషిచేసి బహుళ ధనవ్యయముతో వెండితెరపై ప్రసారముచేసిన 'సినిమా' కవిగాయక నటనాభినయాది బృందముల సదాశయముల నీనాటి నవసమాజము నమ్మచేసినది, లోకపుతీరు గుర్తించిన సినిమా కళాసార్వభౌములైన పెద్దలు. "ఓహో ! మార్గమిదికాదు. ప్రజాభిప్రాయము నందేకీభవించిననాడే, మనకు లౌకికసదుపాయములన్ని సమకూడును. లౌకిక ప్రజాకోటి హృదయములను కవ్వించి నవ్వించిననాడే మనకు భుక్తి మనకళకు ముక్తి కలుగును. లేనిచో కళ

నిర్జీవమగుననెడి తాత్కాలికాభిప్రాయముతో కథలోని మూల సూత్రములను సూక్ష్మాంశపరిశీలనాదక్షులకు మాత్రమే యవగత మగునట్లును, తదితరపామరలౌకిక ప్రజాకోటి నాకర్షించెడి రతి శాస్త్రరహస్యములన్ని వెండితెరపై ప్రత్యక్షానుభూతిని కల్పించెడి రీతిలో సినిమాకళాబృందమువారు నిర్మించి మన వాశవాకలకు రవాణా చేయుచున్నారు. కథాకథనములను దర్శించిన ప్రేక్షకులు కథలలోని పాత్రల నామధేయములను మరచి, రామారావు నాగే శ్వరరావు జ్యోతిలక్ష్మి మొదలయిన సినిమాతారలనే మనస్సున ధ్యానించుచు కథలోని తుది పరిణామమును గుర్తించుటకు బదులు, కథారంభములో నాయికానాయకుల దుష్టచేష్టలను దుర క్రమ సన్నివేశములను గాఢపరిష్వంగములను బలాత్కార ప్రేమ పిశాచావేశమదోద్రేక స్వరూపములనే గుర్తుంచుకొని, నిత్య జీవిత నాటకరంగములయందు ప్రవేశపెట్టి పతనావస్థకు గురి యైన వారెందరో నేటినవీనయుగమున కోకొల్లలుగా కనుపించు చున్నారు. దీనికంతటికి పరిణామమేమన! వ్యక్తి తనకున్న సంస్కారముతో ప్రతిరంగమునందున్న దృశ్య వినోద విశేష ములను తిలకించుచుండును. ఆయాదృశ్యములందే మనస్సును లగ్నము చేసి చరించుచుండును.

ధర్మాధర్మములు న్యాయాన్యాయములు సత్యాసత్యములు నేటి సినిమా యుగ పరిణామదశయందు జీర్ణించిపోయినవి. ఎక్కడో బహు సూక్ష్మరూపములో ధర్మమున్యాయము సత్యము నీతి నిజాయితీ శాంతి సహనాదులు లేకపోలేదు. వాటికి సంఘ

దృష్టి చాల తక్కువ. ఐననేమి! వాటికున్న విలువ శాంతి గణ నీయమైనది. ఈ నవీనయుగమునను, కృతయుగవ్యక్తులు న్నారు వారు ప్రతికార్యరంగములోను త్యాగమయజీవనులై ధనమునకు విలువనివ్వక, మానమర్యాదలు మంచిచెడ్డల తార తమ్య స్థితిగతులు గుణగణప్రవృత్తి మొదలలైన సాత్వికలక్షణ ములనే గౌరవించుచుందురు. ఇట్టి వినిర్మల మనఃప్రవృత్తిగల పెద్దలతోడి వియ్యము కయ్యము నెయ్యము కూడను నానంద హేతువులే!

నేటికలిదారుణవాతావరణ వివాహమర్యాదలనేనాడో, ఆధునిక మహాకవులు స్వానుభవపరులు న్యాయమూర్తులైన శ్రీకాళ్ళకూరి నారాయణరావుగారు కన్నులకు కట్టినట్లు వారి 'వరవిక్రయము' అను గ్రంథమున నిట్లువర్ణించిరి. "చెడె ధర్మంబు నశించె నీతి."

ఆ మహాకవి తన యాడుబిడ్డల వివాహము చేయుటకెంత శ్రమపడెనో! ఎట్టి యవాంతర పరిస్థితికి గురియై విసిగి వేసారి తన దుస్సంఘటనల ఘోరపరిణామమును నాటకరూపమున రచన చేసి తన హృదయావేదనను తనతోటి ఆడుబిడ్డలకన్న తల్లి దండ్రులకు వ్యక్తము చేసిరి.

నేటి కలిలో ప్రతికుటుంబములో నొక తీరని యారని యాందోళనాగ్ని విజృంభించుచున్నది. ప్రతి సమాజములో నీదురంతదుస్థితి సాక్షాత్కరించుచు నెంతోయావేదన కల్పించు

చున్నది. అది యేమిటి? వరకట్నపిశాచీ విపరీత వికటాట్టహాస విలయతాండవము.

అబ్బాయి తండ్రి అమ్మాయితండ్రిని శక్తికిమించిన కట్నములను కోరుటయు శక్తిలేకయు విధిలేక యీడువచ్చి యింట నున్న కన్యనుజూచి కొందరు, మరికొంద రైదారేడులనాడే రజస్వలైన పుత్రికామణులను చూచి వగచుచు జాలితో అల్లుని బాకీ పరిష్కారమునకై యెన్నో యగచాట్లకు లోనై యెందరినో యర్థించి ప్రార్థించి అర్థాన్ని అప్పుగా స్వీకరించి తాను వరాన్వేషణకై పడిన యగచాట్లను గుర్తుకు దెచ్చుకొని తనలోతాను అహా! అల్లుడో! నా ప్రాణానికి ముల్లుడో! నేటికి గట్టు చేరితివి. వంశ మర్యాద కన్యవయోరూపలావణ్య గుణగణ పఠశీలన హృదయ వికాస జీవితవిధానాది సద్గుణసంపత్తిని పరామర్శించువారే లేరైరి. ధనాశాపాశ పీడితులు, "కట్నమెంత ముందు చెప్పికదులు" అని వాకొను చున్నాడే! కలి మహిమను వర్ణించ కవులకు తరమా?

ధనాశాబద్ధుడై సమయము పోయిన రాదనెడి కఠిన హృదయముతో కట్నాల పీడనముతో కాలయమునివలె సంఘమారణ హోమములో ఘృత కుంభములు కుమ్మరించువై ఖరి వరునికన్న తండ్రి భరించుచుండును. ఇట్టి స్వార్థదాహ పీడితులతో చేయు సంబంధము నా ప్రాణానికి బంధము ఛీ! ఛీ! వలదని తనలో తానూహించుచు హరిని స్మరించుచు కాలమును గడుపు చుండును వధువును కన్నతండ్రి.

నూటికి తొంబదిమంది తమ కన్నబిడ్డల వివాహ సమస్యా పరిష్కారమునకు దిక్కుదోచక సతమతమగుచుండుట సర్వులకు విదితమే ! స్వార్థదాహ పీడితుడగు లౌకికమానవుడు

పరులకు హితబోధలు చేయుట, తనకుతాను హితబోధచేసి కొనుట కెట్టియూ వేదనయు లేక స్వార్థమనెడి ముసుగునందే జీవిత నాటకమాడుచు తనతోటి మానవుని శక్తి సామర్థ్యములు వంశ మర్యాదలు హృదయము తీరు తెలిసియు సమయము పోయినరాద నెడి యాశతో కన్యాదాత రక్తమాంసములను నైతము లాగుటకై ప్రబల ప్రయత్నము లొనర్చుచుండును.

వరాన్వేషణలలో నలిగి నలిగి సతమతమై విషయనిర్ణయ సమస్యా పరిష్కారమునకు మార్గము చిక్కక మందమతితో చిత్తక్షోభను పొందుచు పిచ్చివానివలె నెక్కడెక్కడికో యాడు బిడ్డలకన్న తండ్రి పరుగులు తీయుచుండును,

ఇన్ని బాధలుపడి గట్టెక్కిన నాపెద్దమనిషి, తన కుమారుని వివాహపు విషయమున తాను బడిన యగచాట్లనుమరచి కసాయి హృదయముతో ధనము ధనము ధనమని కేకలు వేయుచుండును.

వియ్యము కయ్యము నెయ్యము నీమూడు సరి సమాను లతో చేయుటయే మేలనెడి యార్యులనుడి, నేటి దుష్టకలి వాతా వరణమున శూన్య రూపమునే దాల్చినది, దీనికంతటికి కర్త లెవ్వరు? ఎంతయుండినను తృప్తి త్యాగము. ఓర్పు దరిలేని యాశాదాహముతో తహ తహలాడెడి మేకవన్నె పులులైన మానవులే! మానవులే!

నేటి నవసమాజముననెన్నో పరిష్కారమార్గములకు నవ యువకులే ముందునకు వచ్చి కార్యరంగమున కొదమసింగముల వలె విజృంభించుచున్నారు. నిన్నమొన్నటి పరిణామదశనంద రము కన్నులార దర్శించి నవయువకశక్తికి మోకరిల్లితిమికదా! పసిబాలురున్నై తము 'జై-ఆంధ్రా' యను వీరరసావేశపంభరిత ప్రణవనినాదము చేసి జగతినే కంపింపజేసిరి. విద్యార్థులెల్ల రొక్క మ్మడిగా నేకాభిప్రాయులై ధూమశకటయానము లాదిగా తంతి తపాలా వరకు స్తంభింపజేసిరి,

అట్టి కొదమసింగములైన నవయువక శ్రేష్ఠులలో విశాల హృదయులైన విద్యాధికులు ధనవంతుల బిడ్డలు చైతన్యము కలిగి సమాజ దుస్థితివి బాలికల మనఃప్రవృత్తులను గమనించి కట్నాలపిశాచిని సరిహద్దుల దాటనంపి దివ్యగమనమున కుద్యు క్తులై, కన్యారూపరేఖావయోవిలాసాది గుణగణములను గుర్తించి కట్నముల ప్రసక్తిలేక ప్రేమతో సమర్పించిన కానుకలను మాత్రమే స్వీకరించి వివాహములు సంపూర్తిచెందించిననాడు, ప్రతి సంఘము నెంతటి మహోన్నతదశకు పురోగమించునో! ఎవరికివారే సత్యమును గుర్తించి కార్యరంగమున ప్రవేశించి, భారతీయాదర్శ మూర్తులై ధర్మకంకణములను దాల్చి దేశ భవిష్యమును తీర్చిదిద్ది పుణ్యమును గట్టుకొనుడు.

ఇట్టి సంఘసమైక్యత మహోన్నతాదర్శ దివ్యగమనమును, విజ్ఞానులైన నవయువకులు జాగృతిని పొంది తనజాతిలో [illegible]దాణ మైయున్న పూర్వ పుటోన్నత్యదశను మరల పునరుద్ధరణము

నొందించి కట్నాల వ్యాపారముతో గతిసాగించెడి కార్యకర్తలైన పెద్దలకు నచ్చచెప్పి యాదర్శవివాహములనే నిర్వహించిననాడు జాతి భవితవ్యస్థితి నవ్యశోభను చెంది దివ్యమైయలరారును.

'కన్యమంచిది కట్నముపెచ్చు' కావలయుననెడి స్వార్థవైఖరితో సంబంధమును కాంక్షించినవ్యక్తికి సుఖము చేకూరునా! లేదు ముమ్మాటికి లేదు. శక్తిలేనివారు కన్నకూతురు వివాహము చేయుటకన్న కాలినడకతో కాశీయాత్ర చేయుటయే సుఖమని దోచుచున్నది. సర్వసంకటములలోనున్న కన్యాదాత తప్పక నూరుకల్లలాడియైనను కన్నకూతురు వివాహము చేయనశక్తుడై తనకున్న నిల్లువాకిలినమ్మి యల్లునికట్నమును సమకూర్చుకొని వరాన్వేషణమును సాగించుచున్నాడు. వివాహము=విశేషమైన బంధము అని పదములోని భావము. నేటికాలపు కట్నాల జాడ్య మనుభవించినవారికి మాత్రమే యర్థమగుచున్నది. కన్నీటితో నిచ్చినకట్నమెంతైన ప్రయోజనకారికాదు. "గంగిగోవు పాలు గంటెడైననుచాలు కడవడైననేమి ఖరముపాలు" యనిన మన వేమనయోగి సూక్తియెంతయో సమంజసమైనది. ప్రేమతో నానందముతో సమర్పించిన కట్నకానుకలల్పమైనను నవికాలానుక్రమమున మహోన్నతములై రాణించును, ఒత్తిడితో తప్పక బాధతో నిచ్చిన కట్నకానుకలు మేరువైనను కాలానుక్రమమున తృణమై పరిణామము చెందును. ఇట్టిసంఘటనలు లోకమున నెన్నియో గనందగును.

# నామరూపక్రియారహితుడు

నామరూపక్రియారహితుడు సర్వాంతర్యామి మంత్రాధీనుడై, యోగుల హృదయగుహలయందు నివసించెడు జ్యోతిర్మయ మూర్తియునగు భగవంతుడు, స్వయంసంకల్ప ప్రేరణతో భిన్న భిన్నాభి ప్రాయములతోనున్న జీవులను రక్షించుటకై వేదములను ప్రసాదించుటయేకాక, విశ్వజనీనమైన యాదరణ ప్రేమవాత్సల్యములతో నన్నిదేశాలలో వివిధసంప్రదాయములతో నున్న సోదరమానవకోటి హృదయ సంస్కారణమునకై అనేకావతారములను తానె దాల్చి దేశకాలపాత్రోచితరీతి నొకే యొక పరమ సత్యమును శంకర రామానుజమధ్వాచార్యుల రూపమున, అద్వైతము విశిష్టాద్వైతమని ద్వైతమను రూపములతో ప్రచారము చేసిరి. మరియు, శాక్తేయమని గాణాపత్యమని సగుణమని నిర్గుణమని (నిర్గుణాతీతమని యచలమని పరిపూర్ణమని) హైందవమని, వ్యక్తుల హృదయాంతర వైఖరుల ననుసరించి బహురూపములలో బహు మార్గములలో సూచింపబడెను. నిరీశ్వరవాదము నైతము మనకు తెలియనిది తెలిసికొనుటకు సాధ్యముగాని శక్తియొకటున్నదనియే సిద్ధాంతము చేసినది. ఏకమార్గావలంబనమే ముక్తికి సరియైనత్రోవ! బహుమార్గసృష్టీకరణయు, సృష్ట సదాశయము, నేకేశ్వరుడైన తన్నుగుర్తింప చేయుటకే! నాస్తిక వితండవాదములుచేయు తార్కికులును చివరకు హృదయపుండరీ

కమునందే స్వప్రకాశముతో వెలింగెడి యాత్మశక్తిని ననేక పరిణామముల యనంతరము గుర్తించి శ్రమించి యఖండకృషితో యోగానుభవమును పొంది ఏకేశ్వరవాదమునే సిద్ధాంతీకరణ మొన ర్చిరి. క్రైస్తవులు నొక చిహ్నమును గుర్తించుకొని ప్రార్థ నలు సలుపుచుందురు. మహమ్మదీయులు నేచిహ్నమును నుంచక మక్కాయున్న దిక్కును ధ్యేయముగా పెట్టుకొని అల్లాప్రార్థనలు చేసెదరు. సమస్తమానవులు తనకుమించినది తనకు తెలియనిది యేదో యొకానొక శక్తియున్నది. దానికెట్టి నామరూపములులేవు. అదిక్రియారహితమైనది, ఏరూపములేకయే యన్ని రూపములు తానై యున్నది. ఏ నామమునకు చెందక సమస్తశబ్దజాలమునకు తానే మూలమై వెలుగొందుచున్నది. ఏకర్మయును చేయక కర్మలకు కర్మయై భాసించుచున్నది. అన్నిటికతీతమై యన్ని టికి మూలమై యన్నియునై ప్రకాశించుచున్నది. సగుణబ్రహ్మమై నిర్గుణ బ్రహ్మమై పరబ్రహ్మమై పరమాత్మయై పరాశక్తియై ప్రకాశమై ప్రజ్ఞానమై సర్వవ్యాపకమై నిత్యసత్య నిర్వికార నిరా లంబనమై సర్వప్రకృతికి జీవమై స్వయంవ్యక్తమై సదా వెలు గొందుచున్నది, ఇది నగ్నసత్యము.

౬

# సన్యాసము శ్రేష్ఠమా? సంసారము శ్రేష్ఠమా

సనా సము శ్రేష్ఠమని కొందరు, కాదు! సంసారమే శ్రేష్ఠమని కొందరు, సన్యాసికి మోక్షము లేదని సంసారులు, సంసారికి మోక్షములేదని సన్యాసులు, ఇటుల ద్వైతభావనములతో నెవరికి వారే ముక్తికరతలామలకము పరిపూర్ణతయు సిద్ధించినదని వారిని వీరు, వీరిని వారు హేళనలు చేసికొనసాగిరి, ఈ యిరుతెగల వారు వారిలోవారే యిదిమంచిది. అదికాదనే నిర్ణయమును చేసికొని అహంకారపూరితులైరి. ఇందేదిసత్యమో గ్రహింపవలెనన్న శ్రీసద్గురునియవ్యాజ కరుణాకటాక్ష వీక్షణ ప్రసారమునగాని లభ్యపడదు. గురువులకు సద్గురువులకు ఎంతో వ్యత్యాసము కలదు. బాహ్యాచారములననుసరించి కర్మకాండలో కాలముగడిపెడి సామాన్యులు,పంచమహాపాపాలని నిర్ణయము చేసినట్టి, జూదము- వ్యభిచారము - దొంగతనము - సురాపానము - అసత్యము అను నీ ఐదింటిని మాత్రమే! ఈ ఐదు దుర్వ్యృత్తులకు నలవాటై చిత్తచాంచల్యమును తొలగించుకొనుటకు యత్నించక వారు పతనావస్థకు దిగజారుటే గాక వారి మిత్రత్వమును కాంక్షించిన తోటిమానవులు దుష్టసంస్కార సాంగత్య దోషముచే, జూదరులై వ్యభిచారులై చోరులై త్రాగుబోతులై అసత్యపరులై వీరు వారుగా మారి వీరు, వారినెంతో ప్రేమతో గురూ! గురూ! యని సంబోధించెదరు. కలికాలపు మహిమ! 'గురు' యనెడి పవిత్రపదము,

వ్యసనాదులకువశమై మనస్సునకు బానిసలైన వారినోటబడి వ్యంగ్యముగా మారినది.

(గు - అనగా, చీకటి, అని, రు - అనగా, పోగొట్టునది యని - ఆపదముయొక్క భావము)

సద్గురువు - అనే పదము మహోన్నతమైనదని, ఇంద్ర పదవిని పొందుటయు సులభమే! సద్గురు పదవిని పొందుట బాల కష్టమైనదని, స్వానుభవము పొందిన సద్గురువులు ఏకాంతమున సందర్భాను సారముగా భక్తిగల శిష్యులకు వ్యక్తము చేసిరి. నేటి పాపిష్టి కలిలో సుఖములకు మరగి, వాచావేదాంత వాక్య పటుత్వముతో మేమే సద్గురువులమని, యమాయకులను వలలో వేసికొని వారి ధనవ్యయముతో హాయిగా ఆనందముగా కాలమును గడిపెడి తాత్కాలికదృష్టవంతులు లేకపోలేదు. వారి యాటలు పాటలు బహుకాలము సాగవు. ఆవాచావేదాంతుల సుఖభోగ లాలనపాలనాది సౌఖ్యగరిమ, త్రిశంకుని స్వర్గము వంటిదే!

సర్వ భూతసముదాయమునందు సర్వశక్తి సంపన్నమగు చైతన్యమునిండియున్నది. చైతన్యశక్తిలేనిదే జగత్తునకు చలన శక్తియుండదు. అట్టి చైతన్య జన్యమైన భూత జాలముననే ప్రతివిషయములో గురు రూపముగా భావించి తద్ద్వారా తనలోగల దివ్యచైతన్య శక్తిని సమ్మేళనము చేసికొని తన దివ్యస్వానుభవ సందేశములను నిరహంకారముతో నిర్విచారముగా నిత్యానందులై యోగానందులై శిష్యుల కందించెడి మహనీయ మూర్తులందరిని జగద్గురువులని పేర్కొనుచుందురు.

సద్గురువు - అనగా, సామాన్యుడు మాత్రము కాదని సదాజ్ఞప్తియందుంచుకొనుడు. సర్వేశ్వరుడు విశ్వనాథుడు పరబ్రహ్మము అనే ఈ పదత్రయములో ఒకేభావము స్ఫురించుచున్నది. లోకేశ్వరుడు భూతనాథుడు జగన్నియంత అనే, ఈ పదత్రయములోను నదేభావమున్నది. అనంతకోటినామాలలోని మూలరహస్యము పరిశీలించినచో పరమాత్మయే యని తేలినది, దేవుడు, పురాణపురుషుడు, పురుషోత్తముడు, అప్రమేయుడు, అనంతుడు, త్రిగుణరహితుడు, అనెడి ఈ నామ సముదాయమంతయు ప్రణవమైన ఓంకార శబ్దమునుండి యుత్పత్తి కాబడినది. ఒకే ఒకశక్తి వివిధరూపములను పొందినది. ఆఒకే శక్తినిగూర్చి శ్రుతులన్నియు ముచ్చటించుకొన్నవి. శ్రుతుల సంభాషణాపరంపరలయందు గుణభేదమణువైనను లేదు, శ్రుతి ఆదేశములను వినండి; సత్యమును కనండి.

శ్రుతి॥ అజ్ఞానహృదయగ్రందేర్నిశ్శేష విలయస్తథా
సమాధినా వికల్పేన యథా ద్వైతాత్మదర్శనమ్॥
(అధ్యాత్మోపనిషత్తు)

హృదయ గ్రంధి అనగా తలపు, మరపులు - ఈ తలపు మరపులు అనునవి లేకపోయినచో, తాను ఆత్మస్వరూపముగా నిలిచిపోవుచున్నాడు. అట్లు నిలిచిపోవుటయే నిర్వికల్పసమాధి యని చెప్పబడును. ఇట్టివారికిని పరబ్రహ్మమునకును భేదము లేదు. ఇతడు బ్రహ్మస్వరూపుడు - బ్రహ్మవేత్త యనగా!

బ్రహ్మనుదర్శించాడు కాని, బ్రహ్మగామారలేదు. శాస్త్రవేత్త - అనగా, శాస్త్రమును తెలిసినవాడు. శాస్త్రముతెలిసిన వ్యక్తి-అనేవి రెండు కనబడుచున్నవి. బ్రహ్మస్వరూపుడు అనగా ద్వైవత్వము కాదు. అద్వైతమనిభావము. "బ్రహ్మవేది - బ్రహ్మైవభవతి" యని శ్రుతి చెప్పుచున్నది. అనగా, బ్రహ్మమును తెలిసికొన్నవాడే బ్రాహ్మణుడు.

మాంసముతోచేరి, నరములతోకూడి యెఱుపు తెలుపు వన్నెగల కమలము వంటి యొకమొగ్గ సకల జీవరాసులయొక్క హృదయమున నధోముఖముగా వ్రేలాడుచుండును. ఆకమలము, కంఠమునకు జేనెడుక్రిందుగను, నాభికి జేనెడు పైన వ్రేలాడుచుండును. ఆకమలముయొక్క మధ్య రంధ్రమొకటి కలదు. ఆరంధ్రములో నంగుళము పొడవుగల బయలుండును ఆబయలునందు జలము పూర్తిగానిండి యుండును. పిపీలికాది బ్రహ్మపర్యంతము సకల జీవరాసులయొక్క హృదయకమలమునందు వడ్లగింజముక్కు కొనయందు సూదివలెమిక్కిలి సన్నగానుండును. ఆ సూదికొనయందు మాత్రము ఆత్మప్రకాశించుచుండును. పరమాణువైన ఆ శక్తియే విశ్వమంతయు నిండియున్నది. ఆపరమాత్మను దర్శించవలెనని యున్నవ్యక్తి ఏవర్గమునకు చెందినను ప్రయత్నము చేసి యా పరమాత్మను పొందగల్గినచో భవనరకదూరుడై బ్రహ్మానందముతో యోగసిద్ధిని పొంది సద్గురువై సదానందుడై శాశ్వతుడై మృత్యుంజయుడై విరాజిల్లుచుండును.

ఆ పరమాత్మైక్యసిద్ధినిపొంది ఈ జన్మయందే జీవన్ముక్తి నిగాని గాంచవలెనన్నచో యోగానుభవము వలననేగాని సాధ్య పడదు. "యోగశ్చిత్తవృత్తినిరోధః" అనగా చిత్తవృత్తులను జయించుటకు యోగము సాధనమని భావము. ఇట్లు శ్రీపతంజలి మహర్షి యోగశాస్త్రమునందు చెప్పిరి.

ఈ మేనునందున్న నేను ఎవరో! తెలిసికొనుటకొరకు సర్వ సంగములను తృణప్రాయముగా వీడి తనలోతాను చర్చించుకొని నేనే సర్వదుఃఖములకు కారకుడనా? లేక నేనుగాక వేఱొకటు న్నదా? కాదు. నేను ఒక్కడనే! నేనే మాయా మోహితుడనై నేను, నేనుకాదు, ఈ మేనే నేననుకొని భ్రమించి ప్రకృతిబద్ధు డనై, నేను మాటమరచి, మేనులో నున్న నేనును, నేను కాదనెడి అజ్ఞానాహంకారాదులతో సమదృష్టి లేక సద్గురువుల దయకపాత్రు డనై దురభిమానముతో ద్వైతదృష్టినే బలపరచుకొని, మేను వదలిన నేనును, దర్శించలేక మేనే నిజమనుకొని మతిమాలిన వాడనై గతిదప్పి చరించితిని. నామతిగతి గనెడువారు ఏ లోక మున సాధువులా? లేక సంసారులా?

బోడిగొట్టినను జడలు బెంచినను నింటనున్నను లేక నర ణ్యమున నున్నను, కందమూలాదులతో సెలయేటి నీటితో కాషా యాంబరధారణతో నేకాంతవాసము చేసినను, గ్రామములయందే నివాసమేర్పరచుకొని ధౌతవస్త్రములు దాల్చినను వేషభాషలతో వివిధకర్మములు చేసినను, గంగాదినదుల పరిసర ప్రాంత ప్రశాంత వాతావరణమున పర్ణశాలలయందున్నను, సన్యాసి రూపముతోగాని

సంసారి రూపముతోగాని, ఏరూపముతోనున్నను, నేను, మేను, అను వివరము తెలిసికొని అన్నిటను నేనే, నేనుతప్ప యన్యము లేదని యద్వైతసిద్ధి పొందిననాడు, సన్యాసము శ్రేష్ఠమే! సంసారము శ్రేష్ఠమే!

సంసారములోనుండి సంసారివలె లోకమునకు వ్యక్తమైనను, తన మనోవికారాదులను విశేషముగా త్యజించిననాడు సంసారిరూపములో నున్నప్పటికి తాను సన్యాసియే! ఇదియే గురు కీలకము.

శిరోముండనాదులతోనైన, దీర్ఘజటాధారులై దండకమండలములనుచే బూని వాచావేదాంతోపన్యాసవాహినిలో సర్వులను వశమొనర్చుకొని, తన పాదాక్రాంతులను గావించి ఘనపూజలందుకొన్నను, పసిడికి పడతికి లొంగినచో సంసారియేయగును. మీదు మిక్కిలి సంసారికన్న చులకనయైనగౌరవము పొందును.

సంసారియైన భక్త - తిన్నయ్య పరమభక్తితో కన్నీటి ధారలతో నావేదనతో నార్తితో ప్రార్థనాపూర్వకముగ నివేదన చేసిన పందిమాంసమును భవ్యనైవేద్యముగా మార్చి పరమేశ్వరుడు ప్రీతితో స్వీకరించి తిన్నప్పవు నేడు కన్నప్పవై తివని ప్రేమమీర గాఢాలింగనము చేసికొని తనయందైక్యము చేసికొనెను.

శ్రీమహాభాగవత రచయితయైన శ్రీబమ్మెరపోతనామాత్యుల వారు, భద్రాచలమునందు శ్రీరఘువరాలయమును నిర్మా

ణము చేయించి శ్రీరామ భక్తిని విశ్వమెల్ల చాటిన శ్రీకంచర్ల రామదాసుగారు, శ్రీరాముని దివ్యజీవిత చరిత్రను కృతుల రూప మున రచనచేసి తన మృదు మధుర కంఠధ్వనితో తంబురశ్రుతి సమ్మేళనముతో పాడి ఆంతరించినట్టి శ్రీకాకర్ల త్యాగరాజస్వామి వారు, కాలజ్ఞానము పేరుతో ప్రపంచ భవితవ్యమును యథాతథ ముగా చెప్పిన మహనీయమూర్తులు శ్రీపోతులూరి వీరబ్రహ్మేంద్ర స్వాములు వారును, ఆధునికయుగమున నవతరించి మానవ సేవయే! మాధవసేవ (1) యని యెలుగెత్తిచాటి తన సత్యా హింస శాంతిసూత్రాలతో తెల్లదొరల (2) గుండెలను తల్లడిల్ల చేసినట్టి భారతాంబ మురిపెంపు ముద్దుబిడ్డ, ముక్కోటి యాంధ్రు (3) లచే మహాత్మాగాంధీ! యని పొగడబడిన పెద్ద మన బోసినవ్వుల గాంధీతాతగారు (4) సంసారమునందుండియే తరించిరి. పండరిభక్తులెల్లరును సంసారమునందే సర్వలోకనాథు డైన యాపండరినాథుని పాండురంగని భజించి దివ్యదర్శన మునుపొంది శ్రీరంగని కొనియాడి విరక్తిమార్గమున నావిఠుం ఠుని దివ్యనామస్మరణామృత పానముచేసి తరించికైవల్యమును పొందిరి. 'సన్న్యాసము – సంసారము' ఈ రెండును సద్గుణసంప న్నులకు శ్రేష్ఠములే,

౭

# దేవతాధ్యానము - రక్షణమా? భక్షణమా?

సర్వజీవులు దేవుని సంతానములు. నీ జన్మకు కారణము నీ జనకుడు, ఆయన జన్మకు కారణమాయన జనకుడని యిట్లుంచనా వేసిన వారివారివారలయొక్క జనకుడెవడో యొకానొకవ్యక్తి యుండునుగదా! ప్రప్రథమముం దుద్భవించిన యాదిమ మానవున కెవరు తల్లిదండ్రులు? మనము యోచనచేసినచో మనక గమ్యముగా నుండును. ఆదిమానవు డెట్లుత్పత్తియయ్యెను? ఆయనకుల మేది? మత మేది? మాతాపితృ సంయోగము లేనిదే సృష్టిజరుగనేరదు. ఆదిలో యాదిదంపతులెట్లు సృష్టింపబడిరి? దీనికింతవరకు సరియైన సమాధానము తృప్తికరముగా చెప్పినవారు లేరనియే చెప్పవచ్చును. ఐనను నేవ్యక్తులు చెప్పని సృష్టిరహస్య విధివిధానములను మనకు పూజ్యములైన వేదములు యథాతథముగా చెప్పినవి. నావేదప్రామాణికములను కాదనుటకెవ్వరికధికారమునులేదు. విధిగా నమ్మవలసినదే! ఒకానొక మహత్తరశక్తి తనకుతానే స్వయంవ్యక్తమై సృష్టినారంభము చేసినది. పంచభూతాత్మకమగుప్రకృతి యొకదానినుండి మరొకటి, దానినుండి మరియొకటియు నావిర్భవించినవి, సృష్టి ప్రారంభమునకు ముందే నిరాకార నిర్గుణ నిత్యసత్య శక్తి యొకటున్నది. దానినే దేవుడని, శక్తియని పరమాత్మయని రకరకములైన నామసముదాయముతో వేదము ప్రతిధ్వనించుచున్నదని యార్య

ఋషులు నాదేశించిరి. నేటియాధునిక విజ్ఞానవేత్తలు సైతము, అణుశక్తి పరమాణుశక్తి యొకటున్నదని దానినే నేటి పరిశోధనలద్వారా మేధాశక్తి కందినంతవరకు తెలిసికొనుచు, తెలిసికొనవలసినదే బహుళముగా నున్నదని లోకమునకు చాటుచున్నారు.

ఇందలి సారాంశమును సూక్ష్మముగా పరిశీలన చేసినచో, సర్వమానవులు తదితర జీవకోటియంతయు నాదికాలమునం ప్రకృతి పరమాత్మల సంయోగముతోడనే యుద్భవమందినది! మానవసంఘమువలె తదితర జీవజంతుజాలమంతయు భగవంతుని దివ్యశక్తి సంజనితమే!

ఈచరాచర సృష్టియంతయు విశ్వాంతరాళమున వలయాకారమున పరిభ్రమణము చెందుచున్నదని, మనము నివసించు నీ భూగోళములవంటివి యెన్నో నీవిశ్వవలయమున బంతులవలె తిరుగుచున్నవని నేటివిజ్ఞాన శాస్త్రజ్ఞులు చెప్పగ విశ్వసించుచున్నారము. కోట్లాది సంవత్సరములకు పూర్వమునందే మన భారతీయ ఋషివర్యులు, నేటి యాధునిక శాస్త్రజ్ఞులు చెప్పెడి ఖగోళరహస్యములను తేటతెల్లముగా చెప్పిరి. 'క్రొత్తొకవింత పాతొకరోత" యనెడి సామెతగ పాతకాలపుమాటల నంగీకరింపరైరి. ఆంగ్లేయులు భారతదేశమునకు వచ్చి భారతీయులను గౌరవించి యాదరించుచు చివరకు పరిపాలకులై భారతీయవిజ్ఞానమును గుర్తించినవారై యావిజ్ఞానమునందున్న వివిధరహస్య

ముల నవగతము చేసికొని యాయా వేదములయందున్న మంత్ర రహస్య పరిశోధనములను స్వానుభవముతో రూపొందించుకొని వారి ప్రజ్ఞాప్రాభవములతో రూపమును మార్చి యాధునిక యంత్ర పరికరములను తయారుచేసి భారతీయులనే యాశ్చర్య చకితుల చేసిరి. నేటికి భారతీయులకు కనువిప్పుగలిగి "ఆహా మన వేద విజ్ఞానమును తెల్లదొరలెంతవరకు రూపొందించిరి. మనకా శక్తిలేదా!" యని జాగృతినిపొంది తలలు తడవుకొనుచున్నారు.

నోటిమాటలతోనే "ఆకాశమునందుగాలి గాలియందగ్ని అగ్నియందునీరు నీటియందు పృధ్విని" యనెడి మంత్రములతోనే కాలముగడుపుచు, నీకన్నమించినవారు లేరు హనుమన్నయని యనినప్పుడే లంఘించెడి రీతి, భారతీయులు, తదితరదేశముల వారు పొగడినప్పుడు పొంగితెగబడునప్పుడు క్రుంగిపోవుచున్నారు.

ప్రతివిషయమును, భారతీయవిజ్ఞానము సూటిగా చెప్పినది. కాలమహిమచేత నాభారతీయశక్తిని మరచిపోయి, క్షణికమగు తుచ్ఛమగు నైహికసుఖములకే, వ్యక్తి తన దివ్యశక్తి దుర్వి నియోగము చేయుచున్నాడు.

ప్రకృతిశక్తిని 'దేవత' యని పరమాత్మశక్తిని 'దేవుడు' అని ఆర్ష సంస్కృతి పేర్కొన్నది. పతియాజ్ఞకు లొంగి సతి యెట్లుప్రవర్తించునో, అదేవిధముగా 'దేవుని' ఆజ్ఞాపనకు 'దైవత' తలయొగ్గి జోహారొనర్చును.

దేవుని సృష్టిలో హెచ్చుతగ్గుల తారతమ్యము తరతమ
భేద మణుమాత్రమేని యుండదు. అయన సువిశాలసృష్టియందే
ర్పడిన మానవసంఘమే యొకానొకనా డనాగరికతతోనున్న రోజు
లలో పంచభూతాలనే దేవుడని పూజించేవారు. సృష్టిశక్తికి
మూలమైన ప్రకృతిపరమాత్మ శక్తులనే స్త్రీ పురుషరూపములందు
శిల్పచాతురీకళాధురీణులైన యానాటిశిల్పులెందరో, ఆనాటి సమా
జారంభదశలో నున్నవారి నిత్యజీవిత విధానమై ఖరుల నాలయా
లకు ముడిపెట్టి యాలయములో దేవత పవిత్రవంతమైనదని
వారికున్న మృగచర్మాలు వారలంకరించెడి రీతులలోనే ఆదేవ
తలకలంకరణచేసిరి. స్వయంకృషితో పంటలు పండించేవిధానము
తెలియని యారోజులలో మృగాలవలెనే తిరిగెడి బహుపురాతన
కాలపు మర్యాదలు మనకసహ్యముగాను చాలవిచిత్రముగాను
గోచరించును. ఆదిమానవునకు జ్ఞానమేదో తెలియని స్థితిలో
నీనాటి పసిబిడ్డలవలె, బట్టలులేని యారోజులలో ఆడ మగ
భేదములేక యిరుతెగలవారు దిగంబరులై, కులమత ప్రసక్తి
యేలేని యాకాలమున వావివరుసలులేక మృగములవలె సంతాన
మును బడయు చుండుటయును, ఆకలి కలిగినప్పుడే కనిపిం
చిన మృగములను జీవముతో నున్నప్పుడే మన మీనాడు పచ్చి
కాయలను తినునట్లు, బలాత్కారముగ వెంటాడి పట్టుకొని వారా
నాడామృగముల మాంసమును భక్షించెదరు. వారు భక్షించుట
కలవాటైన రోజులలో కులాసాగా హుంషారుగానున్న విడిసమ
యాలలో నాపచ్చిమాంసాదులనే వారినిలయములకు దరిదాపులలో

నొకదిగంబర స్త్రీవిగ్రహమునకో లేక పురుషవిగ్రహమునకో నివే
దన చేయుట యానాటి యనాగరికుల యాచారము, వావివరు
సలు లేని వారి యమాయకపు మూఢప్రవృత్తితో సంసారపు
యాత్ర సాగించి వారికి జన్మించినవారితోనే స్త్రీ పురుషులు సంతా
నమును కనుట కారంభించిరి. తెలియనితనముతో నీనడిపీథి
జాతరలను వారే సంకల్పించుకొని యందరుకలసి యేకాభిప్రా
యులై, త్రాగుట, తినుట, యెగురుట, పొర్లాడుట, తిట్టుటకొట్టుట,
బలత్కారసంగమక్రీడయు చివరకు మరణించుట ఆ మరణించిన
వారిని నైతము పీనుగులనెడి సందేహము స్ఫురించని వారెల్లరు
తినుటయు కొందరికాచారమైనది. ఆహారనిద్రామైథునములే! వారి
కానాటి ఆరంభాచారములకు ప్రధానమైనవి. కాలగమనములో
సమాజములో గలిగిన మార్పుల ప్రభావములతో మూఢాచార
ములన్నియు సమసి సమసి విజ్ఞానముగా నెంతోపరిణామము చెంది
కర్మసిద్ధాంతమును నమ్మవలసినదే! కర్మఫలములు ప్రతిజీవికి
సోపానములే! యనెడి నేటిహైందవ సంప్రదాయములోను, పర్వ
దివసములలోశుభసమయములలోను క్షామబాధకు గురియై, గంగ
మ్మ దివినుండి భువికి దిగలేదే యనెడి సమయాలలో, జనులు
రోగములకు గురియైన సమయములలో ముడుపులు గట్టి తదుపరి
పోలేరు అంకమ్మ మొదలైన దేవతలకు నోరెరుగని యాదిన
జీవులను మేళతాళాలతో స్నానాలు చేయించి ధూపాలు వేయించి
దీపాలు వెలిగించి, దేవతకోరింది గంగమ్మ ప్రత్యక్షమౌతాదిరా!
ఆలస్యముచేయక పని పూర్తిచేయండిరా! యనెడిగ్రామ పెద్దల

గావుకేకలతో సంఘమంతా ఒక్కసారి గొల్లుమన - వేపమండల యలంకరణతో గ్రామమంతా తిరిగితిరిగి దేవత ముందున్న నోరు లేని దిక్కులేని మేషమహిషాదులను, పాషాణ హృదయముతో గండ్రగొడ్డలి చేబూనిన యొకవ్యక్తి నెలవా! నెలవా! యని యడుగుటయు, గుమికూడిన దయలేని మానవసమాజము రాక్షస హృదయముతో నానందోత్సాహములతో, నెలవే! నెలవే! నెలవే! యని యఱచుటయు, దేవతముందున్న మహిషరాజములను, దేవత పేరిట ప్రేమతో పెంచిన కొమ్ములుతిరిగిన పొట్టేండ్ర నొక దానివెంట నొకటి వరుసగా నున్న యా సాధుజంతువులను నఱకివైచెదరు. తెగియెగిరిపడిన యా జంతువుల శిరస్సులను, దేవతముందుంచి గ్రామపెద్దలలో ఘనుడైనవ్యక్తి వాటిపై నీరు పోయుటయు, నిండుప్రాణాలు వాటి బొందినుండి తరలెడి యంతిమ సమయమున చచ్చిపడిన జంతువునోరు దెరచుటజూచి 'ఆహా! మనభక్తికి దేవతకులికిందనే' మూఢనమ్మకముతో జాతర చాలించి జనులెల్ల కొంపలు చేరుదురు. ఆజీవులు ప్రాణము వదలుచు మీ కిదేగతి యనుచు వెళ్ళెడివిషయము గమనించరైరి. ఇట్టి యాచారములను శక్తి పూజలని పూర్వాచారములని విషయము తెలియని నరులనుచుందురు.

'శక్తి' యనగా నేమి? శక్తియనగా = రూపములేనిదని తేలుచున్నది. ఆదిశక్తియని, నా ఆదిశక్తియే ముమ్మూర్తులను కన్నమాతృమూర్తియని మన హైందవ సిద్ధాంతము సిద్ధాం

తీకరణ మొనర్చినది. మేధాశక్తి, వాక్శక్తి, కవితాశక్తి, మంత్రశక్తి, యంత్రశక్తి, తంత్రశక్తి, దేవునిశక్తి, మానవ శక్తి, దానవశక్తి, దుష్టశక్తి, మహాశక్తి, భక్తిశక్తి, యుక్తి శక్తి, పరమేశ్వరశక్తి, కాళికాశక్తి, ఇట్లనేక నామరూపాదులతో శక్తిని పేర్కొనుచున్నాము.

ప్రతి విషయము నేదోయొక శక్తి లేనిదే జరుగుటలేదని పాఠకులు గుర్తించవలెను, వ్యక్తి చేసెడి కర్మము ననుసరించి నా కర్మముయొక్క పూర్ణ స్వరూపమును నా యా కర్మలపేరుతో శక్తిని జోడించి వాకొనుటాచారమై సత్యమునై యున్నది.

శక్తి - పూజ చేయుచున్నాము. శక్తి – కొలుపు చేయు చున్నామని సమాజమనుచున్నది. సమాజమున కలవాటైన యభి రుచులకు భిన్నముగా సమాజము చరించుటలేదు. సమాజమున కాదినుండి యలవాటైన యభిరుచులనే "దేవత" పేరుతో నివేదన చేసి భక్షించుచున్నారు. ఆరోగ్యరహితమైన మాంసాహారమును మానుట కంగీకరించరు.

దీనివలన సమాజమునకు లాభమా? యని ప్రశ్నవేసి కొనిన నష్టమేయని తేలగలదు. నష్టము. కష్టము. దేవుని దయకు పాత్రులము. సర్వజీవులు దేవుని సృష్టిలోనివే! నోరులేని దీన జీవులను బలవంతముగా ఈడ్చి తెచ్చి వాటిపై నెనరులేక కసి బూని నిండు ప్రాణములను కత్తితో నరకి బొందెనుండి బలాత్కా రముగా తరలింప చేయు కఠిన కర్కశ కసాయి దృశ్యమును

కరుణగలిగిన మానవులు చూడగలరా? యని కరుణగలిగిన వ్యక్తి వాకొనిన, జాతరలో పాల్గొనిన వ్యక్తు లెల్లరు నొక్కుమ్మడిగా 'నీవొక్కడివే పుణ్యాత్ముడవు. మేమెల్లరము పాపాత్ములమా!' యని గట్టిగా నరచెదరు.

ఆదియం దాహారములేక నాకలితో తపించెడి సమాజము తెలియని స్థితితో, కనబడిన పశుపక్షి మృగాదులనే బలవంతముగా పదిమంది పట్టుకొని నోటితో లాగి వాటి మాంసమును తిన్న యనాగరిక సంస్కారమే నేటి సమాజమున జాతరల పట్ల పచ్చి మాంసమును నోటితో కరచి తిరుగుటయొక మూఢాచారమై యున్నది.

కాల ప్రభావమునకు కాల కర్మములకు బానిసలైన మానవులు కొందరీనాటికి, కల్లు సారాయి మొదలైన మత్తుపదార్థములను వాడుట, రకరకములైన మాంసాదులను తినుట, జార చోర అసత్యాది గుణములతో భయభక్తులనువీడి మదోద్రేకమానసులై పెద్దల మాటలను లెక్కచేయక విచ్చలవిడిగా సంచరించుటయు నేటికాలమున చూచుచున్నాము,

సర్వజీవులను సృష్టించి పోషించెడి కరుణామయుడైన దేవుడు తన సంతానమునే, నాలుకపై రుచికొరకు సృష్టించుకొన్న మూఢాచారముల నెపముతో శక్తి యనుదానిని సృష్టించుకొని శక్తి కోరినదని నిండు ప్రాణములను నరకి తినుట కలవాటైన దుష్టప్రవృత్తిగల వారిని జూచి, ఓర్పుతో నుపేక్షించునో!

దుష్టకర్మల ఫలితమనుభవింప చేయునో? ఆదేవునకే వదలివేయు దము,

ఈ మూఢాచారములను మాన్పించవలెనని మహాత్ములెందరో యదార్థసత్యములను శ్రుతి సమ్మతముగా చెప్పిరి. హృదయముగల సోదరులెవరైన నీచాచారములను మాన్పించినచో లోకమునకు గొప్ప మేలును సంఘమునకు సమతదృష్టియు నలవడునుకదా! ఒక చిన్న పావురమును రక్షించుటకై తన దేహమునే యర్పింపబూనిన శిబిచక్రవర్తియు, దయప్రేమ కరుణ విశ్వాసములే ప్రబలధర్మముగా నాచరించిన శ్రీరామ, ధర్మరాజాదులు, దీనజనోద్ధరణకై విశ్వప్రేమను ప్రేమహృదయులై యెలుగెత్తి చాటిరి. వారాచరించిరి. శ్రీవ్యాసాశ్రమమును స్థాపించిరి. మూలరహస్యము లెన్నింటినో గీర్వాణ భాషయందున్నను నఖండకృషితో దివ్యతపశ్శక్తితో తెనుగున కనువాదము చేసి ఆబాల గోపాలమున కర్థమగు శైలిలో నారహస్యములను సంఘమున కందచేసిన 'మహర్షి' శ్రీశ్రీశ్రీమళయాళస్వామి వారును, కరుణాస్వరూపులని యఖిలజనోద్ధారకులని సర్వజనులచే స్తుతింపబడుచున్న శ్రీగౌతమ బుద్ధమహోదయమూర్తియు, శ్రీయేసుక్రిస్తు ప్రభువును, శ్రీమహమ్మదు ప్రవక్తయు శ్రీమహాత్మగాంధీగారు శ్రీఆచార్య వినోబాభావే - మొదలైన కరుణా హృదయులెందరో ఈపవిత్రభారతావనియం దవతరించిరి. సర్వజనశ్రేయోదాయకమైన యహింసా సిద్ధాంతమును తామాచరించి సోదరమానవులకు

నయోక్తిగా బోధించిరి. అహింసాసిద్ధాంతముపై ప్రత్యేక గ్రంథ ములెన్నో రచించిరి.

మొండి వాగ్వాదములు మాని ప్రశాంతముగా ప్రేమతో యోచించండి! అస్థిరమైన దేహమే స్థిరమని నమ్మి సర్వవిధ ఘాతుక కృత్యములతో, సాధువులై సంఘమునకెట్టి యపకారము చేయక, జాము జామునకు లోకమునకు జాగృతి కల్గించుటకా! యన్నట్లు 'కొక్కోరకో' యని కూతలు వేసెడి కోడి పుంజులను. మేకలను గొఱ్ఱెలను, నందముగా మన యిండ్లలో విహారము చేసెడి పావురాళ్ళను నెమలి మొదలైన వాటినెన్నింటినో నాలుకపై రుచికొరకు జీవజంతువులను సంహరించి వాని మాంసముతో పొట్ట నింపుకొని తుదకు, సర్వప్రాణుల తండ్రియైన సర్వేశ్వరుని యెదుట నేమని నిలువగలరు? అయ్యో! ఎంతటి ఘోరము! మనము తినుటకు జీవించవలెనా? జీవించుటకు తినవలెనా? జీవించుటకై తగిన సత్త్వ పదార్థములెన్నో భగవంతుడు మనకు ప్రసాదించియుండ, కేవలం తమోగుణ ప్రవర్ధమానమగు నీ రక్తపు పాపపుకూడు నేల భక్షింపవలెనో బాగుగా యోచించి విషయ నిర్ణయమునకు రండు.

ప్రేమయే దైవము; దయయే భగవంతుడు, దయగల హృదయమే భగవన్నిలయమను నార్యవచనములు గమనింపక, దుష్టాహారమునకు అలవాటైన కారణముతో కామెర్ల రోగులవలె, నితరులు చెప్పెడి అహింసాసిద్ధాంతములను, మాంసాహారము

నందున్న చెడ్డను గమనింపక, యెన్నో యుక్తివాద కల్పనము లతో, "పండ్లు కూరలు తినుటలేదా? చెట్లకున్న పూలను కోయుట లేదా? వాటికి ప్రాణములేదా? తిననివారు తినుటచేతనే మాంసము కరువైన"దని పలుకు చుందురు. పై పెచ్చు ఓహో? మనము తినుటతప్పా? దేవతలకే ప్రీతియట. మహర్షులు పూర్వము మాంసము తినినారుకదా! నిజము చెప్పవలెననిన, బ్రాహ్మణు లాదిగా నన్ని వర్గములవారు మాంసమునే ప్రధాన వస్తువుగా స్వీకరించి నారయ్యా! యని నిర్భయముగా రచ్చలలో పలుకు చుందురు. పూర్వము తిన్నమాట వాస్తవమో? కాదో? అటు వదలి వేయుదము. ఆనాటి కాలపు మర్యాదలు వారికున్న వసతి సౌకర్య ములు వారి మనుగడ విధానములు, నేడుమనమున్న కాలమునకు ముడిబెట్టిచూచినచో చాల యసహ్యముగా మనకే కాసుపించును, గతకాలమున బట్టలు లేక దిగంబరులై ఆడమగ భేదములేక కలసి తిరిగినది చరిత్రచెప్పిన సత్యమేయని, నేడు మనమటుచేసిన సంఘము సహించునా?

దేవతలందరు మాంసమునే తినిరని, యజ్ఞాదులలో మాంస మునే వాడిరని పలుకుట యెంతయో శోచనీయము ఇంతకన్న విపరీతముకలదా? ఇంద్ర జిత్తుచేసిన నికుంభిలహోమమునకును, రుక్మాంగదుడొనర్చిన ఏకాదశీవ్రత ద్వాదశి పారణకు నెంత భేద మున్నదో గమనింపుడు. ఇద్దరును వారివారి యిష్టదేవతల నుద్దే శించియే భక్తి కర్మయొనర్చిరి. కాని యందులోగల హింసా

హింసల భేదము చేతనే రాక్షసవంశమే యంతరించినది రుక్మాంగదుడు మహోన్నత పదవినందుటయు సంభవించినది. జాతరలు చేయుట మానుట తగునా? యను సందేహ మున్నవారు నైతము జాతరలు చేయండి. పరవాలేదు. వాటి దుష్ట స్వరూపమును, విజ్ఞానదశయందున్న మానవులు పూర్తిగా మార్చి అహింసాతత్త్వముతో కొబ్బరికాయలు వడపప్పు, పానకము, నిమ్మకాయలు, మొదలైన సద్వస్తువులతో పవిత్ర నామోచ్చారణలతో సత్త్వ పూజగా పూర్తి చేయండి. సాత్త్విక రూపమున పూర్తిచేసి సాత్త్వికభావములు హృదయములలో పెంపొందింప చేసికొనుచు క్రమమైన జీవితములు గడపిననాడు సంఘమంతా నొకేరూపముతో హెచ్చుతగ్గుల తారతమ్య స్థితులు నశించి అర్యులంతా నొక్కటే! యను మనుగడకు మారి సర్వమానవసౌభ్రాతృత్వము మాటల రూపములో వేదికలపైన మాత్రమేకాక, యిచ్చిపుచ్చుకొనుటలో నైతము జాతియంతయు నొక్కటే! యను హైందవ సిద్ధాంతము మూడుపూలా రుకాయలతో కళకళలాడుచు దేవ యుగమై విరాజిల్లును.

నిజమును నిజముగా రూపొందించు రచనలు రచయితలు చాల యరుదు. కారణమేమన? వారిని సంఘమెక్కువగా గుర్తించ లేదు. గుర్తించియు గౌరవించలేదు. పరమ నాస్తికుడైన లోభి వానింటికేగిన భట్టుమూర్తి, 'సిరిపంద్రుడవు చంద్రుడవు దానమున రాధేయుడవు, సాహసమున విక్రమార్కుడవు త్యాగమునశిబి

చక్రవర్తివి సత్యమున హరిశ్చంద్రుడవు నీగ్రామమునకే కామ ధేనువు వంటి మహనీయమూర్తివ'ని పొగడిననాడే ఆలోభి హృదయమునందు పరిణామముకలిగి కొద్దియో! గొప్పయో! సత్కరించి గౌరవము చేయును. ఈ భట్టుమూర్తి తనపొట్టతిప్పలు నివారించుకై యన్ని యసత్యములే యాడెనుకదా! నిజమునే పలి కెడి వేరొక భట్టుకవి ఆ లోభివానింటికి చేరి "ఓరీ! నీవు నాస్తికు డవు లోభివి పాపము నార్జించితివి. నీవు పాపాత్ముడవు, నీ గ్రామమునే దోచితివని" నిజమే మాటలాడిననాడు, ఆ లోభి "యగ్గిపై పడినగుగ్గిలమువలె" భగ్గున మండిపడుచు 'నోరీ! నీచుడా! నాతో నీకేమిరా! నన్ననుటకు నీకేమి యధికారమురా!' యని గెంటివేయునుకదా! లోభిని త్యాగిగా వర్ణించి యసత్య ములే యాడిన భట్టుమూర్తి, లోభి గౌరవ సత్కారములకు పాత్రు డయ్యెను. లోభిని లోభిగా వర్ణించి సత్యమునేపలికిన భట్టు మూర్తి, లోభి తిరస్కృతికి పాత్రుడయ్యెను. ఇందేది సత్యమో సాధక సోదరులే గుర్తించగలరు.

నేటి కవితావరణమున "నేరోటివద్ద నాపాట!" యను సామెతగా రచనను సాగించిననాడే ఆ రచనకు విలువ ఆ కవికి గౌరవమని తెలిసియు, స్వార్థమునకు బహుదూరముగా నుండి నిజముతెలియని సంఘ సమాదరణలకు పొల్పడక తుచ్ఛమైన కల్లబొల్లి సన్మానముల నాసించక దేవుని కరుణకుమాత్రమే పాత్రుడను కావలెను. దేవుని దయయే నన్ను రక్షించుననెడి

ప్రగాఢ విశ్వాసము కలిగిన కవి మాత్రమే! సవిమర్శనా రచనా వ్యాసంగమునకు పూనుకొనుడు. గత కాలమునెందరో కవిసింహ ములు కవిదోర్దండులు కవితాచక్రవర్తులు కడకు కాల గర్భమున కలసిరి. కవితా చక్రవర్తులు కాల వాహినిలో కరగిపోయినను నానాటి కవుల రచనలలోనున్న కుళ్ళును కుట్రను జాతిమత స్వార్థ పిశాచావేశ మహిమా ప్రదర్శన ప్రతిభాదులను మాత్రము, నేటి కిని సంఘము వదలక వ్రేలుబెట్టి చూపి వారి కుళ్ళును కుట్రను కులమత జాతివైషమ్య స్వరూప స్వభావాదులను కడిగివేయుచు వారి ఆత్మల కశాంతిని చేకూర్చుచునే యున్నారు.

పరిస్థితుల ప్రభావమున కలవాటైన మాంసభక్షణమును దేవత కోరినదని వర్షములు లేక ప్రజలు క్షామబాధకు గురియైన రోజులలో దీన జంతువుల బలులారంభముచేసి జాతర పూర్తి యగునంతవరకు తప్పత్రాగుటయు సంఘమునకు పరిపాటియైనది. మరియు జబ్బుగలిగిన మనుష్యుడు బ్రతుకుటకై బ్రతికియున్న మేకపోతులను బలియిచ్చెదమని ముడుపుకట్టెదరు, ముడుపు చెల్లకముందే వాని పాడెగట్టుట చూచుచున్నాముగదా! ఈ జాతరలు జరుగు సందర్భమునను దేవునిపేరిట మ్రొక్కుబడుల బండ్లు ప్రభలు గట్టుటయు, నన్ని కార్యములు పూర్తిచేసి దేవతకు నా బండిముందు ని బండి వెనుక నెడు సమస్యా పరిష్కారము. తేలక పశుభావాలతో బడితపూజలకు తారసిల్లి క్రుమ్ములా టకు సిద్ధమై జాతంలో బీద జంతువుల రక్తమును చిందించిన విధముగా నిరుపక్షములవారిలో తలలు పగిలి రక్తము స్రవించు

టయు నేటి మూర్ఖపు సంఘమునందు తిలకించుచున్నాము. ఇది న్యాయమైన పద్ధతియా? ధర్మమైన మార్గమేనా? తోటి మానవులు కలహించుట కుపక్రమించుట కనులార చూచుచు కలహశాంతి వాక్యములు పలుకక, నవ్వుచునే, "వీరిని కనిదీర్చుకొనుట మనకు చేతకాదుబాబో! యీయదనులోనే మన ప్రజ్ఞనుపయోగింప" వలయు నను కుట్రబుద్ధితో క్రూరాలోచనలతో కలహవిజృంభణ వాక్యము లను విసరుచున్నంత, మధ్యవర్తులైన స్వార్థపరుల కుట్రదెలి యక కుమ్ములాటకు దిగి క్రూరకర్మల పాలై నశించెదరు. ఈ కారణముగా గ్రామము రెండు చీలికలై కోర్టులపాలై కఠినశిక్ష లకు గుఱియై గందరగోళమై జాతరవలె తయారై సర్వదుఃఖ ముల పాలగుదురు. దేవత కోరినదని బీదపేద ప్రాణుల బలిదీసిన మహాపాపపరిణామ మూరక పోవునా?

ఇదంతయు విశ్వనాథుడైన భగవానుడు గమనించి, 'ఓ జ్ఞానహీనుడైన మానవుడా! నీవు మానవ రూపములో నున్నదానవు డవే! నోరులేని జీవులనే బలిచేయుటచాలక నీతోటి సోదర మానవులైన యమాయుకులను నీకున్న నీచమైన స్వార్థ ప్రవృ త్తితో నీ కుటుంబ పోషణకై యే దిక్కులేక యిదొక నెపముతో మధ్యవర్తి పరిష్కార రూపముతో వారిమధ్యచేరి నెయ్యమును కయ్యముగా రూపొందించి మాయమాటలతో నిరుపక్షములవారిని రెచ్చగొట్టి రక్తపాతమునకు గురిచేసితివే! నీ మతిననుసరించియే నీ స్థితిగతులు మారుచుండునునా! మూర్ఖుడా! కలహములు పెంచి వారి యర్థమును లాగి సోమరివై నీ పొట్టను బెంచుకున్నంత

మాత్రమునా, నీవు స్వయముగ తెలిసిచేసిన సంఘద్రోహ పాపపు పరిణామము నిన్నువదలిపెట్టునా? నిన్ను అన్ని విధముల భ్రష్టుని చేసి కూడు గుడ్డలకు దూరముచేసి బ్రతికియున్నప్పుడే యమబాధలకు గురిచేయునురా!' యని సదా సర్వేశ్వరుడాదేశించుచుండును.

ఈ జీవ హింసా సమస్యను గుర్తించిన మన వేమన యోగీంద్రులవారి ఆత్మాభిప్రాయ మెటులున్నదో చూడుడు.

క॥ నోరెఱిగి తాము యేమియు
నేరని జంతువుల జంపి, నెమ్మది దిను నా
క్రూరపు సంకర జాతుల
మారణ మేమందు నింక మహిలో వేమా!

ఆ॥ వె॥ తనవలె నవియును, ధరనుబుట్టినవి కావా
పరగ తమ్మువంటి, బ్రతుకుగాదొ
జ్ఞాని వాని జంప, కారణమేమిరా!
విశ్వదాభిరామ, వినురవేమ॥

ఆ॥ వె॥ జీవి జీవిజంపి జీవికి వేయగా
జీవివలన నేమి జిక్కియుండు
జీవహింసకులకు, జిక్కునా మోక్షంబు
విశ్వదాభిరామ, వినురవేమ॥

— పరమతబోధనులైన మునిశ్రేష్ఠు లెట్లు చెప్పియున్నారో చూచితిరా!

శ్లో॥ సర్వయజ్ఞేషు యద్దానం సర్వతీర్థేషు యత్ఫలం
సర్వదాన ఫలంవాపి తన్నతుల్య మహింసయా-

తా॥ అశ్వమేధాది యాగములయందు ఏదాన ఫలము గలదో, సప్తసాగరతీర్థస్నాన ఫలమేదికలదో, గోదానాది షోడశ మహాదానములచే నే ఫలముకలుగునో అదియంతయు నహింసతో సమానము కానేరదు.

క॥ శతవర్ష దుష్కరతపః
కృతి, నంజుడు దినమినగు సుకృత మివిరెండున్
మది దలప నొక్కరూపని
స్మృతి వేత్తలు జెప్పుదురు కురుక్షితినాథా!

ఇట్లనేకులు అహింసా వ్రత శక్తిని చాటియున్నారు ఎవ రెన్ని చెప్పిన దురలవాట్లకు గుఱియైన పాపిష్టిహృదయములకు మార్పురాదు. పరిణామమైన కలుగదు. వారిలో ననేకజన్మల నుండి వెంబడివచ్చిన పాపపుజిడ్డు సామాన్యముగా వీడునా! మహమ్మదీయుల మతములోనవతరించిన శ్రీ భక్త కబీరుదాసు గారు శ్రీరామనామ జపముతో నహింసావ్రతముతో సర్వమత సామరస్య ఫలమును తన దివ్యసూక్తులద్వారా లోకమునకందించిరి. శ్రీరామ సాయుజ్యమునే పొందిరి.

సాత్త్వికమైన శుద్ధాహారముచే మనశ్శుద్ధియు, మనశ్శుద్ధిచే దృఢమైన ప్రజ్ఞయు, దృఢప్రజ్ఞచే సర్వసంశయరహితమైన విజ్ఞానావిర్భావము, విజ్ఞానావిర్భావముచే భవబంధ విముక్తియు

గల్గును. మానవజన్మమెత్తినందులకు ధర్మాచరణము ధర్మజీవనము ముఖ్యప్రయోజనము. ధర్మాచరణ శూన్యమైన కర్మాచరణము నేరుగా నరకమునకు గొనిపోవును. కావున దృఢవైరాగ్యముతో, ప్రధానమైన జిహ్వాచాపల్యమునణచి దాని వెనువెంటనే గుహ్యేంద్రియ చాపల్యమునుకూడ నణచినచో నీవే సదానంద యోగివై, జనన మరణ రహితమైన నిత్య సచ్చిదానంద నిలయమై వెలయు నిర్గుణ బ్రహ్మ సాక్షాత్కార పదవి నొందెదవుగాత!

ఇదియే! దేవత్వాధ్యేయము - సర్వజీవరక్షణము.

# వ్యక్తి ఆశయ సిద్ధికి ప్రధానమైనది - సంస్కారమా? ప్రయత్నమా?

సత్యాసత్యములను గ్రహించకనే విషయనిర్ణయము చేయుట లోకసహజము. కారణమేమన? లోకమనిత్యము. లోకపుపోకడలు అంతకన్న ననిత్యములు. లోకముపోకడలకు సంబంధించిన సమాజము నిత్యసత్యమును గుర్తించలేదు. అంధకారగృహములో నున్నవ్యక్తి కన్నులుండియు గృహములోని వస్తుదర్శనమును పొందలేని విధమున లోకపుతీరతివిచిత్రము. ఖగోళవిజ్ఞానరీత్యా మనము నివసించెడి యీధరామండల మంతయు కుమ్మరి చక్రమువలె సూర్యచంద్ర గోళముల సంబధ బాంధవ్యములచే తిరుగుచుండునని పరిశోధనలద్వారా విజ్ఞానశాస్త్రజ్ఞులు నిర్ధారణము చేసిరి.

బాహ్యదృష్టితో దర్శించెడి సామాన్యులకు మాత్రము, భ్రమణము చెందెడిది యీభూగోళముకాదు సూర్య చంద్రగోళములేనని వాదించెడివా రీనాటికిని లేకపో లేదు. ప్రాకృతమైన యీ ఖగోళవిషయాదులే మనజ్ఞానమునకగమ్యములైనవి. ఇట్టిస్థితిలో నున్న మనకు అప్రాకృత విషయములైన కర్మసూత్రబద్ధమైన జీవుల స్థితిగతుల యొక్క మూల రహస్యములను వెల్లడించుట సాధ్యముకాదు.

కవి తన యిష్టదైవమైన నరహరినిగాని గోపాలునిగాని ముక్కంటినిగాని దుర్గనుగాని కాళినిగాని పరాశక్తినిగాని యేదే నొకానొక రూపముపై మనస్సును లగ్నముచేసి ధ్యానసమాధిని పొందినతఱి యొకానొక యఖండశక్తి వారివారి మనోబలపరిపక్వ సిద్ధిననుసరించి కవి నావరించును. ఆ కవితావేశ ప్రభావముతో తానున్న కాలగమనపు విపరీతములను తన జీవితానుభవ సందేశ సమ్మేళనముతో గద్యకావ్యముగానో పద్యకావ్యముగానో కవితను సృజించి భగవదంకితమొనర్చి లోకోపకారము జరుగునని తనలోతా నానందమునుపొందును. రవియెరుంగనిది కవియెరుంగు ననెడి పూర్వకవిరాజులనుడి జగద్విదితము. కోటీశ్వరు డైనను, జీవిత సంఘటనలలో కాల వక్రదృష్టికి పేరుమార్చు కొనునేమో! గాని, కవీశ్వరుడు మాత్రము భువినుండి దివికేగు వరకు కవీశ్వరునిగానే చేరి తనతోటి సంఘమునకు తన కవిత్వ మును స్వార్థరహితముగా సమర్పించి, కవితలోని సత్యము తానాచ రించి తా నీశ్వరుడగును.

కవిగా రూపొందవలెనని గాయకుడుగా నఖండకీర్తి నార్జించవలెనని పండితుడనని పేరుపొందాలని విద్వాంసుడనై విఱ్ఱవీగాలని లక్షణగ్రంథములను ఏకరువు బెట్టి విఫలులైరి. ప్రయత్నించినను ఫలసిద్ధికి దూరమైరి. ప్రయత్నములెన్ని చేసి నను జన్మాంతర సంస్కార ప్రభావములేనిచో కార్యసిద్ధి చేకూ రదు. ఒకనాటి గట్టి ప్రయత్నమే వేఱొకనాడు సంస్కారముగా దీపించును. సౌబరిముని సామాన్యుడా? ఋష్యశృంగ మహర్షి

సామాన్యుడా? విశ్వామిత్ర మహర్షి సామాన్యుడా? వీరు మహా మహిమాన్వితులుకదా! ఇట్లెందరో విఫల మనోరథులైరి.

సౌబరిముని స్నానమునకై నదికేగిన సమయములో మీన మిధునములను దర్శించి తపోవిముఖత్వమును పొందెను. అఖండ తపశ్శక్తుల నార్జించిన ఋష్యశృంగమహర్షి రంభోర్వశీ మేనకా తిలోత్తమాది దేవకాంతల వయోరూపలావణ్య నృత్యభంగిమ ములనెల్ల నెగాదిగ పరిశీలనచేసి తమిదీర దర్శించి సంభాషణా సమాయత్త చిత్తుడై వారిని స్పృశించి గాఢాలింగన మొనరించి చుంబనాదులతో దుస్థితికి దిగజారి మోహపరవశుడయ్యెకదా! విశ్వామిత్ర మహర్షి సృష్టికి ప్రతిసృష్టి చేసెడి తపస్సిద్ధులను కరతలామలకము చేసికొనియు తామసిక శక్తికి లొంగి యెందరినో శాపదగ్ధులనుచేసి బ్రహ్మర్షిపద భ్రష్టుడై, 'ఓహో! నా దివ్యతపశ్శక్తి భంగమాయెనే? ఓపాపిష్టమనస్సా! నీగతి గంటి నని మరల తపోదీక్షనుపొంది దీక్షాసిద్ధత్వముతో బ్రహ్మర్షీ! బ్రహ్మర్షీ! బ్రహ్మర్షీ! యని గీర్వాణ బృందముచే కొనియాడ బడిన గీతాగానములు వింటిమికదా!

ఇంతవరకు పఠించిన సోదరులకు సంస్కారము గొప్పదో! ప్రయత్నము గొప్పదో! బోధపడినదికదా? సంస్కార ప్రభావ ముతో నవతరించిన వ్యక్తు లల్ప ప్రయత్నముతో నఖండశక్తిని పొందుదురు. సంస్కారములేక ప్రయత్నముపై నాధారపడినచో 'కొండను త్రవ్వి యెలుకనుబట్టినట్టు'గా నుండును. బహుజన్మ

పుణ్యఫల సంస్కారముతో నవతరించిన వ్యక్తుల బ్రహ్మవిద్యగాని గాంధర్వవిద్యగాని తపోవిద్యగాని, తదితరవిద్యలేవియైన, నావిద్య విధానము వాటికి కలిగెడి మన్ననలు వర్ణనాతీతములు.

మచ్చున కొకరిద్దరిని పాఠకసోదరమిత్రులకు గుర్తుచేసెద! నీ గ్రంథరచయితకు కారణాచార్యులైన, శ్రీతోకపల్లి యోగానంద నరసింహాయోగీంద్రులువారు, నాగరికతలేని ప్రాంతమున నల్లమల మహారణ్య పరిసరములందున్న 'తోకపల్లి' యను కుగ్రామమున నవతరించి రైతుబాబులవలె గోపాలకుడై చదువులు లేకయే బహుజన్మ పుణ్యసముదాయపు ప్రభావముతో నొకయోగ సిద్ధుని దివ్యశరీరస్పర్శతో తాపసియై త్యాగియై యోగియై తత్త్వవేత్తయై కరుణానిధియై సర్వమానవ శ్రేయోదాయకమైన బ్రహ్మ విద్యాప్రచారము చేసినట్టి సిద్ధతపోయోగమూర్తులైన సద్గురు శ్రీయోగానంద నరసింహస్వామివారే మనకు ప్రత్యక్ష ప్రమాణము. ఇట్టి యోగీంద్రుల యవ్యాజ కరుణాకటాక్ష వీక్షణ ప్రసాదమునకు నీగ్రంథ రచయిత సుబ్బరాయగుప్త బాల్యములో పదు నాల్గువత్సరముల ప్రాయముననే పాత్రుడై శ్రీయోగానంద నరసింహస్వామి హస్తమస్తక సంయోగ ప్రభావప్రసారమహిమ చేతనే, విజ్ఞులైన ప్రాజ్ఞులైన పెద్దలైన సోదరమానవ సంఘము నకు నుద్దీపనములైన ఈసూక్తిసుధ నందచేయగల్గినవా డాయెను.

అతిబాల్యమందే యఖండకీర్తినార్జించి యనేక నగరములలో వారి మహనీయ మధుర గానామృత రసవాహినులలో సభ్యు

లను మంత్రముగ్ధులనుచేసి వారి జేజేలనందు కొనుటయేగాక ఆహ్వానితుల బహువిధమన్ననలనుపొంది విశ్వవిఖ్యాతమైన నఖండకీర్తిని వడసినట్టి శ్రీమంగళంపల్లి బాలమురళీకృష్ణగారి విషయము జగద్విదితముకదా!

రాజమహేంద్రవర సమీపగ్రామము 'ముమ్మిడివరము' నందవతరించి దివ్యమహాయోగ తపోమౌనవ్రత దీక్షానిష్ఠయందున్న బాలయోగి భవ్యనవ్య జీవితస్థితికి కారణము గతజన్మలలోని సుసంస్కార ప్రభావప్రసారమని నేటి నవీనలోకమునకు ఋజువు చేయుచున్నది. ఈనాటికి శివరాత్రి జాగరణమహాపర్వదినమునందు వేలాదిప్రజలకు తన పరిశుద్ధాత్మ శక్తిదర్శనము నంద జేయుచున్నాడు. ఈ బాలయోగిగారీదివ్యస్థితిని పొంది లోకముచే వేనోళ్ళ కొనియాడ బడుటకు వారిగతజన్మ సంస్కారమనందగును,

సర్వతీర్థయాత్రలు సేవించినను కాశీప్రయాగాయోధ్యాది పుణ్యక్షేత్రములందు జీవిత శేషములను వెళ్ళబుచ్చినను మహాతీర్థములను కావళ్ళలోగట్టి విశేషభక్తిశ్రద్ధలతో తీసికొనిపోయి కాశీరామేశ్వరములయందున్న మహాలింగముల కభిషేకములు చేసి యచ్చటనున్న వివిధస్థలములను దర్శించి వాటిపూర్వాపరములను తెలిసికొనినను సర్వబంధరహితమైన మోక్షమును, అనగా జీవన్ముక్తిని బొందనేరడు. కాని! పుణ్యకర్మల ప్రభావము వృథా కానేరదు.

పైన జెప్పిన పుణ్యకర్మల ప్రభావముచే నప్రయత్నము గానే బ్రహ్మనిష్టయందారి తేరిన తత్త్వవేత్తయగు సద్గురుని దివ్య పదసాన్నిధ్యము లభించగలదు, కోటిజన్మలకైనను. సద్గురువుల యఖండకృపాప్రసారము వలననే దైవసన్నిధిని పొంది తరించ గలదు.

ఏతలంపులులేక తనకుతానై నిలచియుండుటయే బ్రహ్మ నిష్ఠయనియు సమాధినిష్ఠయనియు యోగసిద్ధియనియు జీవ న్ముక్తియనియు జన్మరాహిత్యమనియు నచలపరిపూర్ణ మనియు యద్వైతమనియు చెప్పబడును, దీక్షతో చేసిన ప్రబలప్రయ త్నమే ! మరుజన్మమున సంస్కారరూపమున దీపింపబడును.

౮

# మనమనసే!

## బంధమోక్షములకు కారణమా?

సృతిస్మృతి పురాణాదులన్నియు నొకేయొక పరమసత్యము నపారకరుణతో లోకక్షేమంకరధ్యేయముతో జీవకోటిసద్గతికై ప్రసాదించినవి, పరమపవిత్రమైన వాటి మహోన్నత దివ్యాదేశ సందేశములను మహాత్ములు నవతారమూర్తులు, ప్రవక్తలెందరో స్వార్థరహితమైన కాంక్షతో లోకమునకెలుగెత్తిచాటిరి. జ్ఞానవిహీనులైన మూర్ఖమానవులు కొందరు వారి విజ్ఞాన బోధలను వినక వినువారి నల్లరిచేయుచు తాత్కాలిక లోకాభిరామాయణమును ముచ్చటించుచు విసుగువిరామములేక కాలమును దుర్వినియోగము చేయుచున్నారు, ఇట్లు చేయుటకు కారణము ప్రాకృత విషయలంపటమున చిక్కి విడివడు శక్తిలేకపోవుటయే!

"సర్వే బ్రహ్మ వదిష్యంతి సంప్రాప్తేతు కలౌయుగే!
నానుతిష్ఠంతి మైత్రేయ శిశ్నోదరపరాయణాః"

కలియుగము ప్రారంభించినది మొదలు, పురుషులందరును పరబ్రహ్మస్వరూపములో పోయి చేరవలయునని అందురేకాని దానికి కావలసిన జ్ఞానానుభవానుష్ఠానములు లేక, స్త్రీ సంభోగము ఉదర పోషణములకై వ్యవసాయ వ్యాపారోద్యోగములలో నొకదానినో లేక మూడింటినో ఆశాపాశబద్ధులై ఆహారమును వాటినిగురిం

చియే నుచ్చాటించుచు వినుచు కనుచు భగవద్విభూతి కైంకర్యము లకు బహుదూరముగానుండి తిరస్కృతి భావముతో కువిమర్శలకు లోనై హేళనలు చేయుచుందురు. దీనికంతటికి కారణము వారి మనస్సే!

"చిత్తంసంజాయతే జన్మ జరామరణకారణం"

[ముక్తికోపనిషత్తు]

ఒక్కొక్కజీవియు జన్మమెత్తుటకు, వృద్ధుడగుటకు, మరణించు టకు వాని మనస్సే బీజముగా నున్నది, స్వరూప సుఖదుఃఖము లకు మనసే ప్రధానమై రాణించుచున్నది.

"యస్య సంకల్పనాశస్స్యాత్, తస్యముక్తిఃకరేస్థితా"

[మండల బ్రాహ్మణోపనిషత్తు]

జన్మములకు బీజముగానుండునట్టి తలంపులనే మనస్సని చెప్ప బడును. ఇట్టిమనస్సును ఎవ్వడు నాశనముచేయునో అట్టిమహా పురుషునికి మోక్షమనునది యరచేతిలోనున్నది. మనస్సు పుట్టెడి చోటు నాభికమలము. ఈ మనస్సు నాభివద్ద యుత్పన్న మైనదనే నిదర్శనమును నిర్ధారణము చేయుటకే మన భారతీయ సంస్కృతికి పునాదులు వేసిన మహర్షులు శ్రీమన్నారాయణ మూర్తి నాభికమలమందే చతుర్ముఖుడైన బ్రహ్మదేవుడుద్భ వించినట్లుగా నాదేశించిరి. ఆ యాదేశానుబద్ధముగ మహాశిల్పు లెల్లరు సర్వమానవుల కర్థమయ్యెడి విధానములో దేవాలయముల పై గాలిగోపురములపై విశేషప్రజ్ఞా ప్రాభవములు తొణికిసలాడు

నట్లుగా భారతదేశమంద్లెల్లడల ముఖ్యముగా దక్షిణాపథమునందు శిల్ప నిర్మాణముగావించిరి.

భారతదేశములో దక్షిణదేశ యాత్రలు వాటి పూర్ణవిశేషములు ఆలయ ప్రాకార మంటప గోపురాదుల రహస్యములు, ఈశ్వర సంకల్పములు వాటి మూల రహస్యములు తీర్థయాత్రలు సేవించిన ఫలములను శ్రీ వేంకటేశ్వరస్వామి వారి యాలయ నియమములలోని రహస్యములను పూర్తి వివరములతో నసేకాధ్యాత్మిక దివ్యరహస్యములను హృదయ రంజకముగా ముద్దులొలుకు శైలితో నీ గ్రంథ రచయిత జీవిత వివిధ సంఘటనలతో చేర్చి కూర్చిన సద్గురు శ్రీ "శ్రీ యోగానంద నరసింహమహర్షి జీవిత చరిత్ర" యను గ్రంథమును భారతీయ సోదర మహాశయులెల్లరు తీసికొని చదువ ప్రార్థన-

మధుర పదార్థములైనను వ్యక్తి నెంతో యాప్యాయతతో తినితిని చివరకు వెగటొంది, వాటిపై పూర్తి విరక్తిచెందిన వ్యక్తి మనస్సెన్నటికి నా మధుర పదార్థములపైకి జనదు. "మనసు విరిగెనేని మరియతుక బోదయా!" యనెడి నీతినేనాడో శ్రీవేమన యోగీంద్రులు చెప్పిరి.

నేడు మనమందరము 'మహాయోగి' అని పేర్కొనెడి శ్రీ వేమన్నగారు మన యీ గుంటూరు సీమయందే కొండవీటి ప్రాంతమున రెడ్డివంశమున జన్మించియు ప్రాకృత విషయానురాగ బద్ధుడై వేశ్యాహృదయాగ్ని గుండమున బడి తికమకచెంది

తారుమారై దాని దుష్టవాంఛా ప్రేరణలకు లొంగి క్రుంగి మనో వికారాదులను జయించలేక ఏ జన్మాంతర పుణ్యానుభవముచేతనో మాతృమూర్తిగ తాను దర్శించెడి తన వదినెగారి యాత్మోపదేశ ముతో దిగంబర వేశ్యారూప సందర్శనముచేసి, ఛీ! ఛీ! మూత్ర పురీషాదులకు నిలయమై హేయమైన యీ పనికి మాలిన పాప షిత్తోలుతిత్తిని మదనుని మందిరమని భ్రమించి తపించి జపించి తినే! పాడుమనసా! యిప్పటికి నిజము తెలిసెనా! యని విరక్తి భావమును విరక్తి మార్గమును పొందినవాడై శ్రీ అభిరామయ్య గారి దివ్యమంత్రోపదేశము ద్వారా భవబంధవిముక్తి చెంది తన దివ్యమహిమాన్వితస్వానుభవ సందేశములను విరక్తికి మార్గ దర్శకమైన "ఆటవెలది" యను నామధారణతో, పద్య సహస్రము లను అభిరామయ్య కృపను పొగడుచు నఖండ రచనా రూప ముతో వివిధ వేదాంత రహస్యములను సమాజ పురోగతికి కావల సిన నీతుల నెన్నింటినో పద్యములయందే సమ్మేళనము చేసి లోకమునకు చాటి మహోపకార మొనరించిన శ్రీ వేమన యోగీం ద్రులవారి రక్తికి విరక్తికి కవిత్వపు శక్తికి ముక్తికి కారణము మనస్సే!

ఇట్లెందరో మనోవికార దుష్ప్రేరణకు బానిసలై ధర్మవిరుద్ధ ములైన సంఘద్రోహమైన శాస్త్రనిషేధములైన యజ్ఞాన కార్యాక్ర మావలంబనముతో తాముచెడి సంఘమునకు తీరని యారని చేటొనర్చిరి. మనస్సు పోయిన త్రోవలందెల్ల మానవుడు పోయిననాడు పతనమునకు గురియగును. తన స్వాధీనములో తన

మనస్సున్ననాడు ఎట్టిదారుణ వాతావరణమందున్నను భయములేదు. తన నిత్యసత్యవ్రత భంగమును చెందక తానుతానై తత్త్వమును దర్శించుచు తత్త్వమయుడై తత్త్వమై వెలుగును

మానసికపు టాలోచనా సముదాయముతో విజ్ఞుడైన మానవుడు దుష్టసంకల్పాదుల నారంభమునందే యణచివేసి సత్సంకల్ప బలముతో సద్గ్రంథపఠనముచే మహామనీషులైన సద్గురువుల బోధలచే భగవన్నామామృత పానముచే తీర్థయాత్రాభిగమనముచే స్మరణధ్యానజప తపాదులచే, మోక్షమునుపొందును. దుష్ట కార్యక్రమముల కలవాటు పడిన మనస్సు వ్యక్తిని తారుమారుచేసి తన వశము చేసికొని జంకుగొంకులేక దుష్టప్రవృత్తికి గురిచేసి దుష్టునిగామార్చి దుండగములనే నిత్యకృత్యములుగా రూపొందింపచేసి వ్యక్తి మతిని గతిని స్థితిని తలక్రిందులుచేసి దానవునిగామార్చి నరకమున స్థానమేర్పరచి సర్వనాశనము చేయును. తనకువశముగాని మనస్సు వ్యక్తినెంతటి దుస్థితికి లాగగలదో పాఠకులుగుర్తించియుందురు, "తలపులుడిగెనేనితానెబ్రహ్మంబు" అనిన వేమన్ననుడి సర్వలోకములకు నాచరణ యోగ్యమైనది. ప్రతి ముముక్షువు ప్రప్రథమమున మనోవేగమును తన స్వాధీనముచేసికొని, పనిపాటలేని సోమరులదరికి చేరక దుష్టవాక్యములాడుట కవకాశమివ్వక దుష్టుల దురలవాట్లకు బహుదూరముగా నుండి వారి క్రోధావేశపు కార్యక్రమములను కన్నెత్తియైనను చూడక తనలోనున్న లోటులను దోషకర్మలను నాత్మబలముతో సమూలముగా నశింపజేసికొని తనమనస్సును పరమపవిత్రమైన సత్సంగములో

జొప్పించి ఎప్పటికప్పుడు తనహృదయమును పరమాత్మధ్యానముతో నృహరినామస్మరణలతో సదాకాలము సద్వినియోగ మొనర్చుచున్నాడు., తనమనస్సే తనకు కవచమై రక్షణయై కంటికిరెప్పవలె కాపాడును, అజ్ఞానిమనస్సు బంధమునకు కారణమై భవనరకమున ముంచివేయును. విజ్ఞానిమనస్సు మోక్షమునకు కారణమై నిత్యానందమును చేకూర్చును. వ్యక్తిమనస్సే బంధమోక్షములకు కారణమైయున్నది.

## ౧౦

# నేటి మన స్థితి,

# పురోగమనమా? తిరోగమనమా?

క్రీస్తుశకమున నిరువది శతాబ్దమున నున్న మనము పూర్వ
కాలపు టౌన్నత్యదశకంటే గణనీయమైన దశలోనికి పురోగమి
స్తున్నామా ? లేక తిరోగమిస్తున్నామా ! సత్యమరయుదము.
రాజ్యాంగపు విధులననుసరించి రాజ్యాధినేతల మేధాశక్తి సంపన్న
మైన వివిధశాసన ప్రతిక్రియలతో రాజ్యము సస్యశ్యామలమై
నవ్యశోభలతో పాడిపంటలతో నలరారును. నేటి మన స్థితిగతిమతి,
యెట్లున్నది సర్వులకు సువిదితమే!

పురాతనపుకాలంలో సంతానకాంక్షతో రాజులు రంగప్ప
నెల్లరు నెన్నోశ్రమలకు గుఱియై అశ్వమేధాది మహాయాగములా
దిగా నశ్వత్థవృక్ష ప్రదక్షిణములవఱకు దిగజారి యెంతోకాలానికి
సత్సంతానములను బడయుచుండెడివారు. నోములు వ్రతములు
నుపవాసములు మ్రొక్కుబడులు చెల్లించినను సంతానము కలు
గక దురంతమైన చింతలకు లోనై పతులను తపోభూముల కంపి
వారు సర్వేశ్వరుని కృపాశీస్సులనుపొంది వచ్చినతరి తమసతులు
సంసారయాత్రసాగించి యిష్టకామ్యార్థములను పొంది చిఱుత
పాపాయిల బోసినోటి నవ్వులను సాక్షాత్కరింపజేసికొనిరి. సంతా
నములేని స్త్రీని గొడ్రాలని స్వర్గలోకమున నామెకు స్థానములేదని

యానాటి పౌరాణికాగ్రేసరులెల్లరు ఘంటాపదముగా నొక్కివక్కాణించిరి ఆనాటి పౌరులు సత్సంతానములభించినచో మనవంశ ప్రతిష్ఠ నిలుచుననెడి యాశతో సంతానమునకై యహరహము నువ్విళ్ళూరుచుందురు. మఱియు, బిడ్డలున్నచో కౌమారావస్థయందు సంసారవ్యామోహాలకు తిలోదకములిచ్చి సర్వసంసారబాధ్యతల నెల్ల వారిబిడ్డల కప్పగించి తపసివేషముతో తాపత్రయరహితులై ప్రశాంతవాతావరణమునకు నిలయమైన తపోభూములకేగి మునిపుంగవుల యాధ్యాత్మిక దివ్యతత్త్వోపదేశములకు చెవియొగ్గి హృదయసంస్కరణమునుపొంది భగవత్సాక్షాత్కారమునకై వారి జీవిత శేషములను గడుపుచుందురు. వారిదివ్య పవిత్ర వినిర్మల జీవిత విధానములే వారిపురోగమనమునకు నాంది -

నేటికాలమున వావివరుసలులేవు. కులమతవర్గ భేదములు లేవు. పెద్దచిన్నతారతమ్యములేదు. రాజులులేరు, ప్రజలయెన్నికలలో సీటుకెక్కిన దొరబాబులైన మంత్రుల మంత్రాంగముతో నీనాటిరాజ్యాంగము నడుపబడుచున్నది. రాజులేనిరాజ్యము క్షీరరహితమైన పాయసమువలె రసహీనమై వ్యర్థమగుచున్నది. ధర్మబద్ధులైన రాజులానాడు ప్రజాక్షేమంకరధ్యేయముతో మహోన్నతమైన రాజసౌధములనువీడి పాదచారులై మారువేషములతో తన ప్రజల సాంఘికనైతిక ధార్మిక ఆధ్యాత్మికాదియాచారములను సామాన్య నిత్యజీవిత విధి విధానములలోని మంచిచెడ్డలను స్వయముగా పరిశీలనము చేయుచు వారితో సంభాషణములు సల్పి వారిమనుగడకు వలసిన సదుపాయములను వారి హృదయాను

గతమైన యీతి బాధలకు కావలసిన మార్గములను వారిద్వారా తెలిసికొని ప్రజాహృదయముల కానందమొందెడురీతి రాజశాసనములను ప్రవేశపెట్టెదరు.

నేటిమంత్రాంగమును నడపెడు పెద్దలొకరిద్దరుకాదు. కురుక్షేత్రములోని పాత్రలవలె భిన్నభిన్న సంస్కారములతో స్వార్థపరత్వమైన శాసనములను ప్రవేశపెట్టుచుందురు. ఆశాసనము లాధారముచేసికొని రాజోద్యోగులెల్లరు, హద్దుపద్దులేక పెచ్చుపెరిగెడి సాంసారిక వస్తువుల సేకరణకై బత్తెములు చాలక తమదగ్గరకు పనిబడివచ్చిన వ్యాపారులను రైతుకూలీప్రజలను పీల్చిపీల్చి పిప్పిచేసెదరు.

రాజోద్యోగులకిచ్చిన యక్రమ పారితోషికముల రాబట్టుకొనుటకై వ్యాపారసంస్థల వారెల్లరు విధిలేక క్రయ విక్రయములను తారుమారుచేయ మొదలిడిరి. నిత్యజీవితావసరవస్తువుల ధరలాకాశమంటినవి. దిగువతరగతిలోనున్న పేదకార్మిక ప్రజలెల్ల కుయ్యో మొఱ్ఱో! యనుచు స్థితికి మిగిలిన వస్తువుల దర్శనమునకే నోచుకొనక చాలీచాలని గంజికూటితో రాత్రింబవళ్ళు శ్రమించుచు నెప్పటికప్పటికే తృప్తితో, పేదలపెన్నిధి, మహామంత్రిణి, మన నాగారునసాగర్ ప్రాజెక్టు"నకు శంకుస్థాపన చేసిన మహానాయకులు శాంతిస్థాపకులు, నైన శ్రీపండిట్ జహ్వారులాల్ బాబుగారి గారాబుపట్టి శ్రీమతి ఇందిరాగాంధిగారు సర్వసమానత్వమును చేకూర్చి సర్వప్రజానీకమునకు హెచ్చుతగ్గుల తార

తమ్యమును మొదలంట పెకలించి లోకమునకు సుస్థిరసౌభాగ్యము శాంత్యానందములను చేకూర్చినదని చంకలుగొట్టుచున్నారు. ఇది ఎంతవరకు నేటికలిలో నిజమో! పరిశీలన చేయుదము. సత్య మరయుదము.

ఆధ్యాత్మికవృత్తెన్నడు నేకాలములోను ఉన్నది లేనిది కలిపి కొట్టే స్థితిలోగాని, లేక తోటివిజ్ఞులైన పెద్దలను సమాజమును తెగడి కొందరిని పొగడి ఘనకీర్తులంది శాశ్వతపదవి నలంకరించా లనెడి యజ్ఞాన ప్రవృత్తితో రచనను నడిపించరు. తనకును తెలి యని విషయములేవేవో తనయుపాస్య దైవశక్తి ప్రేరణతో విషయములన్ని గంగాస్రవంతివలె కవికలమున దొరలుచుండును. దేవుడే సర్వమును నడిపించుననెడి అపారవిశ్వాసముకలిగి నిమి త్తమాత్రముగా తాను కర్తవ్యము నిర్వహించెడి నాదర్శకవియైన ప్రతివ్యక్తికి నీరహస్యము బోధపడును.

నేటి మానవసంఘ జీవిత చక్రపరిభ్రమణములం దెంత వరకు నేదిసత్యము? అనెడి యావేదనాగ్ని ఈరచయిత హృద యాంతరపు వీథులలో పరువులు తీయుచుండెడిది. ఆ పరువులోని పరువు చెడనీయక ఉన్నవాస్తవికత జీవితపు లోతులలోని మరు గులను సంఘసృష్టికి సరళమైన ప్రబోధవిధానములతో వ్యక్తము చేసినచో నాటి సోదరమానవ సంఘము జాగృతమై, మానవ సమాజమునే యిరుప్రక్కలచేరి తేనెపూసిన కత్తులవలె, ముసి ముసి నవ్వులతో ముద్దుముచ్చటరూపములతో హాలాహలమును

సృజించి తోటిసోదర మానవ హృదయములను సంక్షోభింపచేసి మేకవన్నెపులులై పెద్దలపేరుతో స్వార్థమనుముసుగున చెలామణి యయ్యెడి నీచాత్ములను సమయము చూచి వారిస్వార్థపరమైన సంఘద్రోహ నీచసంస్కార స్వరూపమును మొదలంట పెకలించి తుదముట్టు చేతురని నాలోనణగి మణగియున్న ఆ సత్య నిత్య నృసింహమహాశక్తి 'ఏదిసత్యము?' అనెడి నీ పొత్తము ద్వారా లోకమునకు జాగృతిని నూతనోత్తేజమును కలిగించు చున్నది.

నేటి స్వార్థపరమైన పాపపు కలికాలమునం దేరంగమున నైనను నీతి, నిజాయితీ, సత్యము, న్యాయము, శాంతి, యహింస స్వార్థత్యాగనిరతి, కరుణ సంఘసమైక్యత, సత్యవాక్యపరిశీలనము సత్యవాక్యపరిపాలనము, ముందువెనుకల తారతమ్యము, మట్టు, గట్టు, నిజమైనపట్టు, వట్టు, వారము, పాపభీతి, నిరుపేదలయందు జాలి, మొదలైన మంచిగుణము, సజీవరూపములో సాక్షాత్కరించుచున్నది లేనిది, యెవరైన పరిశీలనము చేయుచుంటిరా? లేదు 'బాతుబంగారుగుడ్డు కథవలె' నున్నది. తనకన్న బలహీనముగా నున్న తోటిమానవుని, దయదాక్షిణ్యములు లేక వారి ధన మాన మర్యాదలను పలుకుబడిలోనుండి బొర్రలుపెంచుకున్న దొరబాబులు దోపిడివిధానముతో సూర్యోదయమాదిగా సూర్యాస్తమయము వరకు రూపాయల నోటులను లాగిలాగి తనపొట్ట నదుపాజ్ఞలు లేక నింపుకొనుచు కులాసాగా సోమరియై తన బారిలో నేయమా యకుడుపడునా! యనెడి యావతో కాచుకొనియుండెడి మానవుడు

మానవుడా? కాదు! నరరూపరాక్షసుడు. ఇట్టి నరరూపరాక్షసుడు ప్రతిరంగమున ప్రతిస్వల్ప కర్మలో దయకరుణప్రేమ ఓర్పునేర్పు వ్యక్తిగౌరవములను త్యజించి భయభక్తిహీనుడై కర్తవ్యమును వృత్తిధర్మమును తనపైవారి యాదేశమహోపదేశములను పెడ చెవినిబెట్టి మంచియనునది మచ్చునకైనలేక ప్రారంభదశలో కసాయియై దారిదోపిడీలు జంకు గొంకు లేక మంకుపట్టుతో చేసిన వాల్మీకివలె" నేటి సంఘములోని నవీనమానవు డతినేర్పరితనముతో స్వార్థముతో కసాయిహృదయముతో రాతిగుండెతో తన శక్తికి వశులైన తోటి మానవుని చీల్చి 'పచ్చినెత్తురు' పానకము వలె పానము చేయుచున్నాడు. ఈ స్వానుభవము ఉద్యోగులకు వ్యాపారులకు వారి వీరి మధ్యవర్తిత్వపు పరిష్కారయోధులైన మేకవన్నెపులులైన వ్యక్తులెందరికో నిత్యజీవిత సత్యము.

ఎవరికివారు తనక్రిందివాని వానిని వారిపైవారు, ఇట్లనేక రీతులలో "చిన్నచేపను పెద్దచేప మ్రింగినకైవడి" వారిపొట్టను వీరు, వీరిపొట్టను మరొకరు, కొట్టి కొట్టి కడకు, "పక్షపాతపు పాపాలకు పక్షవాతపురోగ మేగతిరా!" యన్నలోకోక్తి ననుసరించి యెంత యార్జించినను ఎన్నిభవననిర్మాణములు చేసినను, ముడుపులవలె ననేకరీతులలో దాచినను వివిధరూపాదులలో స్థిరచరాద్యాస్తిని రూపొందించినను, 'కులుకుక్కకాటికి చండా కావలెనా!' అనెడి తాతయ్యల మాటనే సార్థకములె యన్యాయ విత్తాధికారులెల్లరు, 'కరిమ్రింగిన వెలగపండ్లవలె' కాలగతి చెందెదరు. 'ఏది

సత్యము ! లోని ప్రతిసూక్తి పరమసత్యము పరమధర్మము ప్రమాణబద్ధము స్వానుభవ సందేశములని పాఠకులెన్నటికి మరువ వలదు.

వ్యసనములతో తనకున్నశక్తినంతయు స్వార్థ యోజనములతో తాను తన భార్య తనబిడ్డలు సుఖముగానుండి తదితరసంఘమంతా వల్లకాటిగామారినా చేరినా పరవాలేదనెడి యాశాపిశాచావేశముతో జీవితగమనమును సాగించెడి వ్యక్తి చివరకెందులకు పనికి మాలినవాడై దేవునికరుణాదృష్టికి దూరమై దుఃఖజీవితమునకు గురియై మంచానబడి మరణించును. ఇదియే నేటి పాపపు మానవునిస్థితి.

ఇట్టి నికృష్ట జీవితవిధానమున 'పిచ్చివానిచేతిలో రాయివలె' 'గమ్యముతెలియని బాటసారి ప్రయాణమువలె' పరుగులు తీసే ఈనాటి మానవసంఘపుగతి పురోగమనమో? తిరోగమనమో? ఎవరికివారే సత్యముతో నాలోచనచేయుడు. ఎన్ని సత్యరచనలు రూపొందినను ఎందరు పారాయణముచేసినను 'ప్రొద్దుపోక నిద్రను నిరోధించుటకుధూమశకటయానములో బటానీలుతిన్నరీతి' జూదరి జూదములోను, త్రాగుబోతు త్రాగుడులోను, వ్యభిచారి వ్యభిచారముతోను, చోరుడు చోరత్వములోను, అక్రమవాది అసత్యాలతోను కాలమును వినియోగముచేసినటుల, వ్యక్తులు సత్యగ్రంథముల నెంతకాలము చంకబెట్టినను నోటచదివినను, వేదికలపై పెద్దపెట్టున 'సర్వమానవ సౌభ్రాతృత్వము కావలెను, తోటిమాన

వుని శక్తికొలది గౌరవించి ప్రేమించి తనకున్న దానినర్పింప వలెను. మానవసేవే ! మాధవసేవ ! ఇది మన మహాత్మాగాంధీ గారి యమూల్యమైన యాచరణరూపమైన సందేశములను మన మెల్లరము పాటించవలె' ననెడి సందేశములను సంఘమునకు వ్యక్తము చేసినమాత్రమున లోక ముద్ధరణమునొందదు. ఇట్లెంతకాలము కేకలు వేసినను ప్రయోజనము మాత్రముశూన్యమే !

ఉద్యోగి వ్యాపారి కవి కథకుడు సాహితీవేత్త గాయకుడు పండితుడు, ఆశ్రమాధిపతి, ఆచారి పూజారి ప్రచారకుడు సంఘ సేవకుడు న్యాయమూర్తి, కళారాధకుడు, కళాపోషకుడు, రాజకీయ నాయకుడు మొదలైన పెద్దలెవరైతే సంఘములో నొకరుగా నుందురో వారెల్లరు తోటి సమాజపు దుస్థితి దుర్భర జీవితపు నరక యాతనలను కన్నులార వీక్షించి సానుభూతి వాక్యములనతిచమత్కారముగ పలికి కారులలో షికారులు చేసినంతమాత్రమున వారి కర్తవ్యము ముగియలేదు. వీరి యాకలిమంటలు నార్తనాదములు నండదండలేని బ్రతుకు తెరువు బాటలలోని యీతి బాధలు మొదలైన దుష్కరసమస్యలకు పరిష్కారముకుదరలేదు. పరిణామము చెందలేదు. ఇది ఈనాటి స్థితికాదని కవులకల్పితములని నెవరైన గుండెమీద చేయివేసికొని యనగలరా ? అనలేరు. కారణమేమన ! "కల్లుకుండ కెన్ని ఘనభూషణము లిడ్డనందులోని కంపు చిందులిడదె !" అన్న మన యోగివేమన్న నుడి సార్థకమైనది శ్రీమహాత్మాగాంధీ, తాతవలె వేషధారణచేసి తెల్లటోపి ధరించినంతనే ఆ మహాత్ముని వినిర్మలహృదయ

సంస్కరణమువచ్చునా ? ఆ బాబుగారి మానవసేవా రూపమైన నిర్మల ధర్మకర్మజీవన విధానములలవడునా ? కులమత జాతివర్గ సమస్యల పరిష్కార నిర్మూలనమునకై యా బోసినోటి నవ్వుల దొరబాబుగారి నిత్యసేవానిరతి యాచరణాత్మకమైన పవిత్రబోధ లాంగ్లేయులనే యాశ్చర్య చకితులనొనర్చి యాయనపాదాల సన్నిధి మోకరిల్లచేసినది శ్రీ నెహ్రూ బాబు శ్రీ మహాత్మాగాంధీ తాతగారిర్వురు చేసిన యానాటి వారి మిత్రత్వ మేకాభిప్రాయ ముతో సంఘసమస్యా పరిష్కార మార్గము లెన్నింటినో సరిచేసి లోకమునకు శాంతిసౌఖ్యలను ప్రసాదించిరి ఆ రాజకీయరంగ ములో కృషిచేసే నేటికాలపు పెద్దమనుష్యుల హృదయపరివర్తన ములను వ్రాయనక్కరలేదు ! ఆధునిక కవిపుంగవులు 'పెద్దమను ష్యుల' సినిమాలో వెండితెరపై ప్రత్యక్ష ప్రమాణముగ కన్ను లకు సాక్షాత్కరింపచేసిరి. ఎందరు ఎన్నిరీతుల హెచ్చరించినను నేటి కలిలో మెలగెడి లౌకిక నీచమానవుడు మారుటలేదు. 'కనక పుసింహాసనమున శునకము కూర్చుండబెట్టి శుభలగ్నమునం, దొనరంగ పట్టముగట్టిన వెనుకటిగుణ మేలమాను వినురా ! సుమతీ !' యని యేనాడో సుమతీశతకకర్తయైన మా బద్దెన మహాకవి, ఉన్నదివున్నట్లు చెంపకు లెంపకాయవేసినటుల సంఘపు గతిమతిస్థితులను యతిగణప్రాస లోపమురాని రీతిలో మహాపూర ణము గావించిరి. అనాటి కవిగాని యీనాటి కవిగాని ఉన్న దానిని సంఘటనాపూర్వకమైన రహస్య విషయ సమ్మేళనముతో, ఆ నలువరాణి, దివ్యవాణి, కృపాబలసామర్థ్యముతో కవనమును

గద్యపద్యరూపాదులలో సాగించి సంతోషించుచుండును. 'కవి' యెప్పుడు వాస్తవిక సత్యస్వరూపాదులను తన రచనారూపములో సంఘపు దృష్టికి వ్యక్తము చేసి తనతోటి నవసమాజము నుత్తేజ పర్చి చైతన్య శక్తిని మేళవింపచేసి, తృప్తి యానందములను పొందుచు. తనసేవకు తనకృషికి సరియైన ఫలితములు పొందజాలక ఎన్నో యీతిబాధలకు కఠినసమస్యలకు గుఱియై తనకుతానే వైరాగ్య ప్రబోధము చేసికొని సదా యిష్టదైవ ప్రార్థనాదులచే నానందించుచునే జీవితగమనమును సాగించును.

ప్రకృతిబద్ధుడై ప్రకృతి వ్యామోహమునకు గుఱియై ఆవేదనా పూరితమగు ననేక చిక్కుసమస్యలకు వారసుడై యెప్పటి కప్పుడు ఛీ! ఛా! సంసారములో మనము పొందెడి శాంతి యశాంతులలో సుఖదుఃఖములలో లాభనష్టములలో జయాపజయములలో సతీసుతాది బంధుసమస్యలలో పొందెడి యానందవిచారములలోను పరిశీలనాత్మకమైన దృషితో నున్నదియున్నటు అంచనావేసి చూచిననాడు, సుఖముకంటే దుఃఖమునే ఎక్కువగా పొందుచున్నాము శాంతికన్న నశాంతియే మిగులుచున్నది. 'బూడిదలో చేరిన కుక్క జ్ఞానమువలె' సద్గ్రంథములు చదివిననాడు అర్యులనీతివ ్యములు విన్ననాడు. ఎవరైన ధనవంతుడో! బలవంతుడో! లేక కర్రపెత్తనము చేసి సంఘముపై చలాయించి బొర్రను పెంచిన పెత్తందారో! యకాలమరణమునుపొంది కాటితోనగ్నికాహుతియై బూడిదగా మారిననాడు, తనధనబలాదులు సన్నగిల్లి సంఘములో తనకున్న పలుకుబడి పూర్తిగా నశించి భికారిగా.

మారిననాడు మాత్రము, ప్రతివ్యక్తి ఏదిశాశ్వతము నిందులో ఏదిసత్యమురా? నిజమును గుర్తించక మనలోమనము పొంగి పోదుము. కానీ, ఆ దేవుడు క్షణములో కలిగించే మార్పును తెలిసికోలేమురా! యనెడి అభావవైరాగ్య వాక్యములాడుచుందురు.

ప్రసూతివైరాగ్యము పురాణవైరాగ్యము శ్మశానవైరాగ్యము ఆపదలవైరాగ్యము అట్టేకాలము నిలువదు. స్వభావవైరాగ్యమువలన సద్గురు సందేశసూక్తి సుధాపాన భాగ్యమువలననే మానవుడు విరాగముతో జీవితపురోగతినిచెంది ధ్యేయవస్తుసాక్షాత్కార సిద్ధిని పొందగల్గును.

నేటి ప్రభుత్వపు సమదృష్టి శాసనములలో నున్న స్థిరచరాద్యాస్తి నిత్యమా ? యనిత్యమా! యనెడి సమస్యలోపడి తికమకతో తిక్కెత్తినరీతిలో తిరుగుచున్న సమాజమునందేమాత్రము మార్పుకనపడదు. 'పామునోటిలో చిక్కినకప్ప తనముందు తిరిగెడి యీగల నాశించు'రీతి సర్వమానవులు తనకున్న ఆస్తిచాలక ఎన్నోమార్పులతో తృప్తిని చెందుటకు బదులుగా నాశలనుపెంచుకొని ఆందోళనలు చెందుచుండిరి. సర్వమానవులు దేవునిశక్తి సంపన్నమైన సృష్టిలో సమానమే !

'ఆకాశము వాయువు అగ్ని జలము భూమి' ఈ ఐదు పంచభూతములు. వీటిలో సర్వులకు సర్వసమానమైన యధికారముగలదు. దీని నెవ్వరు కాదనలేరు. ఇది అనాదిద్యైన ఆర్య సిద్ధాంతము. ఆకాశము వాయువు అగ్ని జలము నీ నాలుగు నే

త్తగాదాలులేకనే భిక్షాధికారి మొదలు లక్షాధికారి వర కనుభవించుట కందరికి సమంజసమైనదేకదా !

పంచభూతాలలో నాల్గింటిని సర్వులు సమానముగా స్వీకరించుచున్న రోజులలో నైదవభూతమగు భూమిని మాత్రము సర్వులు సమానముగా పొందుట న్యాయముకాదా! అందరికీ తెలియనిది, కొందరికి తెలిసినదే నేటి భూసంస్కరణము. భూసంస్కరణము తదుపరి ధనసంస్కరణము దాని యనంతరము కులమత వర్గ తారతమ్య సంస్కరణము. క్రమానుసరణముగా సర్వమానవులు కష్టసుఖములలో సమానభాగస్వాములై యలరారు దశరానున్నది. ఇది యెవ్వరి శాసనమో! తెలియునా ! మన నాయకీ నాయకుల శాసనముకాదు. సృష్టికర్త స్థితికర్త లయకర్త శాసన కర్త, కార్యకారణకర్త ఆ పరమేశ్వరుడే! ఇంతటనైన ఏది సత్యమో ! గుర్తించి కట్నాలకై, లంచాలకై స్వార్థమును పెంచుకొని సమాజమును వమ్ముచేయుట పూర్తిగామాని యున్న దానితో ప్రేమతో నర్పించిన దానితో తృప్తిపొంది భారతీయ విజ్ఞానపు వెలుగులతో నున్న సత్యవస్తువును దర్శించి యాసత్య వస్తుశక్తి యనంత ప్రసారములో జీవితములను జీవితపరమైన స్వార్థదావానలమును శాంతింపచేసికొని సంఘశ్రేయః కాంక్షతో సంఘ పురోగతి కెవరికివారే వేదాంతవాచాలతలు మాని, కర్తవ్య దీక్షానిరతులై సంస్కర్తలై సమాజపురోగతికి కారకులై దేశమును దివ్యవైకుంఠముగా మార్చి సర్వసమానత్వ సత్యదృష్టితో కాలమును కాలపువిలువలను గుర్తించి నిత్యసత్య సనాతనుడై

వెలింగెడి యా పరమాత్మని కృపకు పాత్రులై చరించి తరించి జీవన్ముక్తి సామ్రాజ్యమునకు పట్టభద్రులై భారతాంబ ముద్దుబిడ్డ అన్న ఘనకీర్తిని సార్ధకముచేయుడు. ఇట్టిస్థితి సమాజము పొందిన నాడు మనస్థితి తిరోగమనముగాక పురోగమనమై విరాజిల్లును.

అన్నికాలాలకన్న నేటి కాలములో ఆధునిక పరికరములతో రసాయినికపు ఎరువులతో కృష్ణవేణీజలాలతో జపాను వరి సాగు నూతనవిధానముతో రైతుకూలీ ప్రజలెల్లరు నైకమత్యముతో నానందసాగరములో తేలియాడినట్లుగా హెచ్చుదిగుబడి పంటలనే పండించుచున్నారు, మనమెన్నివిధముల కృషిచేసినను ఫలితము శూన్యరూపమునే దాల్చుచున్నది, కారణ మేమి?

హెచ్చుదిగుబడి విధానములో పంటలు పండించుచున్నారు, మనప్రజలు చాలా చైతన్యవంతముగా కృషి చేయుచున్నారు. 'కృషితోనాస్తి దుర్భిక్షమ్' అన్న ఆర్యోక్తి సార్థకమగుటలేదు. దీని కీలకస్థానము పాలకులైన మననేతలు గుర్తించి ఓహో! పంటలతోపాటు ప్రజలు కాలనియమములేక ఋతుధర్మములను విడనాడి సదా ప్రేమపాఠాలతో ప్రొద్దులు బుచ్చుచు సంతానోత్పత్తి చేయుచున్నారు. ఈ యధిక సంతానములవలన మనదేశము రానురాను నీరసమై యాకలిమంటల కాహుతిచెందక తప్పదనే పుకార్లతో ప్రభుత్వము సంతాన నిరోధక చట్టమును పట్టణములందును పల్లెలందును, ప్రత్యేకశాఖద్వారా అమలుపఱచిరి.

పరమేశ్వరుని సృష్టిని కృత్రిమసాధనములద్వారా నిరోధిం

చడము సాధ్యమైనదికాని. నూతనసృష్టిని ప్రత్యేక మార్గముల ద్వారా సిద్ధింపచేసికొనుట సాధ్యముకాలేదు. మారణహోమమును తేలికగా గుర్తించ వీలగుచున్నది. ఇది కలికాలపుశక్తి దైవశా సనబద్ధమై జీవులకర్మానుగుణ్యమైన సృష్టి మన స్వయంకృషిలో లేదు. సంతానములేని కోటీశ్వరులెల్లరు లక్షలుఖర్చుపెట్టి సంతానమును పొందుటకు చేతగాక వీలులేక పరులబిడ్డలనుదెచ్చి దత్తత స్వీకరించుచున్నారు. స్వయంకృతమైన సాధన శక్తిసామర్థ్యముల ద్వారా సంతానములను గనుటయు, దేహమునుండి ప్రాణము వెడలుట నిరోధించుటయు, కాలము గడచినను వృద్ధత్వము లేకుండుట కనుగొనినాడు. దేవుని ప్రస్తావనయే సంఘమునకు లేకుండెడిది; హైందవసిద్ధాంతములు కర్మసూత్రములు పరిణామ విధానములను దూరముగా త్రోసివైచెడివారే!

ఆదికాలమునుండి కాలగమనమున రకరకములైన మార్పులెన్నో సంభవించినవి. మహామేధావులెందరో భారతావనిలో నావిర్భవించి విశ్వవిజ్ఞాన పరిశోధనలెన్నింటినో చేసిచేసి అసలు మూలరహస్యము బోధపడక మన కగమ్యములనితేల్చి యథాతథముగ నిశ్చయముచేసి జీవితములను చాలించిరి. జన్మలు కర్మలు మనము సృష్టించుకున్నవికాదు. కర్మసిద్ధాంతమును కాదనుటకెవ్వరి కధికారములేదని మన హైందవ సంస్కృతి వాకొన్నది. 'ఒకరులేక ఇద్దరు చాలు' అని ప్రచారముచేసిరి. వారిశాసనము భూభారము తగ్గించుటకు కలిలో మంచిదేయని యనుకొన్నను, సంతానములేని ధనికులు వయసులో బలముతోనుండియు "ఒక్క-

బిడ్డచాలు! ఉపాయ మేమని యడిగినచో వారికి తగిన జవాబు సంతాననిరోధపు చట్టమువారు చెప్పజాలలైరి. మహమ్మదీయ సంఘ సోదరులు క్రైస్తవ మతసోదరులు, ఈ యి తెగల వారె వ్వరు సంతాననిరోధ చట్టము నంగీకరింపలేదు, కైక విశ్రవసు బ్రహ్మలకు రావణ కుంభకర్ణ విభీషణులు ముగ్గుర జన్మించిరి. మూడవబాలుడైన విభీషణుడే పరమసాత్త్వికుడై చివరకు లంకా సామ్రాజ్యమునకు శ్రీరఘురాముని చలువతో పట్టాభిషిక్తుడై ధర పాలించి సత్కీర్తిని పొందెను. 'ఒక్కరు లేక ఇద్దరు' యనెడి ధర్మము పాటించినచో కైకసి సాధ్వి దుర్మార్గులైన ఇద్దరితోనే చింతలకు గుఱియై శాంతికి దూరమై దుఃఖమున మునిగియుండె డిది కదా!

ఎన్ని శాసనములు ప్రవేశపెట్టినను సంఘము శాంతికి దూరమగుచునే యున్నది. ఋతు ధర్మములే తారు మారైనవి. మానవులే నాడు ధర్మపథమునుండి దిగజారి స్వార్థము నే పెంచు కొని దానవ జీవిత విధానముల ననుసరించుచుంటిరో! యానాడె కాలము వక్రము గా మారి ఋతుధర్మములు తారు మారైనవి. దేవుని యెడ దేవుని యాదేశముల యెడ సంఘమునకు గౌరవము జీర్ణించినది. వ్యక్తి తనకున్న భౌతికసంపదతో దైవమునే కబ ళింపజూచుచున్నాడు. వ్యక్తికి సాధ్యమా! భగవానుని శాసనాధీ నమై దిక్పాలురు తదితర దేవగణములు పంచభూతములు సర్వము నడువవలసినదే! ఆధునిక శాస్త్రజ్ఞానమువలన సర్వశక్తివంతుడను నేనే అని నేటి నవీన మానవుడు ఊహించుచున్నాడు. ఆయనం

తుని దివ్యపరిపూర్ణ నిత్యసత్య మహామహిమాన్విత భవ్యశక్తి తెలిసికొనుటకు కోటియుగములకైనను సాధ్యమగునా?

సత్యము జీర్ణమై న్యాయము నాశమై ధర్మమడుగంటి స్వార్థము పెచ్చు పెరిగిన ఈ కలికాలపు దారుణ వాతావరణ ఫలిత మింతేనోయ్! భగవంతుని వారసులారా! భారతీయసోదరులారా! యనెడి నినాదములు సాధుపురుషు లెందరో, అఖిలాంధ్ర సాధు పరిషత్సభలద్వారా లోకమునకు చాటుచున్నారు వినుచుంటిరి కదా!

నేటి మనస్థితి మన భారతీయ ఋషుల విధివిధానముల ననుసరించుటలేదు. వాగ్రూపమున మాత్రము రమణీయమైన పద జాలముతో తేనెలొలుకు నుపమానములతో వినెడి శ్రోతలను మంత్రముగ్ధుల నొనరించుచున్నారు. ప్రతికళారాధకుని హృద యపు లోతులలోని నిజస్వరూపమై ఖరులను కళాస్రష్టయైన పర మాత్మ యెల్లవేళల కనిపెట్టుచునేయుండును. పంచముఖబ్రహ్మ పరమశివుని వివాహ కర్మకు ప్రతినిధిగావెళ్ళి మంత్రాంగము జరు పుచు, లీలావిలాసిని జగన్మోహినియు నగు పార్వతి ముఖబింబ మునదేపనిగా చూచుచున్నంత మహాదేవుడదిగాంచి తప్పుచేసిన కన్నులకు విలయమైన బ్రహ్మపంచమశిరమును తన త్రిశూల ముతో, ఖండించెను.

అట్టి బ్రహ్మయ్యకే తప్పుకు తగిన శిక్ష సంభవించినది. నేటి కలిలో క్షుత్పిపాసాబద్ధుడైన కళారాధకునకు పాపముచేసిన

ఫలమూరకపోవునా ? జాగ్రత్త ! ప్రతికళారాధకుడు తనత్రోవ
తాను తప్పి తప్పటడుగు వేయకముందే, ఇట్టి పవిత్రగ్రంథము
లను భయభక్తులతో చదివి, తప్పుదారి పట్టనున్న పాపిష్టి మన
స్సును సంస్కరించుకొని కళారాధకుడన్న మహనీయమైన
సత్కీర్తిని వమ్ముచేయక సొమ్ముచేసికొని సంఘమున కీర్తిప్ర
తిష్ఠలను గాంచి ధ్రువతారయై గురువులకు కన్నతల్లిదండ్రులకు
నివసించినట్టి గ్రామమునకు గణనీయమైన స్థితిని చేకూర్చి జీవి
తములను సార్థకము చేసికొనెదరని రచయిత అకాంక్ష !

ఇట్టి యుత్తమమైన భారతీయ విజ్ఞానమును గుర్తించి
ధర్మాచరణముతో స్వార్థమనెడి పిశాచమును సత్యదీక్ష పట్టుదల
ఐకమత్యమనెడి మహామంత్ర శక్తులతో మనభారతదేశపు సరిహ
ద్దుల దాట బంపి దాసోహమ్మనినచో మనస్థితి తిరోగమనము
గాక పురోగమనమై పురాణప్రసిద్ధమై పూర్వ ఋషుల వారసులమై
యలరారెదము, ఆత్మానందమునుపొంది అమరులమై నలరారె
దము.

౧౧

## నీతులుచెప్పేవారు గోతులు త్రవ్వెదరా ?

తా నేభావముతో జీవితమ్ము గడపుచుండినన ట్లే యితరులును
జీవింతురని యజ్ఞాని దురూహ చెందును. ఇతరులను తనవలెనే

భావించుటయేగాక వారినిగూర్చి యపోహలల్లును. కవిగాయక పండిత ప్రవచనాదక్షులగు పెద్దలను, తామనుభవించి గ్రహించిన జీవితపరిణామ సత్యములను పలువురకు బోధించెడి సద్బోధకులను, సత్సంగ మొనరించుచు మహాత్ముల సూక్తులనే పఠించుచు వినుచు, కాలమును సద్వినియోగ మొనర్చెడి మెట్టుల జీవితచర్య లను చెంతనేయుండి కనుచుండియు, దుష్టప్రవృత్తులకులోనై మంచియనునది మచ్చుకైనను తనలో లభించని యజ్ఞాని యిట్లని తలంచును. ఎందఱినో చూచితిమి. వాచాదక్షులై భక్తి జ్ఞా వైరాగ్య బోధలు, నీతి సూక్తులు పలుకు వారలే గాని. యాచ రించు వారెచ్చటను లేరే. ఎందులకీ పనికి మాలిన రచనలు! ప్రయ త్నములు చెయక దేవుడు దేవుడని చేతులు ముడుచుకొని కూర్చొ నిన భుక్తివచ్చునా!" యనెడి ప్రాపంచిక ధోరణితో, సత్సంగము లనిన సద్గ్రంథము లనిన స్వానుభవ సందేశము లనిన, నిరసన భావముతో నీతులు చెప్పేవారే గోతులు త్రవ్వేదరయ్యా! నీతిగల వ్యక్తి యీనాడెవరయ్యా!' అనెడి యజ్ఞాని హృదయమును సరి చేయ వలెననిన పండిత ప్రకాండులకే యసాధ్యమైన పని. అజ్ఞాని యనగా, ఎవరు చెప్పినది వినక, తనకు తెలియక విషయమును గూర్చి వాదించువాడని భావము.

– మహాకవి శ్రీ భర్తృహరి యట్టి వారిని గూర్చియే –

తే॥ తివిరి యిసుమునఁ దైలంబుఁ దీయవచ్చుఁ
దవిలి మృగతృష్ణలో నీరు ద్రావవచ్చుఁ

దిరిగి కుందేటి కొమ్ము సాధింపవచ్చుఁ

జేరి మూర్ఖుల మనసు రంజింపరాదు॥ - అని వచించెను.

ఈ విషయము నానాడే ఆ మహాకవి లోకానుభవమును తన స్వానుభవ సంఘటనలలో గుర్తించి యీ నగ్నసత్యమును లోకమునకె చాటిరి.

ఆ నాటినుం డీనాటి వఱకు నీతులు చెప్పిన వారెల్లరు గోతులు త్రవ్విన వారేనా!

శాక్యవంశాబ్ది చంద్రుడుగ నుదయించిన సిద్ధార్థుడు, పడుచు భార్యను పసిబిడ్డను సామ్రాజ్యవైభవానందమును తృణప్రాయముగా త్యజించి సర్వమానవ సముద్ధరణమునకై సన్యాసియయ్యెను, బలికై గొనిపోబడుచు కుంటుచున్న మేకపిల్ల కన్నీటిని చూచి కఱకు కత్తుల కెదురునిలచి కరుణను పండించినాడు కరుణామూర్తియై తనసంఘమునకు దయాధర్మ సత్యాహింసలను బోధించాడు. శ్రీ శంకరాచార్యులువారు క్రీ॥ శ॥ 788-820 లో ప్రస్థానత్రయమునకు వ్యాఖ్యవ్రాసి యద్వైత సిద్ధాంతమును భారత దేశములో నలుమూలల వ్యాపింపచేసి సర్వవేదాంత రహస్యములకు మూలసూత్రమైన "బ్రహ్మసత్యం - జగన్మిథ్య" "జీవో బ్రహ్మైవనాపరః" యనెడి మహావాక్యములను దివ్యప్రచారమునుచేసిరి.

శ్రీశంకరాచార్యులవారి యనంతరము క్రీ॥ శ॥ 1017-1137 లో శ్రీ రామానుజాచార్యులువారు మహోద్దండ పాండితీ

ప్రకర్షలతో వైష్ణవమతవ్యాప్తికి ప్రబోధముచేసిరి. వీరు ప్రతి విషయమును బరిశీలనముచేసి వారాచరించి తదనుభూతిని పొందినపిమ్మటనే యాభగవత్తత్త్వ రహస్యములను ప్రజలకందించిన మహనీయమూర్తి. సర్వజనులకు మహామంత్రమును వెల్లడిగా గాలిగోపురముపై నిలచి 'ఓం నమః నారాయణాయ' అను తిరుమంత్రమును బోధించెను. వీరిని "విశిష్టాద్వైత" ప్రచారకులని లోకము గొనియాడెగదా!

శ్రీ మధ్వాచార్యులు వారు క్రీ॥ శ, 1238 - 1317 లో భారతదేశమున వికృత భావములు చెలరేగిన సమయమునందు సందర్భానుసారముగ వారివారి హృదయ సంస్కారానుగుణముగా లోకక్షేమంకరధ్యేయముతో శంకరుల యద్వైతవాదమును రామానుజుల విశిష్టాద్వైతవాదమును రెంటిని వీరి ప్రజ్ఞాపాటవ వాదులతో నెదిరించి "ద్వైత" మతస్థాపనము గావించిరి. ఆచార్యత్రయమైన వీరిదివ్య ప్రచారములలోని సదాశయములు భిన్నములుగావు. కారణమేమన, నా కాలానుగుణమైన పరిస్థితులకు లొంగి చరించెడి మానవుల ధ్యేయ ప్రవృత్తుల కెట్లు పరిణామమును కల్పించి వారి హృదయ మందిరములలో దేవుని స్వరూపమును స్థిర ప్రతిష్ఠ చేయవలసినది. యాయాచార్యులైన భాష్యకారులు మహాత్ములు యథాతథముగా నెఱింగినవారై దేశకాల పాత్రోచితముగా నా వేదరహస్యములను మతప్రచారరూముపవో నుత్తేజకర మహోపన్యాసములతో నాసేతు హిమాచల పర్యంతము పర్యటించి సర్వమానవుల కందించి స్వానుభవ సందేశపరమైన నీతు

లతో, ప్రకృతి బద్ధులైన మానవులకు ప్రబోధములు చేసి వారి హృదయములలో గొప్ప పరిణామమును రూపొందింపచేసి పురో గతిని కల్పించి త్రిమతాచార్యులు మహోపకారమును గలుగ చేసిరి. నీతులు చెప్పేవారు గోతులెన్నటికి త్రవ్వరు. పాలనుండి విడివడిన వెన్న తిరిగి పాలలోకలియనిరీతి పరిపక్వముచెందిన హృదయముగల వ్యక్తి యేకాలమునందైన నెట్టిపరిస్థితులకు దిగజారినను నీతులు చెప్పుచు ధర్మాచరణముతో తోడి సంఘ మునకు మేలును చేకూర్చునే గాని, గోతులు త్రవ్వి కీడును చేకూర్చడు,

శ్రీవల్లభాచార్యులు శ్రీ నామదేవ్ తుకారామ్ శ్రీ జ్ఞాన దేవ్ శ్రీ ఏకనాథ మహాశయులు, శ్రీ కబీరుదాసు శ్రీ గురునానక్ శ్రీ చైతన్యస్వామివారు, శ్రీతులసీ దాసుగారు శ్రీ సూరదాసు గారు శ్రీ పోతరాజులుగారు శ్రీ గోపరాజుగారు శ్రీ త్యాగరాజు గారు, శ్రీ రాజారామ మోహనరాయలు, శ్రీ దయానందస్వామి వారు శ్రీ రామ తీర్థస్వామివారు, శ్రీ రామకృష్ణ పరమహంస వారు, శ్రీ వివేకానందులవారు, శ్రీ యరవింద మహాశయులు, శ్రీ రమణ మహర్షిగారు శ్రీ సద్గురు యోగానంద నరసింహ మహర్షివారు, శ్రీ మళయాళ స్వామివారు, శ్రీ మహాత్మాగాంధీ గారు, శ్రీ శైల జగద్గురువాగీశ పండితారాధ్య శివాచార్య మహాస్వామివారు, శ్రీ శంకరానందగిరి స్వామివారు, శ్రీ సచ్చిదానంద వేంకటేశ్వర స్వామివారు, శ్రీ విద్యా ప్రకాశా నందగిరి స్వామివారు, శ్రీ శుద్ధ చైతన్య స్వామివారు, శ్రీ

ఓంకార స్వామివారు శ్రీ కేశవ తీర్థస్వామివారు, శ్రీ బ్రహ్మా నందగిరి స్వామివారు, శ్రీ విద్యానందస్వామివారు శ్రీ విమ లానంద భారతీ స్వామివారు శ్రీ పండిత గోపదేవ్ గారు శ్రీ పంచా చార్యులు శ్రీ అఖిలాంధ్ర సాధు పరిషత్సభ్య మహాశయు లెందరో విశ్వమానవ కల్యాణమునకై, యెంతో కృషిచేసి నిత్య సత్యమైన పరబ్రహ్మానుభవ సిద్ధిని పొంది వారివారి యమూల్యా చరణాది యాధ్యాత్మిక దివ్య భవ్యనవ్యోపదేశసములను, కరుణా ళురై, మాయామోహావేశముతో బాటతొలగిన సోదర మానవ కోటి కహరహము ప్రబోధములు చేయుటయేగాక గ్రంథరూప ములో వారి దివ్యాత్మోపదేశములను సమాజమున కందించుచున్న సాధువులు నాధ్యాత్మిక కళాకోవిదులు, గోతులు త్రవ్వక మీకు నీతులనే బోధించుట ముమ్మాటికి గ్రహించి త్వరపడి గతమున పెద్దలను దూషించిన నీచ సంస్కారమునుండి విముక్తులుగండు.

---

## ౧౨

## పూర్వపుణ్యఫలావిర్భావ జీవునకే - ఆనంద జీవితమా?

ఇంతవరకు - ఏదిసత్యము, యనెడి యీ పొత్తమున ఏకాదశ సంఖ్యగల సగ్న్న సత్యాంశములను నాధ్యాత్మిక దృష్టితో

షరించిన మీరెంతో పుణ్యాత్ములని నే దలంచితిని. పూర్వపుణ్య సంస్కార లేశమైనను లేనిచో వ్రాయుటకై నాకీ సంకల్పము కలుగదు. ఇట్టి సూక్తుల పారాయణము చేయవలయుననెడి యాసక్తి చదువరులైన మీకు కలుగదు.

సత్కర్మ దుష్కర్మ మిశ్రమ కర్మలనే మిషతో స్వార్థపరులు కొందరుసృష్టించి అమాయకులకు బోధించి వారియర్థమును సంగ్రహించి జీవనము నానందమయము చేసికొనుచున్నారనెడి వారి ధోరణియు వారి కర్మ ప్రభావప్రేరణమే! కర్మముందా? లేక జన్మముందా? విత్తుముందా? చెట్టుముందా? యనెడి తెలిసీ తెలియని కొంటె ప్రశ్నలకు శ్రీ రామకృష్ణ పరమహంసలాదిగా మహనీయులెందరో, ప్రత్యక్ష ప్రమాణాలతో ఋజువుచేసి తార్కికులకు కూడ మౌనముద్రవేయించిరి. ఆహారనియమము పాటించనవారికే రోగములు సంప్రాప్తమగుచుండును. రోగగ్రస్తులైన వారలే యౌషధ పానము చేయవలెను. రోగి మ్రింగలేడని రోగి బంధుమిత్రాదులెంతకాలము సేవించినను వారి రోగము కుదురదు. పైపెచ్చు, రోగిని బాగుచేయవలెనని రోగములేని బంధువు ఔషధమును సేవించిన వీరికి రోగములు సంప్రాప్తములగును. ఎట్టి వారలైనను పూర్వకర్మలనుభవించకతప్పదు. 'ఆ కొన్నమనుజుని యాకలి తీరునే? ఘన రసాన్నముల వర్ణనమువలన' అన్న 'శ్రీసీతారామాంజనేయ సంవాదము' లోని మధురసూక్తివలె పురాకృతకర్మపరిపక్వము ననుసరించియే జీవులెల్లరకు బుద్ధి ప్రేరణ జరుగును. అమృతము పానముచేయవయ్యా! యని ప్రార్థనలు

సేయ జీవుని బుద్ధి ప్రేరణతో విషపానమునే చేయును. ఎన్నో యాశలతో అంచనాలతో తన జీవితమును తీర్చిదిద్దు కొనెడి ప్రయత్నములోనుండియు నిర్నిమిత్తముగ, కలసి మెలసి తిరిగెడి ప్రాణమిత్రులతో నైతము చెప్పక తన సుఖరూప జీవితములో సంభవించెడి సాంఘిక సమస్యలను సర్దుపాటు చేసికొను వసతు లున్నను, తనచుట్టునున్న పెద్దలను వ్యతిరేకించి సమస్యాపరిష్కారమును సరిచేసికొను తాహతులేక అంచనాలన్నిటికి నొక్కసారి స్వస్తి చెప్పి తనదేహ పరిత్యాగమునకు సుఖమైన మార్గము కష్టములేని చావునగు ఎండ్రిన్ విషపానముచేసి నీ ప్రపంచమును వీడిపోవును. మన పెత్తనముతో నేదియుకాదు, బలమైన పశువును రైతు నాయకుడు ముక్కుత్రాడు నాధారముతో లాగుకొనిపోవు విధమున నీ జీవులెల్లరను కాలపురుషుడు కర్మసూత్రధారణతో తన యొడిలోనికి చేర్చుకొనుచుండెను. నీ కర్మసూత్రరహస్యము బహుకఠినమైనది. దాని నుల్లంఘించుట కెంత వారికి సాధ్యముకాదు, క్షీర సాగర మథనములో నావిర్భవించిన యమృతము మహావిష్ణువు పాలైనది. కాలకూట కఠోర కల్పాంతవహ్ని మహేశ్వరుని పాలైనది, కర్మ రహస్యమతి విచిత్రము. అత్యంతాశ్చర్యకరము, జీవుల కగమ్యము.

పూర్వ కాలములో సంతానములేని మహారాజులు రాజ్య పాలనము చేసిచేసి యకాలమరణమునకు గురియయ్యేదరు. అట్టి తరి దాయాదులు వారసత్వపు హక్కు మాది మాది యని కుమ్ములాటకు సిద్ధమైన రాజ్య సమస్యా పరిష్కారమునకు

మార్గము దెలియని మంత్రులెల్లరు క్రుమ్ములాటవలన మీకెవ్వరికి రాజ్యాధికారము లభింపదు. మేమొక ధర్మ నిర్ణయము చేసితిమి. మన పట్టణపు పెద్ద యేనుగు నలంకరణచేసి తొండమునకు పూల మాల నొసంగి పట్టణమున వదలుదము. ఆ దైవ ప్రేరణతో నా పూలమాల యెవ్వనిమెడలో వేసి తన కుంభస్థలముపై నెక్కించుకొనునో, నా వ్యక్తియే మనకు రాజని తీర్మానముచేసి ఏనుగును పూజించి ప్రదక్షిణ నమస్కారము లొనర్చి, మంగళ తూర్యారావములతో పంపిననాడు, రాజ్యాధి పత్యము నాశించి దొర బాబు లెందరో ముందునకు వచ్చెదరు. వారందరిని ప్రక్కకునెట్టి ఆ గజరాజ మెక్కడకో పయనించి, మారుమూల ముక్కుమూసు కొని కూర్చున్న యొకానొక వ్యక్తికి తనకుంభ స్థలముపై నున్న సువర్ణకలశములోని పన్నీటి జలము నభిషేకించి పుష్ప మాలంకృతుని చేసి తన కుంభ స్థలముపై సుఖాసీనుని గావించి రాజ మందిరమున కేతెంచును. ఆ పట్టపుటేనుగు నిర్ణయించిన వ్యక్తి దరిద్రుడైన నవనాగరికుడైన నెట్టివాడైనను వానినే మంత్రులు పౌరులునందఱుకలసి యేకాభిప్రాయముతో నెన్నుకొని వారే మనకుమహారాజని గౌరవ మర్యాదలతో శుభలగ్నమందు పట్టాభిషేకముచేసి వారి యాజ్ఞలను రాజాజ్ఞలగా సర్వులు భావించి సదా శిరసావహించెదరు.

దీని వలన సర్వ వ్యాపకమైన యీ పరమేశ్వర శక్తియే యీ భద్రగజము ద్వారా జీవియొక్క పూర్వ పుణ్య కర్మానుభవ కారణముగ మహారాజ నిర్ణయము చేయునవి బోధ

పడుటలేదా! ఆనాటి సంప్రదాయమది, నేటి కాలపు సంప్రదాయ మునదే! ప్రజాభిప్రాయముతో నెన్నుకొన్న వ్యక్తులెట్టి వారైనను నేటి రాజకీయ రంగమునుండి వారే మనలను పాలించు చున్నారు. వ్యక్తి మంచి చెడు కారణముకాదు. 'పదుగు రాడు మాటపాటియై ధరజెల్లు' నన్నసుడి, ఈకాలమాకాల మనికాలము లందును చలామణి కాగలదు. పదిమందిలో భగవంతుడున్నాడురా! యని గ్రామీణ జీవనములో పెద్దలీనాటికిని వాకొనెడి నుడి వింటున్నాముకదా! పదిమందికిగల బుద్ధి ప్రేరణలన్నియు వ్యక్తి కర్మఫలముననుసరించియే జరుగుచుండును. పదిమందికి తెలిసిన యీ సత్యమును కాదనగలమా! పూర్వపుణ్యఫలావిర్భావ జీవునకు మాత్రమే యీ యానంద జీవితము లభించును. దీని నెవ్వరు కాదనలేరు.

నిత్యజీవిత విధానములలో రకరకములైన వ్యక్తులు రక రకములైన వారివారి సంస్కారములతో తిరుగుచుందురు. వంద లాది యకరములు భూవసతి యున్నను తినుటకు దిక్కులేని స్థితి యుండినను నావ్యక్తి నొక్కఘడియయు నూరుకొనకదేపనిగా తాపత్రయముతో కూటికి లేని నిరుపేదకన్న నెక్కువైన ఆవేద నతో బాధతో పరువులు దీయుచునే యుండును. ఎప్పటికప్పుడు దైవప్రేరణగా నింటి సమస్యలను చక్కబెట్టుకొను వ్యక్తికెట్టి తాపత్రయములేక హాయిగా నానందముగా నున్నంతలోనే కాల మును గడపుచు తృప్తిగా కులాసగా జీవితమును సాగించుచుం

డును వీరిర్వురిలో వందలాది యకరములున్న వ్యక్తికి శాంతి మెందు,

దేశకాల పాత్రోచిత న్యాయముగా ధర్మ స్వరూపము పరిణామములను పొందుచున్నది. ఆ కాలానుగుణ్యముగా నదియు న్యాయమే! తిరుణాళ్ల సమయములో ఆడమగ భేదము లేకనే సర్వులు వర్తించెదరు. కులమత వర్గభేదములు హెచ్చుతగ్గుల తారతమ్యములు లేకయే రాజూపేద లిర్వురు సమానరూపములో నాహార విహార వినోదములలో ప్రవర్తించెదరు. ఆ తిరుణాళ్ల ధర్మము ననుసరించిన యీ సంఘపు పెద్దలే పవిత్రాశయములలో దైవ దర్శనమునకై క్రమ శిక్షణతో నొకరివెంట నొకరు ఎంతో భయభక్తులతో మెల్లగా చీమల బారులవలె నడచుచుందురు. ఆలయాలలో 'హరహర మహదేవా! నరహరీ నారాయణ!' అని బిగ్గరగా భగవన్నామముల నుచ్చరించెడి భక్తకోటియే, మహాత్ములుండెడి పవిత్రాశ్రమాలలో కాలుపెట్టగనే మౌనముతో మహాత్ములు చెప్పెడి దైవసందేశములను స్థిరమతులై వినుచున్నారు. నేటికిని శ్రీవ్యాసాశ్రమము శ్రీ యరవిందాశ్రమము శ్రీ ప్రశాంతి నిలయము శ్రీ యోగానందాశ్రమాదులు దర్శించినచో ముముక్షువులకెల్లరకు స్థలమాహాత్మ్యములు నిలయములలో నివసించెడి పెద్దలైన వారి క్రమశిక్షణాత్మకమైన జీవితముల తీరు తెన్నులు యథాతథముగా గోచరములగును,

పూర్వ పుణ్య ఫలావిర్భావముతో నవతరించిన మహాత్ము

లెల్లరు పరిపక్వస్థితిని పొంది సదా ధ్యాన తపోజపాది సత్కర్మ లతో జీవిత ధ్యేయసిద్ధి స్వరూపులై ఆత్మాను సంధానపరులై శీతోష్ణ సితుఃఖాతీతులై బ్రహ్మనిష్ఠులై నిర్మల జ్ఞానసంపన్నులై నిర్వికార స్వరూపులై నిత్యతృప్తులై భాసిల్లుచుండురు. అట్టి తపస్సంపన్నులగు వీరి పరమపవిత్ర స్థానమును ప్రకృతిబద్ధు.. మాయామోహితులు లౌకికులైన నరులు వెళ్ళుము. నాత్మానంద ముతో పరమశాంతితో ప్రసన్న హృదయముతో బ్రహ్మవర్చ స్సుతో వెలింగెడి మహాత్ములను దర్శించి, సంసారసాగరతరంగ ములలోచిక్కి శాంతికి దూరమైన శాంతి కధినాయకులై లోకపు మర్యాదలకే మురిసిపోయిన నరులు "ఓహోహో ! పూర్వపుణ్య ఫలావిర్భావముతో నానందమయులై విలసిల్లెడి మహాత్ములువీరే! వీరిజీవితములలోని నిత్యసత్య శాంతాస్వరూప మిప్పుడే మనకవ గతమైనది, ఛీ ! ఛీ ! ఇంతవఱకు ధర్మ్యహర్మ్యములు శుద్ధాంత రాణివాసమందిర భోగవాంఛలే యానంద కందములని, ప్రశాంతి నిలయములని, స్వర్గసోపానములని భ్రమించి సంతసమందితిమే ! మహాత్ముల సన్నిధిలో మహనీయమైన యాత్మబోధలు వినుచు జీవితములను గడపుటయే యానందజీవితమని యీనాటికి పరమ సత్యమును గుర్తించితిమి. మెఱపుకాంతికన్న మిన్నయైన శరీర కాంతితో ముద్దుముచ్చటలతో కాలమునే మఱచి పోయెడిరీతి సరస సంభాషణములు సల్పెడి సతీసుతుల మమకారముతో మననిజాకార మైన యాత్మస్థితిని మఱచిపోయితిమి. ఏపూర్వపుణ్యవేళా ప్రభావ ముననో యిట్టి పవిత్రప్రశాంత వాతావరణమునకు నెలవైన స్థల

ములకు విచ్చేయునప్పటికి, సమయముమించినది. టాక్సీడ్రైవరు కోపగించునో ! వ్యాపారసంస్థలలో బాధ్యతలను సరిచేసుకోవలె నను నాందోళనయో ! పెండ్లియీడువచ్చినమ్మాయి సంబంధ మీరోజేవత్తురనియో ! ఇన్ కమ్‌టాక్స్ - సేల్స్‌టాక్స్ అధికారుల వాయిదా రోజీరోజే అనెడి భయాందోళనలతోనో, ఆహా! యెంత కాలానికి పవిత్రస్థలాలకు వచ్చితిమి ? స్వామీజీ బోధలు విను చుండ భాధలన్నియు సమసి, జీవునికర్తవ్య మాత్మదర్శనమే ఇంతకన్న వేరేమియు లేదని బోధపడుచున్నదే ! ఏమిచేయు దును మేడలున్నవి భూములున్నవి ద్రాక్షతోటలున్నవి దాసదాసీ జనులున్నారు కానీ. యుండుటకు విశ్రాంతిలేదే! పాపిష్ఠి సంసార ముతో నాజీవితకాలము ఓటికుండలోని నీరువలె దినదినమునకు వ్యర్థమగుచున్నది. షష్ఠిపూర్తి మహోత్సవము జరిగి పుష్కర కాలముదాటినది. తమరుచెప్పెడి యమృతోపమానమగు వైరాగ్య బోధలను విందమను నాసక్తియున్నది. బధిర మావహించినది. అంధత్వము దాపుననున్నది, జీర్ణశక్తిపోయినది. మువ్వురుకుమా రులలో విర్వురకు గట్టిగట్టి సంబంధములు చేసికొన్నాము. పెద్ద బ్బాయి కట్నాలపేచీతో కోర్టులో వాయిదాలు జరుగుచున్నది. ఒక అబ్బాయి డాక్టరుద్యోగము, ఒక అబ్బాయి లాయరుద్యో గము, మూడవ అబ్బాయి మాత్రము యమ్. ఏ. వరకు చదివి సరియైన ఉద్యోగము లభించక అశాంతితో తిరుగుచు కర్మ చాలక వాడొక లేడీని కాలేజిలో ప్రేమించి ఇంటిలో చెప్పకయే ఆలేడీతో కేడీగామారి 'మద్రాసు' చేరి సినిమాలో చేరాను నావాటాయాస్తినమ్మి

రొఖ్ఖము బంపండని మేమీ ప్రయాణసన్నాహములో నున్న తఱి మద్రాసునుండి పెద్దలేఖొకటి పంపెను స్వామీ ! ఎంత యుండిన నేమి ప్రయోజనము శాంతిలేదు సౌఖ్యములేదు మతిస్థిమితముఃలేక కుటుంబసహితముగా యాత్రను సంపూర్తిచేసి ఇంటి ప్రయాణములో నీ పవిత్రస్థలమైన యోగానందాశ్రమమునకు విచ్చేసితిమి. ప్రత్యేకముగా రావలయునను వాంఛయుండును. విశ్రాంతిమాత్రము చిక్కదుస్వామీ ! యని భక్తితో స్వామివారి పాదకమలములను కన్నులకు ముమ్మారద్దుకొని తన భార్య కన్నులకు తానే యద్ది, మూడవపిల్లవాడు త్వరలో నాపీడనుండి నివర్తి చెంది ఇల్లుచేరాలనెడి సంకల్పముతో లోలోన ప్రార్థించుచు, స్వామి దయయుంచండి. సెలవు. మా కర్మమింతే ! మాకుశాంతి విశ్రాంతి ప్రశాంతి చాలయరుదు. పూర్వపుణ్యఫలావిర్భావ జీవితము మాదికాదు, ముమ్మాటికి మీదే మీదే ! అనుచు నోపిక లేని వయస్సుతో నాశ్రమాలనువీడి కారులలో నశాంతికాస్థానములైన స్వగృహములకు చేరుచుందురు ? ఆనందజీవితోపాధికి నిలయము నేటిసాంసారిక జీవిత విధానమా? సాధుపుంగవు లుండెడి ఆశ్రమనిర్మలజీవిత విధానమా ? ఏదో మీరే గ్రహించి త్వరపడి తరించుటకు తగిన ప్రయత్నములో ప్రవేశించెడి మార్గమును నిర్ణయించుకొనుడు.

# అన్నిటియందు వెలింగెడి ఆత్మ ఒక్కటికదా?

పశుపక్ష్యాది జీవులన్నిటికి ఆహారనిద్రాభయమైథునము అనెడు, ఈ నాల్గు విషయములు సమానములేయైనను మానవుడే యుత్కృష్టుడు, తదితర ప్రాణికోటికి మానవునికి ఆత్మవిషయములో వ్యత్యాస మేమాత్రమునులేదు. సుఖదుఃఖాద్యవస్థలన్నింటిలో మానవునకెంత యధికారమున్నదో జీవులన్నిటికి నదేయధికారమున్నది. పూర్వమునం దాచరింపబడిన కర్మలనే యీ జన్మలలో ప్రారబ్ధకర్మఫలముగా ననుభవించు జ్ఞానము పశుపక్ష్యాది జీవులకు గలుగునేకాని, యాత్మవిచార జ్ఞానమెంతమాత్ర ముండజాలదు. "జ్ఞానాదేవతుకైవల్యమ్" అనెడి శ్రుతి జ్ఞానమే మోక్షసామ్రాజ్యమునకు సాధనమని ఘోషించుచున్నది. కాన జ్ఞానవిహీనులకు మోక్షము దుర్లభము. అద్దమునందెట్లు ముఖము ప్రత్యక్షమగునో యట్టిరీతి మనుష్యున కీలోకమునందే సాధనచతుష్టయ సంపత్తిద్వారా సద్గురు దివ్యకృపా ప్రసారముద్వారా సాక్షాత్కరించునని మన సంస్కృతి గోచరింపజేయుచున్నది.

అనేక జన్మసహస్ర పుణ్యార్జితంబయిన దీమానవదేహము. ఇట్టి దేహము మరల లభించుట దుర్లభము. మానవుడై జన్మించుటకీదేహధారి, యెనుబది మూడులక్షతొంబది తొమ్మిదివేల తొమ్మిదివందల తొంబది తొమ్మది యోనులయందు జన్మించి

జన్మించి ఎంతకాలమునకో ఎప్పటికోచెప్పలేము. అప్పటికి నీ మానవజన్మ లభించునని మన సంస్కృతి వెల్లడించుచున్నది. కొన్నియోనులయందు జన్మించియే ఈ దేహము జీవునకు లభించు చున్నది. వర్ణనలకందని మహావకాశము లభించిన మానవుడు, యాత్మదర్శనమును పొందుట కవకాశము గలిగియు, దినదినము క్షీణించు నాయుర్దాయముమాట పూర్తిగా మఱచి, యెంతోకాలము జీవించగలనని దైవదర్శనమును పొందెడి ప్రయత్నమున కిప్పు డేమి తొందరయని మందమతియై, కూపస్థమండూకమువలె సతము క్షుత్పిపాసలకే యారాటముచెందుచు దివినుండి భువికేగిన పనిని మఱచి తుచ్ఛభోగలాలసుడై కాలపువిలువను తెలియనిస్థి తిలో దుర్వ్యాపములతో దుర్వినియోగము చేయుచున్నాడు, రైలు వచ్చెడివేళకు కార్యస్థుడు వెళ్ళిన నాలస్యముచేసిన రైలెటు లాగదో ? జీవుని ప్రయాణములోపే, సకలకార్యములు చక్క బెట్టుకొనక షికారులు చేసినచో నా ప్రయాణమాగదు. ఈతాంత్రి కాలోచనల కన్నిటికి స్వస్తిచెప్పి చావవలసినదే! మనలో వెలింగెడి భగవంతుని దర్శించకముందే యకాలమృత్యు ముఖమునకు గుఱి యగుదుము.

అన్నిటియం దందరియందున్న యా చైతన్యమైన యాత్మ స్వరూపమొక్కటియే! యాకాశమునుండి జారిన వర్షబిందువుల గుణ స్వరూపమైఖ రొక్కటియైనప్పటికి భూవాసనాసంపర్కముచే వర్షపునీటి సహజగుణమును గోల్పోయి భూగంధ సంబంధ ప్రభా వములో చప్పగానో ఉప్పగానో తియ్యగానో జలగుణము మారు

చుండును. ఇదే విధముగా ఆత్మగుణ స్వరూపమొక్కటిగానే భాసించినను, జీవిపాపపుణ్యముల కనుగుణముగా నాత్మవికాసము మరుగై దుష్టరూపముగా భాసించి దుర్మార్గ మార్గములో పయ నముచేయుచుండును.

సీత సావిత్రి అనసూయ అరుంధతి మొదలైన భారతనారీ మణుల హృదయ కుహరములలోను, జ్యోతిలక్ష్మి - సూర్య కాంతము మొదలైన సినిమా తారలలోను, భర్తమాటలను నిర సించి వారినోటికి తాళములువేసి భయముభక్తి సిగ్గులజ్జ బిడియము మానమర్యాదలన్నియు దిగవిడచి లెక్కచేయక విచ్చలవిడిగా నీచస్థలాదులకేదో నెపముతోచేరి మకాములుచేసి కామోపభోగము లందున యిష్టములేకున్నను ధనాపేక్షకే లొంగి శ్వానములకన్న హీనముగా వర్తించి సంఘమునకు చీడపురుగులు వంశవృక్ష ముల కగ్నిగుండములైన గ్రామవేశ్యల హృదయములలోను, ఆత్మ ఒకేరూపముగ భాసించుచున్నది. సీత మొదలైన భారత నారీమణుల హృదయాలలో పవిత్రతత్త్వముతోనున్న యాత్మ, యా నీచురాండ్ర హృదయములలో నెందులకీ విపరీత ధారుణ ప్రవర్తనకు గుఱియైనదో? పాఠకమహాశయులైన సోదరమానవ సంఘమునకు, రచయిత యగు గుప్త గుప్తమైన విషయములను విజ్ఞప్తి చేయుచున్నాడు మనసుంచి చదువుడు.

ఉత్తమ ప్రవర్తనమునకు నీచప్రవర్తనమునకు సర్వదేహ సమవర్తియైన యాత్మ కారణముకానేకాదు. వృశ్చిక సర్పాదుల

యందును సింహశార్దూల భల్లూకాది క్రూరమృగములందును, మరాళ మయూర శుకాదులందును, నహరహము నరచెడి గార్ధభ వాయసములందును, భక్తవత్సులైన శ్రీ ప్రహ్లాద నారద పరాశర పుండరీక వ్యాసయంబరీష శుక శౌనకాదులందును, దుర్మార్గులైన శ్రీరావణ కుంభకర్ణ బకాసుర కీచక శిశుపాల దంతవక్త్రి హిరణ్యాక్ష హిరణ్యకశ్యప శకుని దుర్యోధన దుశ్శాసనసైంధవాది కౌరవులలోను తదితర దుష్టశిష్ట దేహాదులన్నింటిలోను 'దేహి' యైన యాత్మయొక్కటియే ! యెవ్వరు కాదనరు.

ప్రాణములపై నాశపీడినట్టి తుదిఘడియలలో నున్నవ్యక్తికి గరళమును మ్రింగించినచో బ్రతికి కడుబాగుపడిన వారెందఱినో మనము ప్రత్యక్షముగా చూచియున్నాముగదా ! చావనున్న వ్యక్తిని బ్రతికించెనీగరళము మహాశక్తి వంతమైన దని, యాగరళమునే యారోగ్యము గా నున్న వ్యక్తిచే పానము చేయించినచో వాడు కేకలతో నెగిరిపడి ప్రాణములను గోల్పోవును ఇట్లు మరణించిన వారిని మనమెల్లరము ప్రత్యక్షముగా చూచి యున్నాము గాదా!

సమయ మెఱిగి మందును వాడి నప్పుడే సర్వశుభ ప్రదము లేనిచో కీడే సంభవించును. కామవాంఛలలో మునిగి తేలెడి కామంధునకు గాని, కాకిక మాయలతో స్వార్ధ దాహపీడితుడై సంఘమును సమయము చూచి కబళించుటకై కాచుకొని యుండెడి దుష్టాత్మునకు గాని 'ఏదిసత్యము!' లోని ఏ వ్యాసమునైన

వినిపించినచో వినలేక తన దుష్టకర్మల ఫలితము తప్పదా? యేమి యనెడి ఆందోళనతో తక్షణమే ఆ చోటు వీడితరలిపోవునుగాదా!

ఆత్మ మన యందున్నదిలే! యే పని చేసిన నాత్మయేకదా! మనకు దోషము లేదు. కందలు అందలు ప్రభుత్వములో పలుక బడి కల రోజులలో పాపములేదు ప్రాయశ్చిత్తములేదు. బందలపై చేరి కైపుతో మనము చేసిన తప్పులన్నిటిని పదిమందిలో చెప్పి నను మనకు భయము లేదురా! యనెడి వ్యక్తుల హృదయములలో నున్న యాత్మ వినుచునే యున్నది. విన్నను, నెందుల కాకారు కూతలు కూసెదవురాయని హెచ్చరించదు. తప్పేదో యొప్పేదో జీవున కేనాడో తెలియును. మంచిచెడ్డలను గుర్తించి వర్తించెడి విషయపరిశీలనాజ్ఞానము సర్వమానవుల కా పరమేశ్వరుడే ప్రసా దించెను కదా!

కారుకూతలకు దుష్టకార్యముల ప్రేరణకు 'ఆత్మకారణము కాదని ప్రత్యేకముగా ప్రతివ్యక్తి గుర్తించవలెను. సర్వకర్మప్రేర ణలకు కారణము మనస్సే! మనస్సు ప్రేరణకర్త! బుద్ధి కార్య కర్త! ఆత్మ సర్వహృదయాంతరములయందు సదా వెలుంగుచు మనః ప్రేరణతో బుద్ధిచేసెడి పాపపుణ్య కార్యములను ఔననక - కాదనక ఆయాత్మే సచ్చిదానందమై సాక్షిభూతమై వెలుంగుచుం డును. కొండగుహలో నేకాంతముగా కూర్చొని సంకల్పము చేసిన ప్రతిచిన్న విషయమును వదలక కదలక ఆత్మతెలిసికొని సమయము వచ్చినప్పుడా పరమాత్ముని సన్నిధిలో జీవి చేసిమర

చిన మంచిచెడు కార్యములన్నియు - నేటియుగములో టేపురికార్డు వలె తప్పక మధ్యమధ్య నే యంతరాయములు లేక యధాతధ ముగా నొక్కి వక్కాణించును. ఆత్మచెప్పిన సాక్ష్యము ఆధార ముగా యమధర్మరాజు సర్వజీవులను నరకయాతనలకు గురి చేయును.

ఆత్మ సదా సాక్షియై సర్వమును తెలిసికొనుచునే యుండును. మనస్సే, చాలపాపిష్ఠిదై కూయరాని కూతలు గూయుచు, న్యాయముతో సత్యముతో జీవనము చేసెడి యుత్త ములతో వాగ్వాదములు పెట్టుకొని 'నీవేకులటవు నీవేదొంగవు'. లోకుల సొమ్ము నన్యాయముగా కాజేయుచున్నావనుచు కొండ కేకలు వేయును. ఈ పాపిష్ఠి హృదయము గలిగిన వ్యక్తి తన మనస్సునందు నేకులటను దొంగను, నాతోడి యాడది అది మాత్రము కులటగాక దొంగగాక మంచిదౌనా! షోకుగా హాయిగా సరదాగా నేనున్నాను. నాకంటె నెన్నోరెట్లందమును గలిగి యున్నది. ఇదిమాత్రము తక్కువదా! యనెడి నీచప్రవృత్తితో తనకంటికి గోచరించెడి ప్రతిప్రాణిని తన నీచప్రవృత్తికి ముడి వేసికొని అందరునింతే నా పనికి తప్పేమి? నాకన్న వీరెంతో తక్కువస్థితితో మెలగుచున్నారు, హాయి ఆనందముగా నీకామ పురోజులలో - కాఫీవుప్మా ఫలహారములతో రాజభోజనముల సంసారమును సాగించుచున్నానని విఱ్ఱవీగుచుండును. ఈ సంవ త్సరము కృషిచేసి పండించిన పంటను మనమీ సంవత్సరములో ననుభవించుటకు వీలుపడదు. మరుసటి సంవత్సరములో ననుభ

వించగలము. గత సంవత్సరములో పండించిన పంటను హాయిగా తినుచు కృషిచేయుచున్నాము. పాప పుణ్యకర్మల ఫల భోగ ప్రాప్తియునింతే! పాపము పదేండ్లకునా!' యనెడి సామెతగా వ్యక్తి కుటిలాలోచనలకు క్రూరపు కర్మలకు గతమున చేసిన పాపములకు తగినరీతిగా నా లోకేశ్వరుడు బాగుగా యోచించి, పాపికి కుటుంబ కలహములో కోర్టు వ్యవహారములో గ్రామములో నాయకత్వములతోనో అర్థముగాని రోగాలు తన భార్య బిడ్డలకు సంప్రాప్తమగుటచేతనో, గాలి దయ్యాల యనుమానముతో నిల్లు ఒళ్ళుగుల్లయి ధనమంతయు నాశనమై దివాలా దీయుట చేతనో, పోషించి రక్షించేవా డకాల మరణమును పొందుట చేతనో, విద్యార్జనము చేసియు నుద్యోగార్హత గలిగియు పనికి మాలినవాడుగా రూపొందుటయో? ఇట్టిసంఘటనలకు లోనై వ్యక్తి తారుమారగుచుండును.

"తాను దొంగైన తన పొరుగును నమ్మదురా!" 'లంజను కదిలిస్తే దొబ్బులకు కొదువా?' యనెడి సామెతలు చెప్పుటకు వినుటకెంతో వెగటుగా కటువుగా కనుపించుచున్నవి కాని, వాని నెంతో లోకానుభవమును పొందిన మహాకవులు చెప్పిన దివ్య సూక్తులని మరువరాదు. వారు పాపము చేయుటలేదా? వార న్యాయము చేయుటలేదా? వారికేమి లోటనెడి మూర్ఖవాదముతో నీవు నాశనము చెందకుము. చేదు విత్తనములు నాటి నీరుచల్లి బాగాపోషించి పండించి యనుభవించుదమను నాశతో నా ఫలము లను భక్షించగలవా? ఒకవేళ, నా పోషణలో పండినపంట నేననుభ

వించక, ఎవ్వరనుభవించెదరను నజ్ఞానముతో భక్షించుటకారం భించితివా - నోరు విషమై నీవు తిందునని ప్రేమించిన యా చేదుకాయతోసహా, అంతకు ముందు తిన్న మధురపదార్థము లన్నియు వాంతిచేసికొందువు. ఇదే విధముగా నెట్టి వ్యక్తియైన నన్యాయాక్రమదౌర్జన్యములతో నార్జించిన మధురపదార్థము లన్నియు సక్రమముగా జీర్ణము కానేరవు. మూర్ఖులైన మానవు లార్జించు సమయములందున దయాదాక్షిణ్యాదులు, పాప పుణ్య వివరములు అక్రమాక్రమములు గౌరవమర్యాదలు నేవియు చూడ కనే పాపపు ధనమును పోగుచేసి కాలమును హాయిగా గడుప నెంచును. కానీ! వానికది సాధ్యముకాదు. వానికేవో యవాంతర పరిస్థితులు తటస్థమై పాపపు ధనమున్నవరకు మటుమాయమగును. అన్యాయమగ్నిజ్వాల కన్న భీకరమైనది, అసత్య మశనిపాతము కన్న శక్తివంతమైనది. ఇట్టి క్రూరకర్మల పరిణామ పరిస్థితులకు లొంగి వంగి క్రుంగి తిరిగెడి దుర్మార్గుల హృదయములలో నాత్మ సాక్షిమాత్రముగానే యుండును. నేనున్న యింటిలో నద్దెకున్న జీవునిగతి యిట్లయోమయముగా నధోగతిగా తారుమారైపోయెనే! అనెడి జాలితో, నాయాత్మయే, జీవులకు సద్గతికై ప్రబోధముచేసి సవ్యమార్గములో నడిపించి యానందమయులై నన్ను దర్శించెడి యోగ్యత కల్పించాలను ధ్యేయముతో, "నాధ్యాత్మిక చింతనతో స్వార్థరహితముగా జీవన విధానమును తీర్చి దిద్దెడి భారమా భగ వానునిదే!" యని నమ్మి భజించెడి కవిపుంగవుల హృదయము లలో ప్రేరణ గలిగించి సత్య రచనలను సాగించుచుండును. సత్య

రచన సక్రమ రూపములో విషయ నిర్ణయ లోపములేక సాగి పోవలెనని న కవికి సాధ్యముకాదు. కవి నమ్మిభజించెడి యుపాస్య దైవప్రేరణా ప్రభావముచేతనే సిద్ధింపగలదు.

---

౧౪

## మానవుని ప్రధాన కర్తవ్యమేది?

అనుట వినుట తినుట నిద్రించుట సంతానమును కనుట, మ్రింగుట కార్జించుట. ఆర్జన కన్యాయములు చేయుట, దాని ప్రతి ఫలమనుభవించుట, రాగ భోగ రోగములతో కాలమును వృథ చేయుట, ఏకొద్దికాలమొ విశ్రాంతి లభించినచో పనిలేని సోమ రులతో కలసి పేకాటలాడుటయో. కల్లబొల్లి కబుర్లతో రచ్చబండ లపై చేరి మెట్టవేదాంతములు చెప్పుటయో, కష్టపడి పనిచేయలేక చేసినవారి కాసులకాసించుటయో, నడివయస్సులో నున్నాము కాలము చాలాయున్నది, వేదాంత గ్రంథములతో నేమిపని, వార పత్రికలే పరిశీలించుదము. సినిమా స్టోరీలనే పారాయణము చేయు దము, వయసు పోకమునుపే జీర్ణశక్తి తగ్గకముందే మత్తుపదార్థ ములను తుష్టిగా పుష్టిగా సేవించుదమనుటయో! మొదలైన వాంఛ లకు బానిసమై బ్రతుకుట పాడియా? స్వప్నతుల్యమై నిస్సారమై యనిత్యమై సదా పరిణామాత్మకమై భ్రాంతి జన్యమైన సజగ

త్తును నమ్మి చరించుటయేనా! మానవుని ప్రధానకర్తవ్యము, భగవానుని వారసుడవై భారతాంబ ముద్దుబిడ్డడవై హైందవ సంస్కారముతో నభివృద్ధి పొంది విజ్ఞానమయమైన భరతఖండమునందు నివసించెడి నీ కర్తవ్యమేదో ఇప్పటికైన గుర్తించితివో? లేదో?

ప్రపంచ వస్తువుల యందు సుఖమనునది ముమ్మాటికి లేదు. సుఖమున్న దనుకొనుట మానవుల అవివేకము. నిత్యశుద్ధమైన సుఖము తనలోనే తన యాత్మస్వరూపమందే యున్నది. బాహ్యరూపమున కతీతముగా నాత్మ సుఖమున్నది. తెట్టెయందు తేనెను పురుగులు మరుగుపరచి నా తేనెనాసించి ప్రయత్నము చేయబోయిన మానవుని వదలక పురుగులన్నియు నొక్కుమ్మడిగాలేచి పొడువనారంభించును. తేనెను కాంక్షించిన మానవుడా పురుగులబాధను నిరోధించి తెట్టెయందున్న తేనెను గ్రహించి తెట్టెను వదలివ తీరుగనే. దేహాలయము నందున్న ఆత్మజ్యోతిని దర్శించవలెనను నూహగలవ్యక్తి ముందుగా దేహవాసనలను పూర్తిగా త్యజించి దేహాలయమునందున్న ఆత్మవస్తువును దర్శించవలెను. తెట్టెనంటియున్న పురుగులవలె సంసార బాధ్యతలు మానవుని వేధించుటకు మొదలిడును. తేనె నాసించిన మానవుడు వేపమండల సహాయముతో పురుగుల బాధను నిరోధించు రీతి, ముముక్షువైన నీ మానవుడు నాత్మానందమనెడి తేనెను పొందులోపే తన్ను చుట్టుకొని వేధించెడి వివిధ రూపములైన బాధ్యతలనన్నింటిని భగవంతుని యందుగల ప్రగాఢమైన భక్తి జ్ఞాన

విశ్వాసములనెడి పరికరములతో నిరోధించి నాత్మసాక్షాత్కారమును పొందవలెను.

అట్టి యాత్మసుఖమునకై రోజునకొక్క ఘడియకాలము నైన వినియోగించుచున్నారా? సోదరులారా! నిజమును యోచింపుడు, ధనధాన్యదారా సుతాది బంధు జాలమంతయు జారిపోయినను ప్రయత్నముతో పొందెడు నవకాశము మానవునకున్నది. అమూల్యమైన కాలము వృథచేసిన, పోయినకాలము తిరిగి లభించునా?

'కాలాయ విష్ణురూపాయ'. కాలమే భగవంతుని స్వరూపము, రవిశశి తారకాది గ్రహములన్నియు కాలనియమమునే పాటించుచున్నవి. మహర్షులైనను కాలనియ మోల్లంఘనమున కోర్వక ప్రకృతి స్థితిమారినప్పటికి సమయ భంగమును చెందనీయక క్రమశిక్షణముతో నిత్యకృత్యములైన స్నాన సంధ్య జప ధ్యాన తపాదులన్నియు యథావిధిగా నిర్వహించుచుందురు. బ్రహ్మవిచారము వేదపఠనము ఆత్మ నిష్ఠాదులతో కామక్రోధాది సకల వృత్తులను సుఖదుఃఖాది ద్వంద్వములను నశింపచేసిన వారైయజ్ఞానము నతిక్రమించి స్వస్వరూప చిదాకాశ పరబ్రహ్మమునందుచేరి యానందముతో విహరించుచున్నారు. ఇట్టి నిజమైన గట్టిస్థితి గ్రంథములు పారాయణముచేసి భజనలు చేసినను లభించునదికాదు, తీవ్రవైరాగ్యము సర్వసంగపరిత్యాగము నేకాంత వాసములతో యోగనిష్ఠా గరిష్ఠాత్ములైన సద్గురు స్వాములకే గద లభ్య

మగును. నీ గ్రంథ రచయిత సద్గురు శ్రీయోగానంద నరసింహ యోగి వర్యుల స్వానుభవ దివ్య సందేశమును వినుటచేతను వారి దివ్యాశీర్వాద మహాప్రసాదఫలముచేతను శ్రోతల కాత్మ నిస్తారహస్యాదులను ఏది సత్యము? ద్వారా వ్యక్తము చేయగల్గెను. సద్గురువుల కరుణాప్రసార శక్తి కసాధ్యములైనవి. ఎందును గానరావు. స్వానుభవపరులకే నా శక్తి వ్యక్తమగును.

మానవుని కర్తవ్యము తనకు తెలియక పోయినను, సద్గురువుల కరుణా ప్రబోధములచేతను మహాత్ముల మహోపన్యాసాదుల చేతను సద్గ్రంథ పారాయణము చేతను, మానవునిలో నిద్రాణమైన శక్తి జాగృతిని పొంది సత్యమైన భగవానునిలో తాదాత్మ్యము చెందెడి మార్గము ప్రతిమానవుడును తెలిసికొనవచ్చును. ఇందుకెట్టి సందేహములేదు. తెలిసికొనినంత మాత్రమున తాత్కాలిక తృప్తి తనకు సంఘ గౌరవమర్యాదలు లభించునే కాని గమ్యమును పొందజాలడు.

కాశీకివెళ్ళి శ్రీ విశ్వనాథుని దివ్య సందర్శనభాగ్యమును పొందవలెనని తనకు వాంఛ కల్గినచో, కాశీకి వెళ్ళెడి మార్గములు వసతి సౌకర్యములు కాశీపట్టణము విశ్వనాథు నాలయ దృశ్యములు గలిగిన పటమును పదేపదే పరికించినను, "కాశీ కాశీ కాశీ" యని నిలయమునందు కూర్చొని పఠించినను, అసలైన శ్రీ కాశీ విశ్వనాథుని దివ్యరూప సాక్షాత్కారా నందాను భూతినెట్లు ప్రత్యక్షముగా ననుభవించలేడో! అదేరీతి, వేదాంత గ్రంథముల సమీక్షలుచేయుచు

భగవంతుని గూర్చి పుష్కరము లాదిగా వాగ్వాదములతో తర్క శాస్త్ర ప్రజ్ఞాప్రాభవములతో కాలము వ్యర్థము చేయుచు, ననంత కోటి గ్రంథముల పారాయణము సల్పి అందందుగల ముఖ్యాంశములను కంఠస్థముచేసి సమయస్ఫూర్తిగా నాయా శ్లోకాదులను వల్లించి పరులకాశ్చర్యమును కల్గించినను నాత్మ తత్త్వదర్శనమును పొందనేరడు. ఐనను మానవుని ప్రధాన కర్తవ్యము తెలిసికొనగల్గును. ఎన్ని జన్మములకైనను తెలిసికొని ఆచరణాత్మకమైన జీవితమును సాగించిననాడే తన కర్తవ్య సిద్ధి చేకూరగలదు.

తెలియని స్థితిలో నుండిన వ్యక్తి సోపానమార్గముద్వారా పురోగతిని చెందగల్గును సత్సంగము సద్గ్రంథపఠనము సద్గురు సన్నిధి సదాయాత్మ విచారము ప్రకృతి సుఖములపై విరక్తి మొదలైన విధానములే సోపానములు. వారివారి పూర్వ పుణ్య సంస్కారాను బంధముగా వ్యక్తి త్వరలో ప్రయత్నమునకు పూనుకొనును, వ్యక్తి ప్రయత్నమొక్కటి మాత్రమే చాలదు. ప్రయత్నమునకు దగిన యాసక్తి ధీరత్వము త్యాగము వైరాగ్యము పట్టుదల సహనము ఓర్పు శాంతము సత్యము భక్తి విశ్వాసములున్నప్పుడే మానవుని ధ్యేయము సిద్ధించును. లేనిచో ప్రయత్నముతోనే అనేక జన్మలెత్తవలసిన స్థితి యేర్పడును. ప్రాకృత వాసనాబద్ధులైన జీవులు నైతము పైన చెప్పిన కర్తవ్య కర్మలను దీక్షతో నిర్వర్తించిననాడు క్రమముగా మెల్లగా చల్లగా సావధానముగా ఆ పరతత్త్వమైన యాత్మసాక్షాత్కారమును పొందును. ఆత్మసాక్షాత్కారమును పొందుటయే మానవుని ప్రధానకర్తవ్యము.

నీ కర్తవ్యము వ్యక్తియొక్క మంద సామాన్య తీవ్ర వైరాగ్య ప్రయత్నములద్వారా ఈ జన్మలోనో మరుజన్మలోనో లేక అనేక జన్మలలోనో సంపూర్తియగును.

అక్షరములు దిద్దుటకే యభ్యాసముకాని బాలవిద్యార్థి అమర కోశమును క[illegible]మెట్లు సాధ్యపడదో యట్లే, మానవుడుగానే బ్రతుకుటకు సాధ్యముకాని వానికి దేవత్వమెట్లు సిద్ధించగలదు?

మానవునకు - మాధవునకు మధ్య సప్తసోపానము లున్నవని శ్రీయోగానంద నరసింహ స్వామివారు ఈ గ్రంథ రచయితకు చెప్పెడివారు. ఆ మహనీయమూర్తి ఆత్మబోధ సారాంశమే ఈ ఏది సత్య గ్రంథరాజము. నేటి కవిలో మెలగెడి మానవుడు ప్రథమ సోపానమును దాటుటకే ప్రయత్నము చేయుటలేదు. ప్రథమసోపానమును దాటుటకు తగిన విధివిధానములు మన మహాత్మాగాంధీగారు శ్రీ ఏసుక్రీస్తు ప్రభువు శ్రీ మహమ్మదుగారు శ్రీ బుద్ధదేవుడు మొదలైన మహావ్యక్తులు ప్రబోధముచేసి వారి జీవితములను చాలించిరి.

ప్రథమసోపానములోని ధర్మసూత్రములే ప్రారంభదశయందున్న విద్యార్థులెల్లరకు నానాటి యధ్యాపకులు గ్రామ పాఠశాలలయందు నాలుగు గోడలపై పెద్దపెద్ద అక్షరములతో వ్రాసియుంచెదరు. ఆ నీతి సూత్రములను పాటించిన భారతీయ విద్యార్థులైన శ్రీ మహాత్మాగాంధీగారు శ్రీ రామకృష్ణ పరమహంసలవారు శ్రీ వివేకానందస్వామివారు శ్రీ రామతీర్థస్వామి మొదలైన పెద్ద

లెందరో యున్నారు. ఆ పెద్దలు మూలసూత్రాదుల నెన్నింటినో వారి నిత్యజీవిత విధులలో నాచరించి లోకమునకు పూజ్యులై ఎన్నింటినో సంఘపురోగతికై జీవుల జ్ఞానమను నిద్రనుండి జాగృతిని పొంది చైతన్యవంతులై విరాజిల్లుట కిట్లాదేశించిరి. వారి జాగృతి బోధలను వినండి. ఇంతటనైన పెదవాదనలకు తిలోదకములిచ్చి తరించుటకై ప్రయత్నము చేయండి

మాతాపిత్రాచార్య దైవముల సన్నిధిన వినయవివేక సౌజన్యాది గుణములతో మెలగుచు, భయభక్తి ప్రేమాదులతో సేవలు చేయుచు వారి యాజ్ఞలను సర్వవేళల శిరసావహించుచు, ప్రాణాంతక సమయములందైన నసత్యములను పలుకక తామసాదిగుణములను నిశ్శేషముగా త్యజించి పరులసొమ్మును మట్టిగడ్డలవలె భావించి వానినాశించక, పరకాంతలను సర్వవేళలయందును తన కన్నతల్లివలె పూజ్యభావముతో దర్శించుచు, తనకున్నంతలో శక్తివంచనలేని దానములు చేయుచు స్వమతదురభిమానమును పరమతద్వేషమును వీడి, మతములన్నియు మార్గములు, పొందునది నిత్యానందస్థితి ఒక్కటియే యనెడి సర్వసమత్వ భావమునుపొంది సదా ఆత్మవిచారమునే చేయుచు ఐహికవిచారములను రూపుమాపి, మన బ్రతుకు జలబుద్బుదముకన్న క్షణికమైనది. వాయు సంచలిత దీపమును బోలియున్నదని గుర్తించి, నిత్యానిత్యవస్తు వివేక జ్ఞానమును సద్గురువుల కృపతో నెరిగినవాడై . రేపుమాపని అంచనాలు వేయుటమాని ఆలస్యముచేయక, జీవితోద్ధరణకై యహరహము కృషిసల్పుము. ప్రతిరోజు బ్రాహ్మీముహూర్త

మున లేచి, కాలకృత్యాదులు నిర్వర్తించి స్నానమాచరించి యే కాంతమందిరమున దేవునియెదుట తనకున్న సంస్కారమునకు తగిన యాసనము వేసికొని సద్గురు మంత్రమును పఠించి భగ వద్దర్శనమును పొందవలయుననెడి తీవ్రేచ్ఛతో నావేదనతో మంత్రపఠనముగాని నామధ్యానముగాని త్రికరణములను సమీ కరణ మొనర్చి సూర్యోదయమువరకైనను ధ్యాననిష్ఠ యందుండి తీరవలయును.

గతచిన రోజులలో తెలిసీతెలియని మిత్రత్వముతోగాని నీ స్వబుద్ధి ప్రేరణతోగాని యలవాటైన దుర్గుణములను పూర్తిగా త్యజించవలెను. లేనిచో ప్రారంభకుడైన సాధకభక్తుని ధ్యాన నిష్ఠ సఫలముకానేరదు. ఆత్మదర్శనమును కాంక్షించెడి ముము క్షువు నింటబయట నపశబ్దములను నసత్యములను వర్జించి, తప్పనిస్థితిలో సంభాషణము లతి క్లుప్తములో ముగించి మౌన ముగానుండి మనస్సును బాహ్య విషయలంపటమున జారనీక కనుబొమలమధ్యనే లగ్నముచేసి యిష్టదైవ స్వరూపమునే సృష్టిం చుకొని దర్శించుచు మనోమారుతముల నొకటిగా బంధించి అజప గాయత్రినే జపించుచుండును. ఇదియే యాత్మానందమునకు త్రోవ! ఇదియే ! ప్రథమసోపాన విధానము. ఇదియే ! మానవుని ప్రధాన కర్తవ్యము. మిగలినసోపానములను పొందెడివిధానము గ్రంథ పఠనములవలన లభ్యమయ్యెడిదికాదు. కొన్ని యోగశాస్త్రము లలో చదువవచ్చునుగాని ప్రయోజనమును పొందుట దుర్లభమ నియే నీవచయుత భావన! తదితర సోపాన పురోగతిని కాంక్షించిన

ముముక్షువులు, తత్త్వవేత్తలు, యోగానుభవమూర్తులై సద్గురువుల దివ్యపాదసన్నిధికిచేరి భయభక్తులతో వినయవివేకాది గుణసహితులై మెలగుచు కాచుకొని వారిసేవలుచేసినట్టి పుణ్యమూర్తులకు మాత్రమే, యా సద్గురువులు కరుణాళువులై స్వానుభవైకవేద్యములైన యోగరహస్యములను కరతలామలకముచేసెదరు. ఇట్టిస్థితి మాటలతో లభించునదికాదు. బహుజన్మ పుణ్యఫల సంస్కారమున లభ్యముకాగలదు. ఆ పుణ్యఫలమే అట్టి సద్గురు కృపకుపాత్రునిచేయగలదు. మహత్తర పుణ్యఫలముతో జన్మించిన జీవునకు మాత్రము గురువు నిమిత్తమాత్రముగా సూక్ష్మాంశమునే బోధించును. ఆ జీవుని యపారపుణ్యఫల ప్రభావముచేత గురువుకు మించిన శిష్యుడై యాదర్శమూర్తియై వెలుగొందును. నేటి యీ కలికాలములో నాదర్శమూర్తియై గోదావరీమండలములో 'ముమ్మిడివరము' గ్రామమున మహామౌన సమాధిలోనున్న మన బాలయోగి భవ్యచరిత్ర యెల్లరకు తెలిసినదేకదా! శ్రీ బాలయోగి గారి స్థితియే మానవుని ప్రధానకర్తవ్యము – అని పేర్కొనదగి యున్నది. ఇట్టివారు భారతదేశమున నెందరో యనాదికాలము నుండి నేటికాలమువరకు నవతరించుచునేయున్నారు. దీనినే మౌన సమాధి, యోగసమాధి, యనియు పేర్కొనుచుందురు 'చేసికొన్న వానికి చేసికొన్నంత మహదేవా' యనెడి సామెత ననుసరించియే యిట్టి సుకృతము లభించును.

# నాదానుసంధానమే
# మనసుకుదురటకు మూలమా?

నిత్యమై శుద్ధమైముక్తమై యేకమై యఖండమై యానందమై యద్వయమై సత్యమై జ్ఞానమై అవ్యయమై యనంతమై యేస్వరూపముకలదో అట్టి పరబ్రహ్మమే తన యాత్మగా భావించవలెను. అట్టి యాత్మయందు మనస్సును లగ్నముచేయుటకు సుళువైన మార్గము నాదానుసంధానమే! నాద స్వరూపుడైన పరమేశ్వరుడు గాన లోలుడు. గానము మనస్సును లగ్నము చేసి నిలకడచేసి సమాధికి గొంపోవు సులభమార్గము. చతుష్షష్ఠికళలలో పరమోత్కృష్టమైన సంగీతము ప్రతివ్యక్తియు నవశ్యముగా ననుసరించి నాచరింపదగినదే! శ్రీ త్యాగరాజ స్వామివారు చెప్పినదియు ఇదే! నాదలోలుడవై బ్రహ్మానందమందవే! మనసా!

శ్లో॥ సంగీత మపిసాహిత్యం - సరస్వత్యాః స్తనద్వయమ్।
ఏకమాపాత మధురం - అన్యదాలోచ నామృతమ్॥

లోకమాతయగు శ్రీ సరస్వతీదేవి సంగీత సాహిత్యములను తన పాలిండ్లద్వారా అమృతరూపమగు స్తన్యము నొసంగి సర్వజనుల కానందమును చేకూర్చుచున్నది, "శిశు ర్వేత్తి పశు ర్వేత్తి వేత్తిగానరసం ఫణిః" శిశువులు పశువులు పాములు, సహితము సంగీతములకు పరవశమై లోబడుచున్నవే!

ఉత్తమ సంస్కార విశిష్టులైన కొందరికి సంగీత కళోపాసన, యోగసాధనగా పరిణమించి జన్మరాహిత్యమునకు దోహదకారి కాగలదు. సంగీతోపాసనచే తరించిన మహనీయులు నేటికి మనకు పూజనీయులే!

కృతయుగమునందు శ్రీమన్నారాయణుని దివ్యమధుర నామమును సంగీతముతో సమ్మేళనము చేసి శరీరస్మృతివీడి గానము చేయుచు నృత్యముచేయుచు తరించిన మహాభక్త శిఖామణి మన బాల భక్త ప్రహ్లాదమూర్తియే! కఠిన శిక్షలకు గురియైనను శ్రీ దేవుదేవుడైన నారాయణుని నామ స్మరణమును విస్మరించక సంస్మరించి ధన్యుడయ్యెను.

త్రేతాయుగమునందు వానర సంఘమునకు చెందియు కోతిగుణములను రూపుమాపి యఖండ బ్రహ్మ చర్య దీక్షాకంకణ ధారియై నవవ్యాకరణ వేత్తయై శ్రీరామ చంద్రుని దివ్యనామ స్మరణము నహరహము జపించుచు 'శ్రీరామ జయరామ - జయ జయ రామ' 'ఓరామ ఓరామ - ఓంకారరామా!' యనెడి మధుర నామ భజనతో సంగీత దివ్య సుధామృత పానముతో దివ్యానందానుభూతిని పొందుటయేగాక జగన్మోహనమూర్తి యగు సుగుణాభిరాముని శ్రీరామ భగవానుని యఖండ కృపకు పాత్రుడైన మహాభక్త మూర్తియగు శ్రీయాంజనేయస్వామియే! యని లోకముచే కొనియాడ బడెను.

ద్వాపర యుగమునందు తపసి వేషముతో దివ్యయోగా

నుభవ మూర్తులై సర్వ లోకాలను "నేటి యాధునిక యంత్ర యుగములోని రాకెట్టువలె" క్షణములో సంచరించెడి శక్తి సంపన్నులై నిరంతర భగవధ్యాన పరాయణులై యా గోవిందుని యవ్యాజ కరుణా కటాక్ష వీక్షణ ప్రసారమునకు పాత్రుడైన శ్రీ నారదముని పుంగవులు వీణను మీటుచు వైకుంఠుని నామగానము చేయుచు సంగీత సుధాపానముతో జన్మరాహిత్యమును పొందిరి.

ప్రాచీన కాలమునుండి నేటివరకు పరిశీలించినచో నిరంతర భగవద్ధ్యాన పరాయణులగు శ్రీ నారదాదిముని పుంగవులేగాక, కలియుగములోను గీత గోవిందాది మహా కావ్యకర్తగు శ్రీ జయదేవకవియేమి శ్రీకృష్ణ లీలాతరంగిణ్యాది కర్తలగు శ్రీ నారాయణ తీర్థులేమి, శ్రీ వేంకటేశ్వరుని భక్తుడై వేలకొలది సంకీర్తనలు రచించిన శ్రీ యన్నమాచార్యులేమి, స్వరావళి, అలంకార, గీత, రాయ, ప్రబంధయుగాభోగ, సూళాదులేగాక లక్షలకొలది దేవరనామములు రచించిన శ్రీ పురందర దాసుగారు, భక్తిశృంగార రసప్రధానమైన పద సహస్రములు రచించిన శ్రీ క్షేత్రయ్యగారు, వాగ్గేయకారరత్న శ్రీ హరి నాగభూషణముగారు నీ సంగీతోపాసన వల్లనే తరించియుండుట జగద్విదితమైన విషయమగును.

ఈ విధముగా గాన కళోపాసనచే నాదానందాను భూతితో తరించిన మహనీయులందరును, తమ చిత్తమును కేవలము భగవదాయత్తము చేసి "అన్యథాశరణంనాస్తి - త్వమేవశరణంమమ" అను పవిత్ర భావముతో తదేక నిష్ఠాగరిష్ఠులై దీక్షాపర తంత్రులై

స్వాభిమాన రహితులై నిష్కామయోగులై భక్తితో సంగీత కళోపాసన చేయుటవల్లనే యనిర్వచనీయమైన దివ్యపథమునొంది చిరస్మరణీయులు కాగల్గిరి.

అట్టివారిలో 18 వ శతాబ్దమున నవతరించిన శ్రీ త్యాగ రాజస్వామివా రగ్రగణ్యుడగును. నారద, వాల్మీకి, సరస్వతి యొక్క యంశమున జన్మించిన పరమభక్తశిఖామణి శ్రీ త్యాగ రాజ స్వామివారి సంగీత సాహిత్య కవితా విశిష్టత వర్ణింపనలవి కానిది. కృత, త్రేతా, ద్వాపర. యుగములలో శ్రీ ప్రహ్లాద ఆంజనేయ నారదముఖ్యులవలె మనమున్న నీ కలియుగములో కర్నూలుజిల్లా కంభముతాలూకా యందుగల 'కాకర్ల' గ్రామము నుండి క్రీ॥ శ॥ 1600 ప్రాంతమున దక్షిణాపథమున చోళమండ లములోని 'తిరువారూరు' నకు శ్రీ త్యాగరాజస్వామివారి ముత్తాత యగు శ్రీ పంచనాదబ్రహ్మముగారు వలసబోయిరి. ఆ తిరువా రూరునందే క్రీ॥ శ॥ 1759 కి సరియగు శ్రీ సర్వజిత్ సంవత్సర వైశాఖ శుద్ధ షష్ఠి సోమవారము ఉదయము గం. 5-30 లకు నవ తరించిరి. ఈ మహాగాయకుని త్యాగరాజును కన్నట్టి పూజ్యదం పతులు శ్రీ రామబ్రహ్మముగారు శ్రీ సీతాంబగారు కొన్నాళ్ళకు కుటుంబ చిక్కులకు గురియై ఈ 'తిరువారూరు' నుండి 'తంజా వూరు' నకు సమీపగ్రామమైన "తిరువయ్యూరు" గ్రామమునకు వెడలిపోయిరి. శ్రీ త్యాగరాజస్వామివారు తంజావూరి యాస్థాన సంగీత విద్వాంసులైన శ్రీ శొంఠి వేంకటరమణయ్యగారివద్దచేరి సంవత్సరములోనే యద్భుత పాండిత్యమును సంపాదించి, గురువు

లచే మెప్పునొందెను, శ్రీత్యాగరాజ స్వామి తన జీవితములో 96 కోట్లు రామతారకమంత్రమును యథావిధిగా జపించిరి. శాస్త్రీయమైన రాగలక్షణ సంప్రదాయముతో వేలాదికృతులను రచనము చేసిరి, ఆ నాటి నుండి నాటి వరకు - 'త్యాగరాజకృతి' మహోన్నతమైన మన్ననలతో గాయకులచే గానము చేయబడి యలరారుచున్నది. శ్రీ త్యాగరాజాకృతియే! తన స్వానుభవ దివ్య వైరాగ్య ప్రవృత్తితో స్వానుభవ జీవిత సందేశ సమ్మేళనముతో 'శ్రీ త్యాగరాజాకృతి' యైదీపించినది. ఐశ్వర్యమున కాసించక మహారాజుల యాహ్వానములను, తృణప్రాయముగా భావించి ప్రపంచ రాగములను పోనాడి భవరోగమును నశింప చేయుటకై యను రాగముతో రాగాలాపనము చేసిరి. ఆ రాగాలాపనయే ప్రాకృతరోగాలను నశింప చేయును, మేనుమఱచి మనస్సును భ్రుకుటి యందు చేర్చి ప్రణవనాదా నందుడై వెలసిన నాడే సంగీతమును తెలిసిన వాడగును, 'తిరువయ్యూరు' గ్రామవీథులలో శ్రీ రామ కథారచన కీర్తనాదులనే గానము చేయుచు భిక్షాటనము చేసిరి.

సదా ప్రతిధ్వనించెడి యాశబ్ద బ్రహ్మమేనేనే! నాదమే పరబ్రహ్మస్వరూపమనెడి నాధబ్రహ్మము నందు మనస్సును లయమొందించి దివ్యావ్యయానందమును పొందిన మహాయోగి మన భారతీయుడైన శ్రీ త్యాగరాజ గురుస్వామివారు. నాదోపాసన ద్వారా మనోలయమును మోక్షమును పొందవీలగునని చాటి నాద బ్రహ్మానందానుభూతిని తానుపొంది తన కృతులద్వారా లోకమునకు చాటిన మహాత్యాగి మనత్యాగరాజ స్వామివారు,

శ్రీ శాంతి వేంకటరమణయ్యగారి ద్వారా 'తంజావూరు' "శ్రీ శరభోజీ మహారాజుగారు శ్రీ త్యాగరాజస్వామి యమరగానమును వినుటకు సంకల్పము గలిగి యాయనను కచ్చేరీ చేయుటకాహ్వానించెను. కాని త్యాగరాజు ఐహికసుఖములకు విముఖుడు గనుక "నిధి చాల సుఖమా! రాముని సన్నిధిసేవ సుఖమా" అను కీర్తనను నప్పటికప్పుడే స్వయంశక్తితో గానముచేసి మహారాజు ఆహ్వానమును కానుకలను తిరస్కరించెను.

దేహములోగల ఆధారాది చక్రములలో పయనించెడి ప్రాణవాయువును సహస్రారమునకుచేర్చి ఆత్మనిష్ఠతో నుండెడి మహాయోగులవలె శ్రీ త్యాగరాజస్వామివారు నాదానంద రహస్యమును తెలిసికొని తత్త్వజ్ఞుడై వెలుగొందెను.

రూపములేనిది బ్రహ్మపదార్థము. సర్వవస్తువులయందు బ్రహ్మమున్నది. అలాగే శ్రోత్రేంద్రియము ద్వారా మాత్రమే శబ్దము విననగును. కానీ! శబ్దము దృష్టిగోచరముకాదు. దీనినిబట్టియే శబ్దబ్రహ్మమని వాగ్గేయకారులు పేర్కొనిరి, పరబ్రహ్మస్వరూపమైన పరమాత్మయందు మనస్సుచేరవలెనన్న శబ్దబ్రహ్మము సహాయముతోనే చేరనగును. ఈ రహస్యము కారణముగా ప్రతిమతములో ప్రార్థనకు ప్రారంభమునందు ఆలయము, మసీదు, చర్చి మొదలైన దైవమందిరములలో ప్రణవస్వరూపమైన శబ్దబ్రహ్మమైన, ఓంకారమునే బిగ్గరగా పలుకుచుందురు, ఉచ్చస్వరముతో మనసోదరులైన మహమ్మదీయులు 'అల్లాహో అక్బర్' అనియు

క్రైస్తవులు ఓదేవా! ఓ ప్రభువా! ఓ యెహోవా! యని పలుకుచుందురు. పదములు వేరైన పదోచ్చారణకు కారణమైనశబ్దము, సమానమే ! 'పదము - అర్థము' లను రెంటిని నెట్లు విడదీయజాలమో పదము, లేక భావములేదు. భావము లేక పదములేదు. మతి లేక మతములేదు. మతము లేక మతిలేదు. తీపిలేక చక్కెరలేదు. చక్కెరలేక, తీపిలేదు. ఈ ద్వంద్వ సంబంధముల నెట్లు విడదీయుటకు వీలులేదో, ఇట్టి పదార్థ సంబంధ బాంధవ్యమే మతములన్నిటికి నంతర్భూతమై యలరారుచున్నది. నాదోపాసనమే మనోసంచార నిరోధమునకు మూలసూత్రమైయున్నది.

సర్వాంగక్షౌరమును శిరోముండనములకు నెలవైన శ్రీదివ్య తిరుమల మహాక్షేత్రమున నాలయములో పెద్ద పెద్ద గంటలు గంటలోపలి భాగమునగల నాలుకకు నొకగొలుసు నున్నది. ఆ గొలుసును లాగి వదలినచో ఆనాలుక వేగముతో తగిలి పెద్ద శబ్దమావిర్భవించును, ఎడతెగక నాగొలుసును లాగుచున్నంత నాశబ్దమొకే శ్రుతితో నాలయమంతా మార్మ్రోగును. ఆ శబ్దప్రసారము భక్తుల శ్రోత్రేంద్రియములలో ప్రవేశమైనంతనే పలురీతుల పరుగులు దీసెడి మనస్సొకేస్థితిపై నిలచిపోవును. ఆలయ ధర్మములన్నియు నాత్మోన్నతికి వివిధ సాధన ప్రక్రియలే!

"శబ్దము" తొలగిన మరుక్షణమున కోటేశ్వరుని దేహమైనను గౌరవించరు, సూత్రధారణకు పతియై సర్వసుఖముల నొసంగి నాపతియే దైవమని పూజించిన ధర్మపత్ని యైనను పతి

నంటక, పీనుగు, ప్రొద్దుపోవుచున్నది, కాటికి చేర్చుడని తహ తహలాడును. అంతవరకు గౌరవించిన వస్తువు దేహముకాదని తేలినది, దేహమందుండెడి నాద స్వరూపమైన బ్రహ్మము మాత్రమేఅని బోధపడినది. "బ్రహ్మసత్యం – జగన్మిధ్యా" 'సత్య మనంతం బ్రహ్మ' అని మన శ్రుతిపేర్కొన్నది.

సకల విధ వాద్య సమ్మేళనములోని స్వస్వరూపము నాదము. నాదస్వరూపమే వివిధ పరికరములద్వారా మనోరంజక ముగా హృదయాహ్లాదముగా రూపధారణ చెందుచున్నది. నాద మఖండశక్తిని గలిగియున్నది. పవిత్ర శబ్దోచ్చారణ రూపమైన నాదము ఆయువును పెంచి ఆనందమును గలిగించును. అపవిత్ర శబ్దోచ్చారణ రూపమైన నాదమే ఆయు క్షీణమును గలుగచే యును. శబ్దోచ్చారణమునే మాని ఆత్మధ్యానముతో నున్న వ్యక్తి వ్యక్తిత్వమ్మృతమై యానంద రూపముతో విలసిల్లుచుండును. పంచ భూత సముదాయమైన ప్రకృతి స్వరూపము విచిత్రమైనది.

ఉపాధి రహితమైన దృష్టికగోచరమైన యాకాశమునందు ద్భవ మొందిన కారణముగ "శబ్దము" ఆకాశము యొక్క గుణమని చెప్పనగును. శబ్దము యొక్క మాతృస్థానమాకాశము. ఆకాశములో నావిర్భవించినది వాయువు. వాయువున కాకాశగుణ మా పాదించుటచే శబ్దమున్నది. క్రొత్తగా సహజగుణము 'స్పర్శ యు నేర్పడినది. వాయువు నందే 'అగ్ని' అవిర్భవించినది ఈ అగ్నికి ఆకాశపుగుణము, వాయువుయొక్క గుణము, 'శబ్ద'

"స్పర్శ" అనెడి గుణములు రెండును గలిగి, క్రొత్తగా వొక సహజగుణము "రూపము"-ను కలిగియున్నది. కనుక, "అగ్ని"కి పై గుణముల రెంటితో సహజగుణముతో కలసి "శబ్ద" "స్పర్శ" 'రూప'ము లనెడి మూడు గుణములను కలిగి యున్నది. "అగ్ని" నుండి జలము ఆవిర్భవించినది. ఈ జలము నకు పై మూడింటి గుణములు "శబ్ద" "స్పర్శ" 'రూప'ములను పొందియు సహజగుణమైన 'రస' మును గలిగి యున్నది. కనుక జలమునకు పై గుణములు మూడు సహజగుణమొకటి, మొత్తము- "జలము"నకు- 'శబ్ద' "స్పర్శ" 'రూప' 'రస' ములనెడి నాలుగు గుణములు కలిగియున్నవి. జలమునందు 'భూమి' ఆవిర్భవించి నది. ఈ భూమికి పై గుణములు నాల్గున్ను, సహజగుణమొకటి. మొత్తమీ "పృథివి" తత్త్వమునకు, 'శబ్ద' 'స్పర్శ' 'రూప' 'రస' 'గంధము' లనెడి గుణములు ఐదును గలిగియున్నవి. ఈ పంచభూతములకున్న గుణ స్వరూప వైఖరులే, పంచభూతాత్మక మైన ప్రాణికోటికిని నాపాదిల్లినవి. పంచభూత సముదాయముతో నున్న ప్రకృతినే "ప్రపంచము" అని పేర్కొనుచుందురు.

సృష్టి విలాసమును చూచి సృష్టి వైచిత్ర్యములోని పలువిధ ములైన మనోహర దృశ్యములను దర్శించి లౌకిక ప్రజాకోటి యాశ్చర్య చకితమై ఇదియే భూతల స్వర్గమని వినోద యాత్ర కాశ్మీరు మొదలైన స్థలములలో శరీరమును మఱచి పొంగి పోయె దరు. మహాత్ములు ప్రకృతి సౌందర్యమును చూచి తబ్బిబ్బు చెందరు. ప్రకృతి శోభాయమానమై వెలుగొందుటకే పరమాత్మ

శక్తి కారణమైనదే! యట్టి పరమాత్మ శక్తి దర్శనమునకై సర్వులు సర్వ కాలములలో వారి వారి యోగ్యతల ననుసరించి కృషిచేయు చునే యున్నారు.

జీవుని స్థితి భ్రాంతి జన్యమై మాయావరణము నందే మునిగి తేలుచు క్షణిక సుఖాదుల కాలవాలమైన సంసార సాగర మున బడి తీరము చేరెడి తెలివు గానక తన దరిదాపులలో నున్న సద్గురువుల దివ్య దర్శముల నహరహము దర్శించుచు వారి బాహ్యాచారములను మాత్రమే పరిశీలనములుచేసి తన హృదయ మునకు బోధపడిన విషయములనే పరమసత్యమని వారు చెడుటయే గాక దూర దూరములలో నున్న వ్యక్తులు దివ్యానుభవములను బొంది సద్గురు సత్య సందేశామృతమును పానముచేయుటకై వచ్చెడి తఱి, మీకేమి వెఱ్ఱియా? మా గ్రామములో పుట్టిపెరిగి యాటలాడి పాటలుపాడి పనిలేక పిచ్చివానివలె నడవులలో సంచా రము చేసిన వ్యక్తిని మేమెరుగమా? కులములేదు మతములేదు మనసులేదు గోచియులేదు. ఆయన స్వామివారేనా? యనెడి లోకపు కాకులు నేటికి లేకపోలేదు. నీలోకపు కాకులైన లౌకికులు ప్రత్యక్ష ప్రమాణములుగా మహాత్ముల చర్యలను దర్శించియు పూర్తిగా నమ్మటకు మనస్సంగీకరింపక మహాత్ముల ప్రారంభజీవిత సంఘ టనలనే గుర్తుంచుకొనుటయో? వారి దివ్య శక్తి సామర్ధ్యములను తెలిసికొను సత్సంకల్పము లేకపోవుటయో! మొదలైన దురూహ లతో సంసార పాప పంకిలమందే పడి దుర్గతికి దిగజారి నరక యాతనలకు గుఱియయ్యెదరు.

లౌకికధోరణితో తన లోనున్న తప్పులను నీచసంస్కృతిని గురించి యాలోచించక కారుకూతలు కూసెడి పాపిష్ఠి మానవులను సైతము కరుణవహించి జాలితో మహాత్ములైన సద్గురువులు. ప్రశాంతస్థితిని పొంది పరమాత్మనిచేరు రాజమార్గ విధానమునే ప్రబోధము చేసి సంఘమునకు మహోపకారమొనర్చు చుందురు.

సర్వమానవ సద్గతికై విశ్వప్రేమతో నిస్స్వార్థసేవా పరాయణులై సర్వజీవకోటి హృదయాంతరాళముల యందున్న 'నేను' అనెడి యాత్మస్వరూపమును, వారిలో నాలో నొకేరీతిగా దర్శించి తినను నద్వైతస్థితిలో నిరహంకారులై నిర్వికారులై యోగానందులై శ్రీలక్ష్మీనృసింహోపాసకులై నీభువి విరాజిల్లు చుందురు.

శ్రీరామతీర్థ సేవాశ్రమస్థాపకులై శ్రీమట్టపల్లినృసింహోపాసకులై పల్నాటిసీమలో 'పిడుగురాళ్ళ' యందు నివాసము చేయుచు నఖిలావనికి తమ రామతీర్థ వేదాంత సారస్వతమును బహుముఖములతో విరాజిల్లచేయుచు సర్వము నృసింహస్వస్వరూపమే అనునద్వైత తత్త్వమునే పొంది వారి దివ్యాత్మానుభూతి సమ్మేళనముతో ననేకాధ్యాత్మిక రహస్యాదులను వారిరచనలలో వ్యక్తముచేయుచు లోకోపకారధ్యేయముతో సదా సాహితీ సేవ చేయుచున్న మహనీయులు నాదర్శ కవిపుంగవులు ధీరగంభీరోపన్యాసకులైన పూజ్యశ్రీ శ్రీశ్రీ కేశవతీర్థ స్వామివారును వారి 'నృసింహోపాసనము' నం దిట్లనిరి. — ఉ॥ కుక్కయు సింహమున్ గిటియు। గోవును నీచుడు పండితుండహా ! నిక్కమెఱింగి

చూచినను। నీ వివిధా కృతులేకదా ! ప్రభూ ! చిక్కిన నిట్టి జ్ఞాన మిక। జిక్కెదవప్పుడు వాసుదేవ ! ఈ, చక్కని సత్యదృష్టినిడి॥ సాకుము శ్రీ నరసింహ ! కేశవా!॥, ఈ మహనీయమూర్తి మధురభావము నందున్న యద్వైతదృష్టి నిరుపమానమైనది. సర్వ రూపములు తమ యారాధ్యదైవమైన శ్రీ నృసింహ బ్రహ్మము యొక్క స్వరూపములే ! అని వారి దివ్యభావన,

సమదృష్టితో లోకాతీతులై లోకపు మర్యాదలకు పొంగక క్రుంగక ఆత్మ దర్శనానందాను భూతితో కాలవాహిని నధిగమించి కాల కాలుడైన విశ్వేశ్వరుని సర్వేశ్వరుని నాత్మేశ్వరుని స్వస్వ రూపమని నిత్యసత్యమని నమ్మి సత్యజ్ఞానానంద పరబ్రహ్మస్థితి యందే యుండి బాహ్య జగత్ప్రవృత్తుల కతీతులై ఉండెడి లౌకి కాధ్యాత్మిక శక్తిసంపన్నులైన సద్గురువులు ఆత్మానుసంధా నముతో మాత్రమే మానసు కుదురుపడునని వారి స్వానుభవమును తెలిపిరి. కలివాతావరణమునకు జంకక బొంకక సద్గురుశక్తియే రక్షణము పరమ ప్రమాణము ! వేదసారము ! అనెడి దీక్షతో చరించెడివారి హృదయమును వారి జీవితగమనమును సంస్కరించి వారి హృదయమునందే దివ్య రచనా పటుత్వ శక్తి నావిర్భవింప చేయును. సాగర గర్భములో నమూల్యరత్నములున్నవి. కృషి చేసి శ్రమలకు గురియై రత్నములను పొందితిని దర్శించుడి, పరీక్షించుడి యనెడి మాటయు వాస్తవమే ! సముద్ర స్నానము చేశాను సముద్రతీరమునందే ఎంతో కాలము నివసించాను సము ద్రములో పడవప్రయాణము చేశాను నా జలముతోనే శ్రమించి

లవణమును పొందితిని దర్శించుడి యనెడి నీ వ్యక్తి మాటయును సత్యమే! ఇర్వురు శ్రమించిరి. మొదటివ్యక్తి సాగరగర్భములో నెన్నోసార్లు 'మునకలువేసి శ్రమలకోర్చి రత్నములను పొంది యుండెను. రెండవవ్యక్తి సాగరగర్భములో చొచ్చెడిశక్తిలేక సముద్రము పైభాగమందున్న నీటినికాంక్షించి లవణమును రూపొందింపచేసికొనెను. ఇర్వురు సాగర ప్రయత్నమునందే నిమగ్నులైరి. కానీ! వారివారి యోగ్యతకు ప్రయత్నమునకు తగినఫలములను పొందియుండిరి. ఇదేవిధముగా, మహాత్ముల దరిచేరినను దూరదూరములందున్నను తెలిసిచేసెడి వారిసంస్కార స్వానుభవ ప్రయత్నములద్వారా మాత్రమే, సద్గురువుల సిద్ధతపో యోగశక్తులను గుర్తించగలరు. వారి శుభాశీర్వాదఫలమును పొందగలరు. లేనిచో 'కొబ్బరిచెట్టుపై కోతిగూర్చున్నట్లు' అనెడి నుడియే సార్థకమగును. ఇందేది సత్యమో? పాఠకులకు బోధయై నదా?

---

## ౧౬

## అనేకత్వమునందు - ఏకత్వమును దర్శించుటే మోక్షమా?

ఏకమై స్వయంశక్తి సంపన్నమైన యఖండ మండలాకారమే వివిధాకారములతో విశ్వమెల్ల వ్యాపకవస్తువై భాసించుచు

న్నది. ఈ ప్రధానాంశమును గుర్తెరింగిన, ద్వైతివైనన దైత్వివైన నీకు నిర్భయమే! ఇది నిస్సందేహము. ఈ యధార్థము గుర్తించిన మహాభక్తమూర్తి శ్రీత్యాగరాజస్వామివారునిష్కర్షగా తమ యాత్మ నిర్ణయమును కృతిరూపములోనే "ఉండేది రాముడొక్కడే ఊరక చెడిపోకె మనసా!" అని పేర్కొనిరి. వివిధశిలారూపాదులలో తన యాత్మారామునే నయోధ్యరామునిగా నయోధ్యరామునే సర్వాంత ర్యామిగాను స్మరించి సర్వబంధములను నశింపచేయుటకు సాధన మార్గము ఆరామ భగవానుని నమ్మిభజించుటయే యను నమ్మి కతో నీరహస్యము నందరకవగత మగునటుల తెనకృతులన్నిటి లోను నీభావమునే వ్యక్తము చేసి వ్యక్తీకరించుటకు ఏకేశ్వరో పాసనయే ముఖ్యమని వారి మనుగడ నట్లే సాగించి తరించిరి.

కన్న తండ్రి మాటలుకాదని కఠిన శిక్షలను తృణప్రాయ ముగా ననుభవించి అన్నిటియందును తన యందును ఉన్నది యాహరియే! నా నిశ్చితాభిప్రాయమును మార్చుకొనవని ఘంటా పథముగా నొక్కిచెప్పిన బాలభక్త మణియైన శ్రీ ప్రహ్లాదుని సిద్ధాంతము 'అనేకత్వమునం దేకత్వమును గుర్తించుటయేమై యున్నది' ఈ సిద్ధాంతమే అనాదియము, యథార్థమని విజ్ఞాను లెల్లరు వాకొనిరి.

గౌరవనీయమైన ఘనమైన యొకవ్యక్తిని వేరొకవ్యక్తి సమయ సందర్భ ప్రస్తావనయందు 'నీవు' అని మరొకప్పుడు మీరు అని సంబోధించినప్పటికి ఆ యున్నవ్యక్తి ఒక్కడేకాని! ఇద్దరు

కారు. అదేవిధముగా సమయస్ఫూర్తితో నాచార్యులు 'ద్వైత'మని 'అద్వైత'మని ప్రచారములు ప్రబలముగా నానాడు సాగినను, నున్నది కన్నది విన్నది వాస్తవమైనది దేవుడొక్కడే !

ఏ సత్యశక్తి యాద్యమై వెలుగొందు చున్నదో ఆసనా తన దివ్యశక్తియే కవికలమునకు కదలికయై నగ్నసత్యాంశముల నెన్నింటినో దొరలింప చేసి ఆకవిహృదయమునకే ఆశ్చర్యము కలిగించును. గురుదైవముల పరిపూర్ణకృపకు పాత్రులైన కవులకు మాత్రమే ఇది సాధ్యము.

ఒక కొండరాతిని - శిల్పి, రెండు భాగములుగా చీల్చి సమాన వయోరూపపరిమితితో వలయాకారముతో నింపుసొంపైన గూర్చెడిరీతి తయారు చేయును. రెంటిపోలికయు నణుమాత్రమేని భేదములేక అలరారినప్పటికి, ఒక వలయాకారములో నున్న యాపాషాణమునే యాలయములో ప్రతిష్ఠింపజేసి పంచాభిషే కాదులతో స్తోత్రపాఠాదులతో పూజించెదరు. సర్వాభీష్ట ప్రదుడైన యామహేశ్వరుని దివ్యచరిత్ర నంతయు పౌరాణికులెల్లరు మహా పర్వసమయమైన శ్రీ శివరాత్రి జాగరణమున యాత్రీక బృందము నకు వినిపించి ప్రశాంతిని కలిగించెదరు

ఆకొండరాతిలోని ఒకభాగము 'శివలింగమై' యలరారినది. వేరొకభాగము ఆ రాతిలోనిదే యైనప్పటికీ "ఉడిపిహోటలు ఓనరు గారు" పిండిరుబ్బుటకై యుపయోగించుచున్నారు. ఈపాషాణము కారము ఉప్పు మొదలైన పదార్థములను రుచిచూడ జాలక

హోటలువర్కర్ చేతి పరిభ్రమణమున కోర్వజాలక ముక్కలై పోయినది. ఈరాతికీదుర్గతియా? శివలింగని రూపమునం దాలయ ములో నున్న ఆ రాతి కాసద్గతియా?

ఒకే కొండలో చీల్చబడి ఒకే శిల్పిచేతిలో మలచబడిన యొకే రూపముతో రాణించు నాపాషాణముల మానమర్యాదలే చూచుటకెంతేని యాశ్చర్యముగా నాధ్యాత్మికముగా గోచరించు చున్నవిగదా! ఇట్టియెడ మనకు సర్వుల సంస్కార స్వరూప ప్రభా వములు గోచరములగునా?

వివిధరంగములలో నున్నవ్యక్తుల హృదయాంతర భావ ప్రవర్తనలను పరివర్తనలను యోగపురుషులు సద్గురు శ్రీయోగా నందనరసింహస్వామివారు వారి దివ్యయోగశక్తిచే ప్రత్యక్షప్రమా ణములతో వ్యక్తముచేసి తార్కికుల హృదయములకు నాశ్చర్య మును చేకూర్చుచుందురు, ఘోరపాపకర్మల పరిహారమార్గములను సూచించుటయేగాక వారి యనంతయోగశక్తి ప్రసారముతో పాప కర్మలను క్షాళనమొనర్చెదరు. ఇట్టి తపశ్శక్తులతో లోకక్షేమమును లోకోద్ధరణమును చేకూర్చెడివారినే త్రికాలజ్ఞులు సద్గురువులని లోకమువేనోళ్ళ యెలుగెత్తి చాటుచుండును. సద్గురువులు శ్రీ నృసింహదేవుని కళావతారమైన శ్రీయోగానందనరసింహ యోగి వర్యులువారి యనంతయోగశక్తి ప్రసారముతో శిష్టజనులహృదయ సీమలలో దివ్యచైతన్య కాంతి-పుంజములను నెలకొల్పిరి. తనపై గాఢబద్ధానురాగమును గలిగి యందరిలో తనస్వరూపమునే దర్శిం

చేడి తన శిష్యుడై న కోటసుబ్బరాయగుప్తను, హరిదాసునిగా కవిగా పండితునిగా సవిమర్శకునిగా త్యాగిగా కళారాధకునిగా యోగిగా వారికరుణాశీస్సుల ప్రభావముతో మార్చి వారి దివ్య జీవితమును చరిత్రగా వ్రాయించి బహుళప్రచారమును చేయించిరి.

నమ్మినశిష్యుల నింతవారిగా మార్చగల దైవశక్తిని వారు తపోయోగత్యాగముల ద్వారానే పొందగల్గిరి. మరియు ప్రత్యణువునందు నృసింహునిరూపమునే గాంచి, ద్వైతముగా భాసించెడి యీ నామరూపాత్మకమైన విశాలవిశ్వమం దెల్లెడల నద్వైతశక్తినే దర్శించి తవను సదానమ్మి చరించెడి ముఖ్య శిష్యులకు మాత్రమే, "యనేకత్వమునం దేకత్వమును దర్శించిననాడే మీరు తరించ గలరు. లేనిచో సాగరజలమునుతోడి రత్నములను పొందవలె ననెడి రీతిగనే" యుండునని సదా శ్రీయోగానందస్వామి ప్రబోధము చేసి శిష్యులమన స్సంశయములను తుదముట్టచేసెడివారు.

అనేకత్వమునం దేకత్వమును దర్శించుటే! సర్వసిద్ధాంతములలోని సారసంగ్రహము. శ్రీ రామకృష్ణ పరమ హంస గారు, శోభనపుగదియందు ప్రథమసమాగమమందే తన భార్యయగు శ్రీ శారదాదేవిని దర్శించగనే 'ఆహా! ఆ మాతృమూర్తి రూపమునకు నీ శారదా రూపమునకు నెట్టి వ్యత్యాసము లేదు. స్త్రీ లెల్లయు నాకు మాతృమూర్తి స్వరూపములే' యనెడి మధురానుభూతిని పొంది యనేకత్వమునం దేకత్త్వమును దర్శించి ప్రకృతి వ్యామోహమున కతీతులై సతీభావనకు తిలోదకములిచ్చి

మాతృ శిశుభావనతో నిర్వురు సమరులై ఆదర్శ దివ్యజీవనులై ధ్రువతారలై వెలింగిరి.

## ౧౭

## ఆలసించిన నాశాభంగమా?
## మంచితరుణము మించిపోవునా?

"జాతస్యహిధ్రువంమృత్యుః,ధ్రువంజన్మమృతస్యచ" యను సత్యమును నందరు తెలిసియే జననమరణముల ననుభవించుచున్నారు. సృష్టిసనాతనమైనదే కాని శాశ్వతముకాదు. ఈ చరా చర సృష్టిలోని ప్రతివస్తువు పరిణామాత్మకమైనది. ఇది సృష్టియొక్క సహజావస్థయై యున్నది. సృష్టిక్రమము ఖగోళశాస్త్రజ్ఞులకు గాని చంద్రమండలయాత్రీకులకుగాని యగమ్యము, 'సముద్రస్నానానికి వెళ్ళిన వ్యక్తికి నీటికొలతలెందులకు' అని శ్రీరామ కృష్ణ పరమ హంసలవారు ఏనాడో పేర్కొని యున్నారు 'గురుభక్తిలేనివానికి గురుతెటుల దెలియునురా!' అని శ్రీయోగానంద - స్వామివారను చుండెడివారు, కొండలు నదులు బిలములు మిట్టలు పుట్టలు పల్లెలు పట్టణములు గుడులు గోపురములు ఒకటేమి! దృశ్య రూపమైన జగత్తంతయు స్థిరరూపము లేక పరిణామమును పొందుచునే యున్నది.

అదృశ్యమై అనంతమై అఖండమై అవ్యక్తమై నిత్య సత్య సనాతనమై నిరూపమానమై నిర్వికారమై నిశ్చలమై ప్రణవమై చలనమునకు శక్తియై సద్గురువులకు వ్యక్తమై నిజభక్తుని మనో వాంఛాఫలమై సభాస్తంభసంజనితమై శిష్టహృదయమోహనమై దుష్ట హృదయ భీకరమై నాస్తికుల కాస్తికత చేకూర్చి లోక జనవంద్యమైన, ఏ సనాతన మహామహిమన్వితాద్భుత శక్తి స్వయంవ్యక్తమై సదా జ్యోతియై వెలుంగుచున్నదో? అట్టి నృసింహ పరబ్రహ్మ స్వస్వరూపాను సంధానమునకై - ప్రతి వ్యక్తి యోలసించక నూతనోత్తేజముతో ఇదియే నా తొలికర్తవ్యము! ఇదియే మానవుడనైన నా ధ్యేయము! అని ఇప్పటికైన తెలిసికొనుడు. తెలిసికొనియు మందభాగ్యుడవై మతిమాలిన వాడవై కర్తవ్యమున కుపక్రమించక, యుదరపోషణాలంకారమైన వివిధ కర్మములను చేబూని యహరహము వాటిని గురించియే చింతితించు 'కూపస్థమండూకమువలె' నేచేయునదే లోకాదర్శమని విశ్రాంతి సమయములలో వెండి పొన్ను కఱ్ఱను చేబట్టి హుషారుగా తనలోతానే పొంగిపోవుచు, అనాధుల యార్తనాదమును వినుచు వారి దుర్గతిని కనుచు నగరోద్యానమందిరములలో ప్రసారమయ్యేడి వార్తావళికై తహతహలాడుచు పరుగులతో పయనము గావించెడి, ఓ భారతీయ సోదరులారా! 'అలసించిన ఆశాభంగము - మంచి తరుణము మించిపోవును.'

ఈ గూటిలోని రామచిలుక గుట్టలపాలై దూర తీరములకు చేరకముందే నీ నిజమైన నిలయమేదో నీ ప్రయాణ మెక్కడికో!

బాగా యోచన చేసితినా! నీతులనెన్నింటినో ఉపమానాలంకారము లతో తోటి సంఘమునకు నచ్చచెప్పి వారి మెప్పులతో గొప్ప వారనిపించుకొన్నను, పుణ్యస్థలములకు వెళ్ళుచు పుణ్యాత్ములైన సాధువులకు నయోక్తిగా ఛలోక్తిగా చిరునవ్వు ముఖముతో సేవలు చేయుచు సత్సంగములయందు పాల్గొనినను, బిగ్గరగా భగవంతుని మధుర నామభజనలు చేసినను బృందమును సమ కూర్చి వారితో మహాస్థలములకు వెళ్ళి సమిష్టి సత్సంగ కార్య ములు విజయవంతముగా సాగించినను, కొత్తవారి మనస్సుల నాకర్షించి వారిని రంజింప చేసినను, ధర్మకార్యములకు విరివిగా చందాలు సమర్పించినను జార చోరాది వృత్తులతో సంచరించినచో వారెంతోకాలము నుండి భక్తితో శక్తితో చేసిన ధర్మ పుణ్య కార్యాదుల ఫలము నిష్ఫలమై నిర్జీవమై పోవుటయేగాక మహా పాపమునకు గురియయ్యెదరు. దీనినే ధర్మరహస్యమని యార్యులు పలుకుచుందురు.

ప్రతిరోజు నవకోటి శివాలయములలో నిర్విఘ్నముగా పూజలు పరిసమాప్తి గావించెడి ఆనాటి లంకానగరాధ్యక్షుడైన 'రావణుడు' పరకాంతా సక్తితో సమూలముగా వంశమర్యాద లన్ని నమ్ముచేసుకున్నవాడై చివరదశకు సర్వ వంశనాశనమై నాడు, 'నూరునోములొకరంకున బోవునని' మన పెద్దలనెడి నుడి నిక్కమని యిదే చరిత్ర చెప్పిన సత్యము —

'పాపి' నే విషయములను చూచినను విన్నను వాటియందు గల స్వస్వరూప సామరస్యములను గుర్తించక ముఖము చిట్లించు

కొని విషయమే లేదు వట్టికబుర్లు, లోకపు మర్యాదల పరామర్శయే అని వెగటుగా విశేషయముల నర్థము చేసికొని వ్యంగ్యముగా తోటివారిలో సంభాషణలు గరపుచుండును. పాపి హృదయమున కెన్నడు వాస్తవిక విషయమర్థముకానేరదు. పుణ్యహృదయునకు పుణ్యసంకల్పములే యావిర్భవించుచుండును. పాపికి సద్గతిలేదా? ఉన్నది! ఎన్నటికి! పుణ్యాత్ముల సత్సంగములతోనో? లేక, ఘోర వ్యాధులకు గుఱియగుటచేతనో? కాక బలవంతుల పాదరక్షల ప్రయోగములచేతనో? పాపి హృదయమునకు శాంతి చేకూరును. మఱియు ప్రాకృత పాపరాశితో జన్మించిన జీవిగతి మరణ పర్యంతము పాపపు భావములతో ద్వేషపూరిత వాక్యాదులతో దుందుడుకు కర్మలతో చరించును. పాపముతోపాటు, కొద్దియో గొప్పయో పుణ్యముతో జన్మించినజీవి లోకములో తన జీవితకాలములో నారంభముననో నడివయస్సుననో అంత్యదశయందో నాపూర్వ పుణ్యవేళాఫలప్రభావ సంస్కారముతో మహాత్ముల సాన్నిధ్యము లభించి స్థితప్రజ్ఞతో నీచగుణములు సంస్కరింపబడి యుత్తమ మార్గావలంబనముతో తప్పక చరించును.

పాపాలున్నవారెవరా? యని మీకు సందేహమా? వారు, వీరే! వినండి సత్సంగము సద్గోష్టి సత్కథాకాలక్షేపము మొదలైన సత్కర్మలు జరుగుచున్న స్థలముల నుండి చీకాకుతో కథా వస్తువు గిట్టని స్థితితో లెచిపోయెడివారు. మఱియు సత్కథాకాలక్షేపాదులలో శ్రోతలుగా చేరియు కథరక్తిగా లేదే యనుధోరణితో లోకాభిరామాయణము నారంభముచేసి వినువారిమనస్సులను

భంగము చేసెదరు. పొట్టకూటికేగద, యీ సద్గోష్టి సత్కథలు సత్సంగములు చేయుచు తిరుగుచుందురని లౌకికధోరణితో దూర దూరముగ తిరిగెడి సోమరులెల్లరు గత జన్మలలో పాపకర్మలు చేసిన జీవులని గట్టిగా నమ్మడి, జీవులకు స్వతంత్ర శక్తిలేదు. గత జన్మలలో మనఃపూర్వకముగా చేసిన సత్కర్మ దుష్కర్మ మిశ్రమ కర్మల ప్రభావముల ప్రేరణముతోనే "జీవి" కర్మములు చేయుటకు ప్రారంభించును ఇది కర్మ సిద్ధాంతము.

గత జన్మల పాప ప్రభావ ప్రేరణములు మనస్సులో కలిగిన తక్షణమే నిర్మల స్థలములో నవకాశమున్న యాసనములో కూర్చొని నాలోగలిగెడి దుష్టసంకల్పములను నశింపచేసి హృదయ పారిశుద్ధ్యమును చేకూర్చి నీదరి చేర్చుము ప్రభో! అని స్మరించుము. భజించుము; ధ్యానించుము. మరియు భవబంధలతాల విత్రము, సంసార తరుచ్ఛేద యంత్రము, ముక్తి నొసంగెడి మూల మంత్రమైన అష్టాక్షరి మహామంత్రమునే యార్తితో నావేదనతో బిగ్గరగా నుచ్చరింపుము, ఈ మంత్రమును ఉచ్చైస్స్వరముతో పలుకుచు మంత్రాధిష్ఠాన దేవత దివ్య రూపమునే భ్రూమధ్య స్థానమునందు దర్శించుము. ఇటులే కొంతకాలము కాలవిలంబనము చేయక అదేసమయమునకు ఈ నిష్ఠాకార్య క్రమమును చేయుచున్నచో తప్పక మనస్సు చలనరహితమై స్వాధీనమై శాంతి దాయకమైన సాధుమార్గమున సంచారము చేయును. ఇది సర్వ మతములవారికి సులభసాధ్యమైన మార్గము. దారాపుత్రుల సముదాయముతో నున్న యింటిలో నా విధానమునకు వారి వ్యాసంగ

ములు భంగము వాటిల్లి చేయును. అట్టియెడ నేకాంత స్థల నిర్ణయము చేసికొనవలెను. ఈ కారణము చేతనే మహమ్మదీయసోదరులు 'మశీదు' నందే ప్రార్థనలు సల్పుచుందురు. క్రైస్తవసోదరులు పరిశుద్ధమైన 'చర్చి'ల యందు స్తుతి స్తోత్రాదులను గావించెదరు. భారతీయులెంతో విశాలమైన యాలయములు కట్టించిరి. ఆలయములలోని వివిధ వాద్య సమ్మేళనము మనోవికారము నణచివేయుటకు ప్రథమ సోపానము. భగవానుని దివ్యప్రార్థనలు, మౌనముగా నామధ్యానము మొదలైనవి ద్వితీయ సోపానము, సోపానములు వరుసగా దాటి పురోగమనము చెందిన వ్యక్తికి, 'మనస్సు' 'పిడికిలిలో చిక్కిన పిట్టవలె', కదలక మెదలక పరుగుతీయుట మాని నిలచియుండును, ఇట్టి స్థితినొందిన తదుపరి బాహ్యకర్మములలో దేహమున్నప్పటికి మనస్సు ఆత్మయందే చేరి సుఖించును. ఈ స్థితిపొందిన కర్మయోగులు జ్ఞానయోగులవలెనే పరిగణింపబడుదురు, జ్ఞానయోగముతో నున్నప్పటికి వ్యక్తి మనస్సే కర్మాసక్తమైన తఱి, వారు కర్మయోగులుగానే పరిగణింపబడుదురు. ఇందేది సత్యమో? విజ్ఞులకెల్లరకు సుబోధకమగును.

ఆలయములైనను మశీదులైనను చర్చిలైనను తదితర భజన మందిరాదులేవియైనను, వ్యక్తులు భయభక్తులుగలిగి క్రమశిక్షణముతో మెలగిననాడే, అవి ముక్తికి సోపానములగును. వస్తువు నుపయోగించుకొనెడి విధానముల ననుసరించియే మేలు కీడులను చేకూర్చు చుండును. వ్యక్తి బాగోగులకు వస్తువు ప్రధానము కాదు. వారు వారు ప్రవర్తించెడి కర్తవ్యా కర్తవ్యముల

ననుసరించియే జరుగుచుండును, ఇది లోకానుభవమే!

ప్రతి మానవుడు నాలసించక 'రేపు మాపు అని' అంచ నాలు వేయక గూటిలోని పిట్ట ప్రయాణమును గుర్తించి, త్వరలో మాయా నిద్రనుండి మేల్కొని మాయదారి మనస్సు మర్మము తెలసి కర్తవ్యమును నేటినుండి యైనను ప్రారంభము చేయవలెను. భగవదాజ్ఞలను వేదశాసనములను మహాత్ములు నడచిన మార్గము లను నమసరించి దేవదేవుని కృపకు పాత్రుడవుకమ్మ. కాల మృత్యువు మానవుని కొరకు వేచికాచియున్నది. ఈ సత్యమును రచ్చబండల రాద్ధాంత సిద్ధాంతములలో చిక్కి మరచిపోయిన ప్రమత్తుడవై భువి చరించినను కాలమృత్యు కరాళ భయ దంష్ట్ర లకు గుఱికాక తప్పించుకొనుటకు సాధ్యముకాదు. మన ముందు వారెందరో మీసాలను మెలివేసి కట్టిపెత్తనముతో తానున్న స్థల ములయందున్న వారిని గడగడలాడించి చివరకు మూటికి దూరమై కాటికి చేరిరి. మనము అంతే! "త్వరపడుము, మేల్కొ నుము, ముందు గతిగనుము" అని శాస్త్రములు సదా హెచ్చరించు చున్నవి, భగవానుని ప్రార్థన భజనాదులను దోష రహితులై పరి శుద్ధ హృదయముతో మంచి నడవడితో నిత్యము నాసక్తితో చేయుడు. కాలములో సమీపములోనే గొప్ప పరిణామము రానున్న దని తత్త్వవేత్తలు నేటి భౌతిక విజ్ఞాన శాస్త్రవేత్తలు ఖగోళ పరిణామములద్వారా గుర్తించి లోకమునకు పత్రిక వ్యాసాదుల ద్వారా చాటుచున్నారు. గతమును గత దుష్కరకర్మలను వీడి భయముతో పాప పరిహార మార్గమునకు నేటినుండియైన కృషి

సల్పి భగవత్కృపను పొంది తరించుట కుద్యుక్తులై ఆత్మోద్ధరణము నొందుడు.

కవి పండిత విద్వన్మణులెందరో భగవత్ప్రేరణముతోనే "లోకాస్సమస్తా స్సుఖినో భవంతు" అనెడిధ్యేయముతో వివిధరచనలుసాగించి ప్రచారముచేయుచుందురు, అది వారితృప్తి. లాభము నాశించి గాని కీర్తి ప్రతిష్ఠలను పొందవలయునను కాంక్షతో గాని, సంఘద్వేషముతో గాని ఇట్టి యాధ్యాత్మిక రచనల నెవ్వరు సాగించరు, సాగించినను అవి సంపూర్తిచెందవు. సంపూర్తి చెందినను సంఘము నాకర్షింప జాలవు; ఒకవేళ నాకర్షించినను లోకోపకార మొనర్పజాలవు. దైవప్రేరణముతో భగవదావేశముతోనే సంపూర్తి కాగలవు. తనకు తెలిసి తనతో సదా కలసి మెలసి తిరిగెడి కవి రచన, రమణీయముగా శాస్త్ర రహస్యాదులతో సద్గురువుల స్వానుభవ సందేశ సమ్మేళనముతో నలరారి, కవి పండితాదరణకు పాత్రమైనను రచయిత తానున్నచోట పూర్తిగా గుర్తింపబడడు. దీనికొకే యొక కారణ మున్నది. కవియొక్క వ్యక్తిగత జీవిత పరిణామాదర్శములనే విమర్శించుచు, కవి హృదయపు తీరు తెన్నులను త్రోసిపుచ్చి, కవినిత్రోసిపుచ్చిన ఆ మార్గమునందే కవి దివ్య రచనను త్రోసి పుచ్చుచుందురు, రసజ్ఞులైన పెద్దలు కవి వ్యక్తిత్వమును చూడక, కవితాశక్తి మాధుర్యమును కవిత్వపు మార్గములను పదప్రాసలను భావ గాంభీర్యమును స్వార్థపరత్వము లేని కవి పోకడలను మాత్రమే గుర్తించి ఆనందాను

భూతితో కవిని ప్రేమించి గౌరవ సన్మానములను గావించెదరు. సమదృష్టిగల రసజ్ఞులకు మాత్రమే ఇది సాధ్యమగును.

---

౧౮

## నేనే సర్వశక్తివంతుడనని గర్వించితివా ? నీ కృషి వృథా !

శ్రీ కాళిదాస మాఘ మయూర భారవి దండి మొదలైన కవిరాజు లెందరో కాలగతి చెందిరి. నీవు అంతే! మహాకవుల రచనలు విశ్వ విరాజమానములై శాశ్వతములై నిలచి సర్వ మానవ హృదయములను రంజింపచేసినవి. కవి తన రచనను ధనముకొరకై యెట్టివానికైన నంకితమొనరించి వారి యర్థ సంగ్రహణమునకై లేనివి సృష్టించి యున్నవి త్యజించి కావ్య రచన సాగించి యత్యంత సుందరమైన విధానముతో సంపూర్తి చేసి కవిసామ్రాట్టుల పొగడ్తలకు పొంగి పోయినను సుగుణ సంపత్తిలేని వాడు సంఘ గౌరవమునకు దూరుడై తనయంతరాత్మ తెగడ్తలకు, క్రుంగిపోక తప్పదుసుమా!

దుష్టగుణ భూయిష్ట హృదయుడైన పరమలోభిని కవి యాశ్రయించి వాని యర్థమున కాశించి 'దానరాధేయా! సాహస విక్రమార్కా!' యనెడి పొగడ్తలతో పద్మరత్నములను కానుకగా సమర్పించిన కవిని, పరమలోభి గుర్తించలేక ఓహో పనిలేక

నన్నివిధముగా నర్థము తెలియని గట్టిగట్టి బూతులతో తెగడు చుంటివా? యని యా లోభి కారుకూత లారంభించును. లోభి కారుకూతలకు కవి హృదయము గాయపడినదై, ఓవాణీ! నలువ రాణీ! పరమ లోభిని రాధేయునిగా, బలహీనుని సాహస విక్రమార్కునిగా అసత్యరచనాభి వర్ణనల ఫలితమింతగాక వింకెంతొ నులే యని విచారించును.

ఛందోబద్ధముగా సర్వశక్తి సంపన్నమైన యఖండ పాండితీ పటిమతో మహా కావ్యరచనలు చేసి మహారాజుల కంకిత మొనర్చి వారి ఘన సన్మానములతో నింద్రాది భోగము లనుభవించియు చివరదశలో కవి సార్వభౌములైన శ్రీనాథ మహాకవిగా రెట్టి దుస్థితిని పొందిరో వింటిరికదా!

నిరాడంబరులై కృషీవలులై భగవదాజ్ఞానుసారము శ్రీ మహాభాగవత గ్రంథ రాజమును తెనిగించి పరిపూర్ణభక్తితో భగవదంకిత మొనర్చిన శ్రీ బమ్మెరపోత రాజుగారెట్టి వినిర్మలా దర్శ గృహస్థాశ్రమ ధర్మములు నిర్వహించిరో? ఇక్ష్వాకు వంశాబ్ధి సోముడగు శ్రీ రామచంద్ర భూపాలునకే కృతి సమర్పణము గావించి చిత్తశాంతిని పొందిరో వింటిరికదా!

అన్నిరంగముల వారిని కువిమర్శలు చేసి శాంతిని పొంద లేక యర్థాసక్తితో రచనా వ్యాపారము సాగించి పెట్టుబడి లేనిదని జీవితాంతమువరకు దీనినే వృత్తిగా మార్చుకొని, నిరుపేదలై కళాదృష్టిగల గట్టి గట్టి కవుల వ్రాతలను రొఖ్ఖములిచ్చి నేక

రించి వారిపేరుమార్చి తనపేరుతోనే ఆరచనలను సంఘమునకు చలామణి చేయుచు స్వార్థదాహ పీడనముతో తదితర కవులకా రచన తనదిగా చెప్పినంత నా కవు లాశ్చర్యముతో యధార్థము గుర్తించియు మనకెందుకు విమర్శలని, 'మహాకవులు మీరు మీ కవిత్వము చాల రమణీయము భావ బంధురమని పొగడి వారి పారి తోషికములతోనే పొట్టబోసుకొను చుండెడి పొట్టకూటికవులు పుట్ట కొక్కులవలె నేటికాలమున కోకొల్లలుగా గన్పట్టు చున్నారు. "ఉప్పు కప్పురంబు నొక్కపోలిక నుండు చూడచూడ రుచుల జాడవేఱు" అన్న వేమన్ననుడియే మిన్నయై రాణించుచున్నది. కవులు సత్య వాదులా! అసత్యవాదులా? మంచివారేలేరా! వారి కవిత్వమో! లేక వేరొకరి కవిత్వమో! అను సంశయములను వీడి కవిత్వములలోని సత్యాంశములను మాత్రమే స్వీకరించి దివ్య జీవనవిధానము నలవరచుకొని యాదర్శమై యాధ్యాత్మిక రచనలను ప్రతివ్యక్తి విధిగా కొనుడి శ్రద్ధతో సంపూర్తిగా పఠించుడి. నవీన కవులకు కవితా శక్తి సామర్ధ్యములను మీ ద్వారా కలిగించుడి. కవి కులముద్ధరింపబడి లోకమున కొక నూతనోత్తేజ మును దివ్య శక్తి సంజనితము లయ్యెడి బహువిధ మార్గములను సూచించెడి యుత్తమ గ్రంథముల నా పరాశక్తి కృపాప్రసార ముతో ఆదర్శాభ్యుదయ కవులెందరో యందించెదరు.

నేనే లోకమున కాదర్శ మార్గములను నా రచనలద్వారా అంద చేయుచున్నాడను. నేనే సర్వశక్తి వంతుడను. నాచేతి వ్రాత

లను నానోటి నీతులను నా గంభీరోపన్యాస భావములను నే నాచరించవలయునా? యనెడి యహంకారమును పొంది, నేను నన్నె అను తిక్కన సోమయాజి యపరావతారము కాళిదాసు ప్రేమావతారము లనెడి భావములతో నాచరణశూన్యమైన జీవిత గమనమును సాగించితివా? నీవు చెడి నీరచనల విలువలను వమ్ము చేసిన వాడవయ్యెదవు. ఆదర్శకవిత్వము వ్రాయలేక పోయినను, ఆదర్శ జీవితమును గడపుము. నీ దివ్యాదర్శ జీవితవిధానమునకు కవి శ్రేష్ఠులైనను ఆశ్చర్యానందాదులతో నీ నిర్మల జీవిత కథనే వ్రాసి నీ నిర్మలత్వమునే సర్వజనులకు నందజేసి నీద్వారానే జీవనోపాధిని పొంది సుఖించెదరు.

కవిగారి సుఖ జీవనోపాధికి కారణము తాను రచించిన చరిత్ర. తానురచించిన చరిత్ర కాధారము, చరిత్ర నాయకుడు, చరిత్రనాయకుని కాధారము తాను నడచిన సత్యమైన త్రోవకాధారము సత్యన్యాయాదిగుణములు, ఆ సత్యన్యాయ ధర్మాదిగుణముల కాధారము. భారతీయసంస్కృతి, నీ భారతీయ సంస్కృతికి మూలము మన యార్యఋషులు, మన యార్య ఋషులకు మూలము పరమేశ్వరుడు. ఆ పరమేశ్వరునకు మూలమొకానొక యనంతశక్తి. ఆ యనంతశక్తిమూలము వాఙ్మానసమునకు తెలియనిది. వాఙ్మానసమునకు తెలియని దానిని నిర్ణయించుటెట్లు? ఇన్నిటికీ తెలియబడని యా యొకానొక మూలశక్తిని, భ్రాంతిరహితమైన ద్వంద్వాతీతమైనయోగవిజ్ఞానమునం దేకీభవించి రమించెడి సద్గురుస్వాములకే యెరుక!

వ్యాకరణాది లక్షణ గ్రంథములు చూడక అఖండమైన పదపటుత్వముతో తేనెలొలుకు భావ ప్రవాహముతో దివ్య గంగాఝురీ సమానమైన శైలితో కవితాశక్తిని విజృంభింపచేసి దివ్య మనీషత్వమును పొందిన మహాకవులై లోకమునకు వ్యక్తమైన వేదాంత కోవిదులెందరో నిస్వార్థ సేవా పరాయణులై కులమత భావ నిర్మూలనముతో తత్త్వ వేత్తలైన తదుపరి లోకోపకారధ్యేయముతో భగవదుపాసనాపరులై భక్త్యావేశముతో ఆత్మతత్త్వ విమర్శనల స్వారామృతమును సాంగోపాంగముగ వారిదివ్య వేదాంత తత్త్వములద్వారా పద్య గద్య ద్విపద చూర్ణికా సీసమాలికా కందర్దాది వివిధ రూపములతో నపార కరుణామూర్తులై లోకమునకు రాజమార్గమును చూపిరి.

ఇట్టి వేదాంత కవులు మన పల్లెపట్టులలోనే మన యిరుగు పొరుగుననే యెందరో యవతరించిరి. వారు సజీవస్వరూపులై సంఘము నందే మెలగుచు నిత్య జీవిత విధానములలో నైతము గంభీర వేదాంతసూక్తులనే పలుకు చుందురు. ఐనను కవి దోష గ్రస్తులైన మానవులు వారిని గుర్తించలేక, గుర్తించియు గౌరవించిన మన శక్తికి లోపమనెడి అంధ విశ్వాసముతో కాలమును దుర్వినియోగము . చేసెదరు. యోగపురుషులు మహనీయులైన వేదాంత స్వరూపులైన నాదర్శ దివ్య కవీంద్రులైన లోకమును వీడి మరుగైన నాడు వారికి సమాధులు నిర్మాణము చేసి నిత్య నైవేద్యదీపారాధ నారాధనాది కైంకర్యములు భక్తితో చేయుచు వారి రచనలను వారి సూక్తులను వారి జీవిత సత్యములను లోకము

సదా మననము చేయుచు వారి దర్శనమును వారి ప్రత్యక్ష ప్రబోధ ములను వినుటకు ప్రాప్తము లేకపోయెనే! యనుచు యహరహము వగచుచుండును. ఇది లోకపుతీరు!

కుల మత స్థల భేదములేక మహాత్ములెప్పుడు విద్యా విర్భావమొందుచునేయున్నారు. కుల మత స్థలభేదములు ప్రాకృత మానవులకే! మహాత్ములదృష్టిలో గుణహితుడు గుణరహితు డనెడి భేదములు రెండే గన్పట్టు చున్నవి.

శ్రీ చిరుమామిళ్ళ సుబ్బయార్యులు గారు, శ్రీ పులహరి ఫీరోజి ఋషీంద్రులువారు, శ్రీ కొమ్మలపాడు ఖాదరు మస్తాను అవులియా గారు, శ్రీ గుంటూరు మూటల మస్తాను గారు, శ్రీ బందరు దొంతులమ్మ గారు, శ్రీ పొట్లపాడు రామయోగి గారు శ్రీ త్రిపురాంతకము నాసరయ్య గారు, శ్రీ జానపాడు సైదులు గారు, శ్రీ తుంగతుర్తి బుచ్చయ్య గారు, శ్రీ తోకపల్లి స్వామి వారు, శ్రీ పెనుమత్స మహాయోగినీదేవి గారు మొదలైన మహా వ్యక్తు లెందరో పాంచభౌతికమైన నీ తోలుతిత్తి రహస్యముల నెరింగినవారై యన్నిటికి నుపాధియైన తత్త్వమునే దర్శించి తరించిరి.

అట్టి గట్టివారెందరో యవతరించిన భారతదేశములో నవ తరించిన మన మెల్లరము వారి వారసులమే! యైనను ప్రయోజన మణుమాత్ర మేనిలేదు. మహాత్ములు ఆర్యఋషులు వేదవిదులు తత్వవేత్తలు సమదర్శనులు నవతరించినదే! మా దేశము, అనే

నినాద మాకాశమంటినది. మన మాటలకు చేతలకు (ఉత్తర - దక్షిణ ధ్రువముల వలె) నెంతోవ్యత్యాసమున్నదే!

నినాదమునకు తగిన నడవడిలేనినాడు మనము మానవులమా? లేక మానవరూపములోనున్న దానవులమా? మీరే ప్రశాంతముగా యోచనచేసి యింతటనైన వక్రమార్గములను వర్జించి వేదవిహితమైన వేదాంతవీథులలో దివ్యస్వైరవిహారము చేయుడి, నేటి కలిలో నెటుచూచిన కవులే! ఏ ప్రక్కకు వెళ్ళిన ప్రార్థనా సంఘములే! ఏ మూలచూచిన భగవద్గీతా పారాయణ మందిరములే! సప్తాహములు సప్తసప్తాహములు ఏ కాహములు అఖండనామ భజనలు, పిచ్చిబట్టినవారివలె తీర్థ యాత్రా ప్రయాణములు బహువిరివిగా జరుగుచునే యున్నవి. ఇన్ని జరుగుచున్నను సంఘమునందు నిత్యసత్యమైన పరిణామము కన్పట్టదు.

పూర్వము మహాత్ములయొద్దకు చేరి వారి సేవలుచేసి యా పరతత్వరహస్యములను తెలిసికొని తరించవలెనను ప్రేమతో కాచుకొనియుండి యెప్పుడెప్పుడు విందుమాయను తహ తహతో తపించెడి ముముక్షులకు నెన్నిరోజులకో నా మహాత్ములు కరుణతో వారికి సద్బోధలుచేసి సంస్కారవంతులైనవారికి మంత్రోపదేశము చేసి తగినరీతిగా యోగరహస్యాదుల నందించెడివారు. భవబంధ విముక్తికి త్రోవచూపెడువారు.

నేటి నవీన వేదాంతప్రచార మెంతవరకు పురోగమనము

చెందినదో విషయగ్రహణపారీణులైన తామెల్లరు గుర్తించుడి. లోకోద్ధరణాసక్తితో కారులలో వాడవాడలకేగి బంట్రోతుల ద్వారా వారి రాకడలను గ్రామపౌరులలో ధనమున్నవారికి తెలిపి యాహ్వానములుచేసి వారికి నయోక్తిగా విషయమును విన్నవించి తనకు గతమునగౌరవమర్యాదపారితోషిక ఘనసన్మానములు చేసినవారి నామధేయములనుచెప్పినంతనే విన్నయైశ్వర్యవంతులు మేము సిద్ధమే అనుచు నా భక్తికార్యక్రమమునందు చల్లగా మెల్లగా నొకరిద్ద రారంభమై ఏడురోజులకు తిరుణాల ప్రజలవలె ఆ భక్తి కార్యక్రమ బోధనాపద్ధతుల నాకర్షించి కార్యాధినేతను పూజించుట కారంభించి యానాటి పరీక్షిన్మహారాజువలె భక్తాదులెల్లరు శిష్యులై కారణాచార్యులని వేనోళ్ళపొగడి పాదపూజలుచేసి విరాళములను విరివిగా సమర్పించి భక్తసప్తాహ కార్యక్రమములను సంపూర్తి గావించెదరు.

మంచిని ప్రచారము చేయుట లోకమునకు శ్రేయస్కరమే! 'ఆడంబరపు భక్తి అట్టేకాలము నిల్వదురా? ఆర్జనెంత సులభమో! ఖర్చు అంతేరా! మనుమడా' అని స్వానుభవమును పొందిన మన తాతయ్యలు చెప్పెడి వారు. నవీన వేదాంత ప్రచారములో పెరిగి హాజరైన భక్తులు కార్యాధినేతకారుతో ఊరు విడచి వెళ్ళిన పక్షము రోజులకే పదిమంది భక్తులే ప్రార్థనకు హాజరైరి.

జన్మాంతర సంస్కారముతో నావిర్భవించిన దివ్యభక్తి కార్యక్రమోత్సాహము మాత్రమే జీవితాంతమైనను జీవుని వెంటనంటి యూర్ధ్వలోకమునకు పయనించి రక్షణ చేకూర్చును.

## ౧౬

# తోలుతిత్తి రహస్యమెఱింగితివా?

శతకోటి గ్రంథములు అనేక జన్మలలో పారాయణము చేసి యాసంస్కారముతో మహాపండితుడై భువి జన్మించినను, అష్టావధానము శతావధానము మొదలైనవి చేసి పండిత ప్రకాండులచే ఘన కీర్తులందు కొన్నను, అక్షర లక్షలార్జించెడి కవితాశక్తి సంపన్నుడైనను స్వర్గసోపాన నిర్మాణశక్తి పొందినను, నీ పనికి మాలిన పాపిష్టి తోలుతిత్తి రహస్యమును తెలియుటకై యానాటి నుండి నేటి వరకు గణనీయమైన వ్యక్తులెందరో వివిధ విధానములను చేయుచునేయుండిరి ఒకరి విధానమును మరియొకరు హేళనము చేయుచు, ధ్యేయసిద్ధికి మా విధానము మేలైనదని మీ విధానము సరియైనది కాదని సర్వులు సత్యదూరులై యజ్ఞానమనెడి పెనుగోతిలో బడుచున్నారు.

సగుణారాధనమే తోలుతిత్తి రహస్యమును గుర్తించుటకు మార్గమని, కాదు! నిర్గుణారాధనమే దేహధారిని గుర్తించుటకు సులువైన త్రోవయని, వారు వీరు నిరుతెగల వారు వివిధ విధానములతో ప్రమాణబద్ధముగానే ప్రభోధ చేసిరి. ఇందేది సత్యము?

నవరంధ్ర బంధురమైన యీ మాంసదేహము నందే యాత్మ వెలుగొందుచున్నది. స్థూలదేహము సూక్ష్మదేహము కారణదేహములతోనున్న దేవాలయమున కాధారము ఆత్మయే!

ఆత్మదర్శనమును తోలుతిత్తి శిథిలము కాకముందే గట్టి ప్రయత్న ముతో పొందవలెను, తిత్తిలోనే మకాము చేసి దుష్టప్రేరణములకు లోనైన కామక్రోధ లోభమోహ మద మాత్సర్యము లనెడి దొంగ లార్గురను బంధించవలెను, సప్తవ్యసనములను నాశనమొందింప వలెను. అష్టమదములను అంతము చేయవలెను. పంచేంద్రియప్ర వృత్తులను పాడుచేయవలెను. ఈషణముల నీడ్చి పారవేయవలెను. వచ్చిపోయెడివా రిర్వురి నాటకట్టించవలెను. అవస్థాత్రయమునకు లోనై ఆశాపాశబంధనముతో 'దేహధారి' దిక్కుదెలియని స్థితిలో నర్థములేని అయోమయపు వాగుడుతో మహిషసంస్కారముతో నార్యుల వాక్యములను ఖండించుచు తన వాక్యమే పరమ ప్రమా ణమనుచు కామినీ కాంచనములనే కాంక్షించి జిహ్వేంద్రియ చాపల్యముతో గుహ్యేంద్రియచాపల్యముతో క్షణములో శ్మశా నముచేరి నక్కల కుక్కలపాలై మృత్తికలో కలసిపోయెడి వాస్తవవిషయమును స్మరించక మలమూత్రములతో నరములు శల్యములు రక్తమాంసాదులతో చీము నెత్తురులతో దుర్గం ధకలితములైన తుమ్ములు, తేపులు దగ్గులతో కపవాతపిత్త శ్లేష్మాదులతో డెబ్బది రెండు నరములతో నూటయెనిమిది కీళ్లతో తయారైన, ఈ మాయారూపమైన మట్టిబొమ్మనే గట్టిదనుకొని కామించి ప్రేమించి మోహించి, ప్రియురాలి దుర్గంధ పూరితమైన దేహము మేల్మి బంగారు వన్నెలకు మించినదని సంతసించుచు, మాంసపు ముద్దలైన యింతి పాలిండ్లపైగల భ్రమను తొలగించు కొనలేక కామోపహతులై మూత్రపుతిత్తినే, ఓహో ? అహా !

ఆహాహా ! దివ్యమదనమోహన మందిరమటంచు కామాంధులై మదాంధులై మన్ను మిన్నుగానని కన్నులతో దేవునిమాట బొత్తిగా మఱచి యౌవ్వనమంత దుండగములతోనే దుర్వినియోగము చేసి చివరకు కండలునశించి అండలఱుగంటి అగచాట్లకులోనై, తినుటకు తిండిలేక, కట్టుటకు బట్టలేక యుండుటకిల్లులేక నఱుపుటకు నోరులేక ఆర్యులుచెప్పిన నీతులను సద్గ్రంథములలోని సూక్తులను జ్ఞప్తిచేసికొనుచు కాలము జారిపోయినది. కథమారిపోయినది. బ్రతుకుకన్న చావే సుఖమురా ! యని దలపోయుచు మృత్యువు నాహ్వానముచేయుచు మరణసమయమెప్పుడా యని యెదురు చూచుచు, ఓ ! మనసా ! నీవెంత మోసకారివే! నా కొంప ముంచితివే, నే నున్న యీ పాపిష్టి తోలుతిత్తిని నమ్మి కలకాలము సుఖ భోగములతో స్థిరముగా నుందమనికొంటిని. అదిగో ప్రళయధ్వని భీకరాకారాలతో శూలపాశహస్తులై యమ కింకరులు ఈ పాపిని తోలుతిత్తినుండి బలాత్కారముగా బయటకు లాగుటకే వచ్చుచున్నట్లున్నది. అంతిమసమయమున నన్నాదుకునేవారే లేరా ? కని కని పాపిష్టిగుంపును కాపాడుటకై యడ్డమైన యన్యాయములు చేసితినే, పాపభీతి లేక, కుయ్యో ! మొఱ్ఱో! అనెడి నాతోటిమానవులను నడిబజారునకు లాగి అగౌరవముపాలు చేసితినే ? నా పాపాలన్ని నాముందు హాహాకారాలతో నృత్యములు సేయుచున్నవే? నాకుట్రలు కుతంత్రములు యుక్తులు మాయలు మోసములు నన్ను వదలక నాముందు సాక్షాత్కరించి గేలిసేయుచున్నవే? జీవితములోనే పొరపాటుననైన 'నారాయణా!

గోవిందా! హరే! ముకుందా! అని స్మరించనైతినే! ఆపదపాలైన నన్నాదుకొనుట కెట్టిపుణ్య కర్మలు చేయకపోతినే! ఆశాభంగమును పొందితిని. నామతి యెంతో నాగతియంతె యైనది. నా నరకమునకు నేనే కర్తను. నా దుఃఖమునకు నే తెలిసి చేసిన పాపకృత్యములే ప్రబలకారణములు, ప్రత్యాక్షానుభవములు. చెడినవాడిని చెడితిని. విన్నవారు నాగతి కన్నవారు. మీరెల్లరున్నవారితో నా స్తవము నుచెప్పి మీరు వారు కలిసి మంచిమనసుతో మంచిమాటలతో స్వార్థమున కాశించక సత్కార్మలు చేయుడి. సంఘము బాగుపడి నరక యాతనకు గుఱికాక కాలుని పాశములకు చిక్కక సర్వలోక రక్షకుడైన యా సర్వేశ్వరుని కృపను పొంది తరించగలదు. మరల 'తోలుతిత్తి'లో చేరక జనన మరణ రూపమైన సంసార సాగరమున బడెడి దుర్గతిని పొందక సద్గతితో 'సత్ – చిత్ – ఆనంద' ములకు మూలమైన ముక్తిని పొంది తరించుడి. జాగ్రత్త!

—o—

# ఏది సత్యములోని సార సంగ్రహము

ఇదంతయు, మహాత్ములైన పెద్దలైన శ్రీలక్ష్మీ నృసింహ స్వామివారి దివ్యకళావతార స్వరూపులు, దివ్య యోగసమాధిలో శ్రీ నృసింహ పరబ్రహ్మ స్వరూపులై వెలింగెడి మద్గురు సద్గురు శ్రీశ్రీశ్రీ యోగానంద నరసింహస్వామివారి దివ్య కరుణాశక్తి

ప్రసార ప్రభావమేనని శ్రోతలైనపాఠకులైన భక్తకోటికినీగ్రంథ రచయిత కోట సుబ్బరాయ గుప్త భాగవతులు భక్తితో సత్యమైన నిత్యసత్యమును మనవి చేయుచున్నాడు.

పాఠక మహాశయులైన పెద్దలు 'ఏది సత్యము' అనేది సమస్యా పరిష్కారమును వింటిరి. నిజమును గుర్తించితిరా! శ్రద్ధతో వినండి. శ్రీ సద్గురు మహావాణియే! శ్రీ సద్గురు మహా బోధయే! శ్రీ సద్గురు మహామంత్రమే! శ్రీ సద్గురు సత్యశివ సుందర నిర్వికల్ప స్వరూపమే సత్యము నిత్యము సర్వజనసంసేవితము.

మణిదీపములవలె నక్కడక్కడ నిత్యసత్య ధర్మాచరణులు, యతి నిరాడంబరులైన సద్గురువులున్నారు. వీరిని గుర్తించుట, గుర్తించి వీరి సన్నిధి చేరుట, చేరియు కామాదిరి పుషట్కమును జయించి సద్గురు కృపకు పాత్రులగుటయు బహుకష్ట సాధ్యము.

నేటి పాపిష్ఠి కలికాలమున రకరకములైన వ్యసనాదులకు గుఱియైన మేడిపండ్లవంటి గురువులే యెక్కువగా చలామణిలో యున్నారు. వీరి దర్జాలలో వీరి మజాలలో మాయకులైన మానవులెందరో చిక్కి నిజమైన సద్గురువుల దివ్య సన్నిధికి దూరమై, కష్టనష్టాలపాలై యగచాట్లకు గుఱియై సమాజాదరణకు దూరులగుచున్నారు.

ఇట్టి యగచాట్లకు ముముక్షువులైన స్త్రీ పురుషులు లోన

గుటకు కారణమేమి! వ్యక్తి ప్రవర్తనమును వ్యక్తి హృదయపు లోతులను సూక్ష్మ దృష్టితో పరిశీలనముచేసి సత్యమును గుర్తించక ముందే, వాని వేషభాషలు రూప లావణ్యములు రకరకములైన వైఖరీవాక్కులు వేదాంత ప్రవచనములు వినయవిధేయతలు చూచి ముగ్ధులై "వీరే సద్గురువులు పరమగురువులు మనల నుద్ధరించెడి నారాయణ స్వరూపు' లని నమ్మి వారి నాశ్రయించి వారి పాద శుశ్రూషలు చేసి ఘనమర్యాదలు చేసినతఱి, పెద్దలు పరమగురువులనుకున్న యీ తాత్కాలిక విరాగమూర్తి, చలన చిత్తుడై యున్న తరగతినుండి క్రిందికి దిగి కాంచన లోలుపు గానో లేక కామినీ లోలుపుగానో, లేక కామినీ కాంచనలోలుపు గానో మారి దుర్గతిపాలై, ఆర్ష సంస్కృతీ విధానమునకే సద్గురు సంప్రదాయమునకే యపభ్రంశమును నంటగట్టుట నేటికవిలో సహజమై రాణించుచున్నది.

ఇప్పటికైన ప్రతి ముముక్షువు సద్గ్రంథములను పారాయణముచేసి యందందుగల నగ్న సత్యాంశములను గుర్తించుకొని, జాగృతినిపొంది జాగరూకులై మోసపుగురువులను మాయగురువులను ధనకాంక్షతపనతో నద్వైత బోధలుచేసి వద్దచేరినవారి కాసుల నపహరించుచు చివరకు వారి మానాపహరణమునకే తారసిల్లెడి నీచ హృదయుల్లను గమనించి వారిని బహుదూరముగానుంచి వారికి బహుదూరముగా నుండుట సమాజమునకు నెంతయో శ్రేయస్కరము.

ముముక్షువులైన భక్తజనులెల్లరు భవబంధవిముక్తికై

'ఏది సత్యమో!' బాగుగా యోచించి ముందే జాగ్రత్తవహించి సత్యపరిశీలనముచేసి వారి నిజతత్త్వము బోధపడిన తదుపరి వారి యొద్దచేరి వారి తపశ్శక్తి కృపా పరత్వమునకు పాత్రులై వారి దివ్యాద్వైతతత్త్వ ప్రబోధములను నిర్మల హృదయులై భయభక్తులతోవిని యా ధర్మ సూత్ర రహస్యములను తెలిసికొని యాచరణతో మెలగి జీవన్ముక్తిని సుస్థిరమైన శాంతిని పొంది యానందించుడని విశ్వప్రేమతో 'ఏదిసత్యము!' మీకెల్లరకు చేయూతయై కంటికి రెప్పయై కాచి రక్షించుననియును కాంక్షించు చున్నాడ, —— ——

నిజమాలోచనచేసిన ప్రతివ్యక్తికి సత్యము వ్యక్తమగు చునే యుండును. నేటి నవీనయుగ పరిణామ దశయందన్ని రంగ ములలో సత్యాసత్యములు న్యాయాన్యాయములు ధర్మాధర్మములు కర్తవ్యాకర్తవ్యములు హాయిగా కలసియే కాపురముచేయు చున్నవి. పూర్వయుగములలో సత్యమునకు నసత్యమునకు "తూర్పుపడమరలంత వ్యత్యాసములు" "ఉప్పులో నిప్పువలె" నేమాత్రము పొత్తుకుదురక స్వయం వ్యక్తములై వ్యక్త ములగుచుండును.

నేటి కలికాలమున న్యాయాన్యాయములు రెండు నీరక్షీర న్యాయముగా కలసిపోయినవి. కలిదేవత వక్రదృష్టిపుణ్యాత్ములపై ప్రసరింపజాలదు. పాపమున్నవారిపైకి పరుగులు తీయసాగును. పాపముచేసిన నరనారీ సమూజము భయభక్తులులేని జీవిత విధాన ముల గడపుటయు, ఉన్న వరకు ననుభవించి సోపుదమనేడి

స్వార్థము, నరనరాలలో జీర్ణించుటయు, నరకస్వర్గాలు చూచి చెప్పినవారున్నారా? యనెడి నాస్తికవితండవాద నయు నహంకారముతో నవిశ్వాసముతో నాశాబాహాముతో, మహాత్ములను, మహనీయమైన గ్రంథ రాజములను నిరసించుటయు మొదలైన నాస్తిక రూపములే! ప్రబలకారణములై కన్పట్టుచున్నవి. —

నిదానముగా నిబ్బరముగా మీలో మీరే యోచించి అంతరాత్మ ప్రేరణ కనుగుణముగా మెలగి సుఖమును పొందుడు. ప్రొద్దుపోక పనిలేని సోమరులతో పనికిమాలిన లోకాభిరామాయణమునకు చెవియొగ్గక 'క్షణములో వల్లకాటికి చేరగలము. ఎట్టివానికి తప్పదనెడి నిత్యసత్యమును తెలిసి యజాగ్రత్తచేయక త్వరపడి దేవునిగా మారుటకై కర్తవ్య కర్మను ప్రారంభము చేయుడు. భయము గలిగి భవనరకము తప్పదురా! యనియెఱింగి యిట్టి సద్గ్రంథాదేశములను శిరసావహించి పరిశుద్ధ హృదయముతో ప్రతిపనిని కర్మ బుద్ధుడవై చేయుచు, మూడునాళ్ళ బ్రతుకునకు మురిసిపోయి చంకలు గొట్టక, ఎవరికివారే 'నాగతి సద్గతికి పురోగమిస్తున్నదా? లేక దుర్గతికే దిగజారుచున్నదియా?' అని యెప్పటికప్పుడు నీలో నిన్ను నీవే ప్రశ్నించుకొని యాత్మోద్ధరణము నొందుటకు పాటుపడుము. క్రమేపి సర్వసంసారబంధములనుండి విడివడి నిన్ను నీవే యుద్ధరించుకొనుము. లేనిపోని మమకారమునంతటిని నెత్తికెత్తికొని యాకారమునే మార్చుకొని, భగవన్నామ స్మరణ భజన ధ్యానాది కార్యములకు వినియోగించవలసిన కాలమును యహరహము లేనిపోని దరిదాపు దొరకని

సంసార వ్యాసంగాది కుటుంబ నిర్వహణ కార్యక్రమములందే దుర్వినియోగము చేయుచున్నాడు లౌకికుడైన మానవుడు.

ఆచరించవలెననెడి యీ వేదనయున్న పరిశుద్ధ హృదయులకు దివ్యభావసముదాయముతో వెలుగొందెడి 'ఏదిసత్యము?' అనెడి ఈ పొత్తము చాలు! ఏక మనేకమైనది, యనేక మొక్కటియై వెలుగొందవలెను. ఇదియే వేదాంతరహస్యము.

ఆదికి నాదియైన యనాదికాలములో స్వయంవ్యక్తమై వెలింగెడి మహామహిమాన్వితమైన యఖండ స్వరూపశక్తియగు అద్వైతమే! ద్వైతరూపముగా భాసించినది. ఈ భ్రాంతి జన్యమైన మాయారూపమగు ద్వైతదృష్టి ద్వైతభావనలు మత మౌఢ్యము "నీ - నా" యనెడి భేదము మొదలైన మనోవికారాదులను పూర్తిగా నిశ్శేషముగా త్యజించి వినిర్మలమైన శుద్ధ సాత్త్విక ప్రవృత్తితో, మిన్నువిరిగి మీదపడి నను జంకని బొంకని సత్యమార్గావలంబనముతో నిత్యము దైవీసంపద్విభూతితో కాలమును సద్వినియోగము చేయుటయే మానవుని ప్రధాన కర్తవ్యము.

ఇట్టి దివ్యజీవితగమనము సక్రమమైన విధానముతో సాగిపోవలయుననిన, సద్గురువుల కృపాప్రసారమున సాధ్యము కాగలదు. సద్గురు దివ్యవాణి వ్యక్తిరూపధారణకు నిలయము. జీవితాశయసిద్ధికి సోపానము.

శ్రీ సద్గురుదేవులు యోగానంద నరసింహ స్వామివారు,

ప్రహ్లాదభక్తినే ప్రధానముగా గొని ప్రహ్లాదునివలె ప్రత్యక్షమువు నందు శ్రీహరిని దర్శించుడు దివ్యజన్మమును పొంది, శ్రీమన్నారాయణుని మహాశక్తి స్వరూప సాక్షాత్కారమే! శ్రీ వీర నృసింహస్వామియని తన ప్రియశిష్యులకు బోధించి శ్రీ ప్రహ్లాద భక్తినే సర్వులకు ప్రబోధముచేసి వారెల్లరిని నృసింహారాధకులుగా ప్రహ్లాద భక్త్యోపాసకులుగా పరిణామ మొందింప చేసిరి. శ్రీ లక్ష్మీనృసింహ జయంతి మహాపర్వదివసమున 'కపిలగిరి' సన్నిధిని విధిగా భక్తులైన శిష్యులచే 'భక్త - ప్రహ్లాద చరిత్ర' నాటకము నాడించెడివారు.

శ్రీ శ్రీ యోగానంద నరసింహస్వామివారి ధ్యేయవస్తువైన శ్రీశ్రీశ్రీ లక్ష్మీ నృసింహస్వామివారి పరిపూర్ణ కృపకు పాత్రులైన శ్రీ ప్రహ్లాద స్వామివారి దివ్యజీవిత కథాగానమును, నీ గ్రంథ రచయిత, కోట సుబ్బరాయ గుప్త భాగవతులు - శ్రీ సద్గురు స్వామి కృపతో, ఆంధ్ర దేశమునందనే కాలయములలో, పరమ పవిత్రములైన సిద్ధ తపోక్షేత్రములలో సాధుసభలలో కవి పండిత విద్వత్ గాన సభలు మొదలైన పుణ్యస్థలములయందు 'భక్త - ప్రహ్లాద చరిత్ర' హరికథా గానముచేసిరి, ఆర్యులైన విజ్ఞులైన రసజ్ఞులైన మహాత్ములైన పండితాగ్రేసరులైన, శ్రీ వీర శైవ మత ప్రవక్తలు - శ్రీ గిరిరాజ సూర్య సింహాసనమఠాధీశ్వరులు, శ్రీ శైల జగద్గురు వాగేశ పండితారాధ్య శివాచార్య మహాస్వామివారి దివ్యప్రేమ శుభాహ్వానముతో-

గుంతకల్లు పట్టణమున శ్రీ వారి మఠమునందే 1966 వ సెప్టెంబరు 15 వతేదీన, శ్రీ శ్రావణమాస పూజాసమాప్తి మహోపర్వమున – పూజ్య శ్రీ – శ్రీ కేశవ తీర్థస్వామివారి కృత్యము – భక్త – ప్రహ్లాద చరిత్ర – హరికథనుచెప్పి జగద్గురువులైన శ్రీవారిచే 'కీర్తనకంఠీరవ' యను బిరుదు సన్మానమును పొందుటయు, తదితరులైన పెద్దలచే 'కవివతంస' 'కవితిలక' 'కథాభారతి' యను బిరుదు సన్మాములు పొందుటయును, సద్గురు శ్రీయోగానంద నరసింహస్వామివారి యనంత కరుణా ప్రసార ప్రభావమే! శ్రీ సద్గురు దేవుల దివ్యశక్తియే! దివ్యవాణియే! సత్యమైన సత్యము. నిత్యమైన సత్యము. సనాతనమైన పరమ సత్యము.



—o—

# తప్పొప్పుల పట్టిక

| పేజినెం | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 14 | 6 | శాంతితో | నశాంతితో |
| 19 | 18 | భరించుచుండును | చరించుచుండును. |
| 23 | 17 | స్పష్ట | స్రష్ట |
| 28 | 3 | దైవత్వము | ద్వైతము |
| 30 | 6 | విశేషముగా | విశ్శేషముగా |
| 32 | 6 | ట్టుత్పత్తి | ట్లుత్పత్తి |
| 44 | 16 | కవితావరణమున | కలివాతావరణమువ |
| 45 | 2 | పూనుకొనుడు | పూనుకొనును. |
| 46 | 21 | మారుచుండునునా | మారుచుండునురా |
| 52 | 8 | స్పృరించి | స్ఫురించి |
| 53 | 12 | చేసినట్టె | చేసినట్టి |
| 67 | 21 | మాటనే | మాటలే |
| 79 | 8 | భక్తిజ్ఞా | భక్తిజ్ఞాన |
| 84 | 12 | పాటించనవారికే | పాటించినవారికే |
| 85 | 3 | నిర్మిమిత్తముగ | నిర్నిమిత్తముగ |
| 87 | 5 | మనికాలము | మన్నికాలము |
| 93 | 2 | మానవకన్మ | మానవజన్మ |
| 95 | 19 | కాకిక | లౌకిక |
| 100 | 1 | పక్రమ | సక్రమ |

| | | | |
|---|---|---|---|
| 106 | 3 | జీపుల జ్ఞానమను | జీవులజ్ఞానమను |
| 113 | 4 | నాటివరకు | నేటివరకు |
| | 8 | త్యాగరాజాకృతి | త్యాగరాజకృతి |
| 115 | 1 | వలు | పలు |
| 120 | 11 | లౌకికాధ్యాత్మిక | ఆధ్యాత్మిక |
| 122 | 1 | ద్వైతివైనన | దైతివైన ద్వైతివైన నద్వైతివైన |
| 127 | 5 | దుష్టహృదయభీకమై | దుష్టహృదయ భీకరమై |
| 134 | 15 | పద్మరత్నములను | పద్యరత్నములను |
| 137 | 2 | నేను నన్నుఅను | నేను వన్నయను |
| 138 | 15 | కవి | కలి |
| 139 | 4 | విద్యా | దివ్యా |

81 4 లో 'తిరుచునాపల్లికి నాలుగుమైళ్ళు ధూరములోగల (తిరుకోట్టి యూరు)లో గాలి గోపురమెక్కి శ్రీ రామానుజాచార్యులువారు మహాజనులెల్లరు విని ముక్తి నొందెదరను సద్భావముతో అష్టాక్షరీ మంత్రమును బిగ్గరగా పదేపదే పలికినారు.